# ఎంకి - నాయుడుబావ





ఏటి ఒడ్డున మేము ఎన్నట్లో కూసోని
ఆడనే ఉండాల గుడిసేసుకోవాల!
గుడిసెకాడే ఎంకి ఇంటికినే కట్టాల
నాగాభరణ సిస్మెంటు తెచ్చి కడతానంటు
ఒట్టిమ్మ ఒళ్ళంత కితకితలు పెట్టాడు
నమ్మించి ఎల్లాడు ఈ రోజు
నగుబాటు సేయడే నారాజు

ఆంధ్రసచిత్రవారపత్రిక

విడి ప్రతి వెల రు. 4-00

సంపుటము 81 స్థాపితం 1908 బొంబాయి · 1914 మద్రాసు సంచిక 52

వ్యవస్థాపకులు దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు

(1938-1972 సంపాదకులు) శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక ప్రెస్, గాంధీనగరం, విజయవాడ-3, ఫోన్‌లు 75667, 61247, 61248

# మనలో మాట

దేవుడు ప్రకృతి-దయ్యం వికృతి కంగారు పడవలసిందేమీ లేదు! దెయ్యాల కథల పోటీ పెడు తున్నాము అనంగానే "బాబోయ్! క్షుద్రమైన కథలా?" అని బెంగపడవద్దు! 'పాజిటివ్ థింకింగ్' " సోషల్ అవేర్‌నెస్" లాంటి కబుర్లు చెబుతారేవాళ్ళని కూడ "డంగై" పోయేలాగ చేస్తూ "దెయ్యాల" కథలు రాయొచ్చును మనుషులకు మనుషులు చేసినంత అన్యాయం "దెయ్యమ్స్"-చెయ్యవు-పోగా అవి "హెల్ప్" చేస్తాయి గూడాను "ఒన్ మాన్స్ గాడ్ మే బి అదర్ మాన్స్ డెవిల్" అని అనొచ్చా? యిల్లాంటివి "గిరీశం" చెప్పాల్సిన సంగతులు! ఈ పోటీ వల్ల కొన్ని సుఖాలున్నాయి

ఇదివరకు రాసిన కథలను బూజు దులిపి మళ్ళీ పంపనక్కరలేదు-రాసిన కథ "ఏ పత్రిక్కి? పంపడం"- అంటూ సందిగ్ధారావులు కానక్కరలేదు హాయిగా కొత్తగా రాసి నేరుగా ఎడిటర్, ఆం స వా ప , గాంధీనగరం, విజయవాడ-3కి పంపొచ్చు! 'దెయ్యాల కథల పోటీ'లో పాల్గొన్న రచయితలకు-మరో 'రిలీఫ్'-పాఠకుల బ్యాలట్ వుండదు-పాఠకులకీ 'రిలీఫ్' ఇది కథ రాయడం కన్న కథమీద వ్యాసం రాయడం గొప్ప "చిరాకు" అంటారు చాలామంది ఈసారి "దీపావళికి" యీ వెరైటీ పోటీ పెట్టాం- "బంతి యిప్పుడు మీ కోర్టులో వుంది" రచయితలందరికీ ఆహ్వానం!

వినాయక చవితి సంచికని హాస్య సంచికగా తీర్చిదిద్దుతున్నాము ఈసారి సంచిక 82వ పుట్టింరోజు సంచిక అవుతుంది అనగా "మాకిది తెనుగువారి నిరంతర నిత్యనూతన సేవలో" 82వ సంవత్సరం అవుతుంది అభిమాన పాఠకులు వారి స్నేహితులు కూడా ఆంధ్ర సచిత్రవార పత్రిక పాఠకుల కుటుంబంలో చేరే విధంగా ప్రయత్నించాలని మనవి!

## పదండి లోపలికి!



ముఖచిత్రం :
"నవ్వే భాగ్యం" - అంటున్నపాటి [illegible]
(ఫోటో : [illegible] మూర్తి)

పై వారం :
గర్భిణీస్త్రీలు-జాగ్రత్తలు !
ప్రత్యేకవ్యాసం

### ఈవారం ప్రత్యేకం:-



### కథలు :-



### సీరియల్ నవలలు:-



### వ్యాసాలు, శీర్షికలు:-

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్

ఆంధ్ర సచిత్ర వార పత్రిక

విజయవాడ ఎడిటోరియల్ అడ్వయిజర్ శివలెంక రాధాకృష్ణ ఎడిటర్ వీరాజీ

18-8-1989 ముద్రాపకుడు, ప్రచురణకర్త శివలెంక నాగేశ్వరరావు శక సం 1911 శ్రావణమాసం 27వ తేదీ

# ఐననూ, ఎత్తుగా ఎత్తుగా ఎగురవలె మన జెండా!

నలభైమూడోసారి భారత స్వతంత్రదినోత్సవం చేసుకుంటూమూడు రంగుల అందాల పతాకాన్ని ఎగరేసుకుంటూ, "పండుగ" చేసుకుంటున్న సమయాన- *1947* ఆగస్టు *14*, అర్ధరాత్రి-భారతదేశం అంతటా ఒక్కసారి "భళ్లున" తెల్లవారిన సంగతి మనందరికి స్ఫురణకు రావాలి!

స్వాతంత్ర్యోద్యమ చివరి ఘట్టంలో ఉద్యమ నాయకత్వం స్వీకరించి తనదైన కొత్త "బాణీ"లో సత్యాగ్రహాహింసలమార్గంలో పోరాటం సాగించి గెలిచిన మోహన్‌దాస్ కరమ్‌చంద్‌గాంధీజీని- ఆ వెంటనే "హత్య"చేసిన పవిత్ర భారతదేశం మనది ఈ భూమ్మీద నుంచి బ్రిటిష్‌జెండా దిగిపోయి మువ్వన్నె పతాకం ఎగిరింది అంటే దానర్ధం యేమిటో యింకా మూలమూలల వున్న కుగ్రామాల అమాయక ప్రజలకి అర్ధం కాకుండానే- మహాత్ముని సలహా సదుపాయాలు- కోల్పోయిన మనదేశం అటు తర్వాత "ఆ సేతుహిమవన్నగమూ" ఒక్కత్రాటిమీద నడిపించగల అట్టి మరొక నాయకుణ్ని పొందలేకపోయింది భారతదేశం 'సర్వసత్తాక సోషలిస్టు సెక్యూలర్ రిపబ్లిక్'గా అవతరించే శుభసమయాన "జాతిపిత" ఎండకి ఎండీ వానకితడిసే సిమెంటు బొమ్మలుగా మారిపోయాడు అదృష్టవశాత్తు గాంధీపుట్టిన దేశంలో *8*సార్లు ఎన్నికలు జరిగి-అన్నిసార్లూ "ప్రజాస్వామ్యం", ప్రజల కడుపు చల్లగా బ్రతికి బట్టకట్టింది!

ఇవాళ పేట పేటలో 'దాదాగిరీ' జమాయిస్తూ "ఛోటా"లు ఎగురవేస్తున్న జాతీయ పతాకాలు-యీ జాతి చరిత్రను- యీ జాతి పవిత్రతను గాక- యీ దేశాన్ని గడచిన *40* సంవత్సరాలకు పైగా పట్టిపీడిస్తున్న రాజకీయ కాలుష్య పీడనే సూచిస్తున్నాయి! దేశంలో రాజకీయాలు ప్రవేశించని రంగమే లేదు- విద్యారంగంలో, పత్రికా రంగంలో కూడా, యీ "రాజకీయ కాలుష్యం అరాచకత్వం వూడలు వేయటం ప్రారంభిస్తున్న దశలో ఈసారి స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలు- *9*వ సారి దేశ వ్యాప్తంగా పార్లమెంటుకు- అసెంబ్లీలకు జరుగనున్న సార్వత్రిక ఎన్నికలవైపు దృష్టి సారిస్తున్నాయి! ప్రజాస్వామ్య పరిరక్షణకు యివ్వాల్టి దాకా నాయకత్వం- అది ఏ పార్టీకి చెందినదైనా సరే- చేసిన చేస్తున్న కృషి కన్నా- "గోచి పాతరాయుళ్లు"- నిరక్షరకుక్షులు, పేద రైతులు, కార్మికులు- ఏ జెండా కర్ర నెందుకు (ఏ పార్టీకి చెందినదైనా) పట్టుకుని కృషి చేస్తున్నారో అర్ధం చేసుకోలేని యువతీ యువకులు- ఎన్నికల తదనంతరం దేశం చిన్నాభిన్నం కాని రీతిలో కాపాడుతూ వచ్చారు!

ఇప్పటికీ ఈదేశంలో ఎగురుతున్న మూడు రంగుల అశోకచక్ర జెండా, కాంగ్రెసు పార్టీ జెండాయే ననుకొనే అమాయక పౌరులు వున్నారు! దేశంలో భిన్నత్వంలో ఏకత్వం వింతపోకడలు పోతున్నది! ఇవాళ ప్రజలు పరిపాలనా వ్యవస్థకు ఇద్దరు చెడ్డవాళ్ల మధ్య ఎవరో ఒకర్ని ఎన్నుకోవల్సిన విచిత్ర విపత్కర స్థితిలో, అయోమయంలో పడి వున్నారు- రాజకీయాలు! రాజకీయాలు" మరిన్ని రాజకీయాలు" దేశాన్ని అతర్గతంగా పీల్చి పిప్పి చేస్తున్నాయి!

గడచిన సంవత్సరం వచ్చిన కరువు కాటకాలను కూడా తలదన్ని- దేశంలోని రైతు పంటలు పండించాడు అయినా పెదవారూ, కడు పేదవారూ దేశంలో యెక్కువై పోయి- పరిపాలనా యంత్రాంగాన్ని హస్తగతం చేసుకున్న నాయకులు, రకరకాల పేర్లతో ప్రవేశ బెట్టే "ఉపాధి పథకాల" ద్వారా విదిలించే గింజల మీద ఆధారపడవలసి వస్తున్నది! అన్ని బాధలకి మించిన బాధ దరిద్రం- అన్ని పీడలను కాలుష్యాలను మించిన కాలుష్య విషం రాజకీయం- ఇవే నాలుగు దశాబ్దాల తర్వాత యీ దేశాన్ని పట్టి బల్లార్చుతున్నాయి! దేశంలో కాశ్మీరం- పంజాబ్- అస్సాం రాష్ట్రాలవంటి సరిహద్దు రాష్ట్రాలలో సుస్థిరత లేదు- పంజాబ్ రాష్ట్రంలో "నరమేధం" ఆగలేదు ఇరుగుపొరుగు దేశాలతో మన "మైత్రి"యింత పిసరు మెచ్చదగినదిగాలేదు నేపాల్‌తో శ్రీలంకతో-బంగ్లాదేశ్‌పాకిస్తాన్‌లతో, చైనా డ్రాగన్‌తో మనకి మర్యాదా మన్ననా లభించె మైత్రీ సామరస్యాలు లేవు! ఇవాళ దేశాన్ని పరిపాలిస్తున్న కాంగ్రెసు పార్టీ నాయకత్వం మున్నెన్నడూ లేనంతగా- బోఫోర్స్ శతఘ్నులు హెచ్ డి డబ్ల్యు సబ్ మెరీన్‌లు- ఓ ఎన్ జి సి హెలికాప్టర్‌లు మొదలైన అతి కీలకమైన దేశరక్షణ - అభివృద్ధికి చెందిన కొనుగోళ్ల కుంభకోణాలలో పీకల మొయ్యా దిగబడిపోయింది దేశంలో మనిషికి మనిషికి "దేశభక్తి" అనే మాటకి అర్ధం మారిపోయేటంతగా, కేంద్ర రాష్ట్రాల మధ్య సంబంధాలు -(పాపం! సర్కారియా కమిషన్) దిగజారిపోయాయి! దేశ ఆర్ధిక వ్యవస్థ ఏయేటికి ఆ యేడు వెనుకపడిపోవటమేగాక- అప్పులు ఎక్కువ- విదేశీ మారక ద్రవ్య నిల్వలు తక్కువ అయిపోతున్నట్లు ప్రభుత్వ నివేదికలే వెల్లడి చేస్తున్నాయి

ఐనా, తొమ్మిదోసారి- దేశంలో నూనూగుమీసాల యువకులను పాల బుగ్గల యువతులను బ్యాలట్ బాక్సు దగ్గరికి తీసుకుపోతున్న ఎన్నికలు వస్తున్నాయి ఇది ఒక "నూతన శకోదయం"- ఈ ఏడాది చివరనే పొంచి వున్నది" దాన్నుంచి- రేపటి పరిపాలనా వ్యవస్థకు రాగల లాభాలను యిప్పుడు మనం అంచనాలు కట్టి, బేరీజు వేసుకోగల స్థిమితంలోగాని స్థిరత్వంలోగాని లేము కాంగ్రెసు (ఐ) పార్టీ- తతిమ్మా ప్రతిపక్షాలు నడిబజారులో చౌకబారు స్థాయిలో నోరుపారేసుకుంటూ- యీ దేశం గడచిన అర్ధ శతాబ్ద కాలంలో రాజకీయ పరిణతిని, సంయమనాన్ని యింత పిసరునేర్చుకోలేదన్న నిర్వేదాన్ని కలిగిస్తున్నాయి!

ఐతేనేం- మనం కోరుకునే ప్రజాస్వామ్యం! మన ప్రాణాల కన్నా మిన్నగా ప్రేమించే దేశ సమగ్ర స్వాతంత్ర్యం- యిక్కడ చిరంజీవులై శాశ్వతంగా వుండాలని కోరుతూ- తప్పటడుగుల పసిబాలుర నుంచి కాటికి కాళ్లు జాచిన వృద్ధుల దాకా అంతా- కొన్ని వందల సంవత్సరాల నిరుపమాన పోరాటానంతరం ఎగుర వేసిన మువ్వన్నె జెండాని "జెండా వూంఛా రహే హమారా" అంటూ మరోసారి ఎగురవేసే నిత్య నూతన దివ్యదివసమిది! అందుకే జాతీయ పతాకం సాక్షిగా అందరికీ శుభాకాంక్షలు! జేజేలు! అందుకే అంటున్నాము, ఐననూ ఎత్తుగా ఎత్తుగా ఎగరవలె మనజెండా ●




(గత సంచిక తరువాయి)

ఈసారి చిన్నోడు దాని పంజాదెబ్బకు అందకుండా ఒడుపుగా తప్పించుకున్నాడు

దాంతో పులిరెచ్చిపోయింది

గాల్లోకి వుండచుట్టుకుని బంతిలా ఎగురూ అతని మీదికి దూకేసింది

ఈసారి తగిలిన పంజాదెబ్బకు తట్టుకోలేక పోయాడు చిన్నోడు

బయంకరమైన ఆర్తనాదం చేస్తూ ఎగురుకుంటూ వెళ్ళి ఓ చెట్టు మొదలుకు గుద్దుకున్నాడు

చేతిలోంచి పిడిబాకు జారిపోయింది

పులిపంజా దెబ్బకు చిన్నోడి బుజం మీది కండ పెకలించుకుంటూ బయటికొచ్చింది చెయ్యి మొత్తం పూడిపోయినంత బాద కలిగింది చిన్నోడికి

కళ్ళు పెద్దవి చేసి పులికేసి చూస్తూ లేచి నిలబడ్డానికి ప్రయత్నించాడు నడుం ఖలుక్కుమనడంతో అతని ప్రయత్నం పలించలేదు

పులికళ్ళలో దారుణమైన కసి స్పష్టంగా కనిపిస్తోంది

వేగంగా వూపిరి పీలుస్తుండడంతో దాని డొక్కలు ఎగసి ఎగసి పడుతున్నాయి

సరిగ్గా అదే సమయంలో చిన్నమ్మకు స్పృహ వచ్చింది

చిన్నోడికోసం నేల తడుముతూ పూర్తిగా స్పృహతో కొచ్చి లేచి కూర్చుందామె

అంతే!

ఎదురుగా కనిపించిన దృశ్యానికి ఆమె గుండె బద్దలైంది

రెండు చేతులూ నోటికి అడ్డం పెట్టుకుంటూ గుండెలవిసి పోయేట్టు బయంకరంగా ఒక్క పొలికేక పెట్టింది

చిన్నోడు అదిరిపడి ఆ వైపు చూశాడు

అతని గుండె ఒక్కసారిగా దిగజారి పోయింది

సిన్నీ! రామాకో! గొంతు పెగుల్చుకుంటూ బిగ్గరగా అరిచాడు

అయితే అప్పటికే ఆలస్యమై పోయింది

రక్తంలో స్నానం చేసినట్టున్న చిన్నోడ్ని చూస్తూనే ఆమె ఒక్కుమ్మడిగా లేచి వెర్రిదానిలా అతనివైపు పరిగెత్తింది

రామాక సిన్ని రామాకో! కీచుగా అరిచాడు చిన్నోడు

కానీ ఆమె సుడిగాలిలా వచ్చి అతన్ని చుట్టేసింది

చిన్నోడి చూపులు చప్పున పులివైపు తిరిగాయి

చిన్నమ్మకేసే క్రూరంగా చూస్తోందది

దాని డొక్కలింకా ఎగసి పడుతూనే వున్నాయి

చిన్నమ్మ వైపు చూస్తూనే ఒడ్డాల్లాంటి కోరలు బయట పెట్టి పెద్ద పెట్టున గాండ్రిస్తూ ఒకడుగు ముందుకేసింది

అది చూస్తూనే మరోసారిపొలికేక పెట్టింది చిన్నమ్మ

ఆ గండి!"

ఒక గూడేనికి చెందిన వృద్ధుడొకడు చొరవ చేసుకుంటూ ముందుకొచ్చాడు అందరి మాపులూ ఒకేసారి అతనివైపు తిర గాయి

తన గూడేనికి చెందిన నాయకుడివైపు అర్థిస్తున్న వాడిలా చాశాడా వృద్ధుడు

"దొరా ! కండబలం చూపేందుకు కాలం ముందుంది," హెచ్చరికగా అన్నాడు. "ముందర వులి సంగతి సూడాల మన మీద పోరుకుంటూ కూకుంటే పులవతల లగెత్తుకొచ్చి దానివనది సూనుకుపోతాది !"

"యీాల్లేదు !" మీసం దువ్వు కుంటూ మొండిగా అన్నాడు నాయ కుడు. "తాడోపేడో యీాడ్నే తేలిపోవాల!"

అతని చేతిలోని గండ్రగొడ్డలి మరింత పైకి లేచింది

వెంటనే రెండోగూడెం నాయకుడు ఈటె తిప్పుకుంటూ ముందుకొచ్చాడు



# వజ్రసంకల్పం

"జై మాంకాళమ్మా !" ఉద్రేకంతో అరిచాడతను.

"మరింకేందిరా నిలబడే వుండావ్? రా ముందర ! ఇయ్యేల మీ గూడెపోళ్ళో మా గూడెపోళ్లో ఒక్కళ్ళే మిగలాల !" హుంకరించాడు.

ఇందాకటి వృద్ధుడు ఈసారి ఎదిరి నాయకుడివైపు తిరిగాడు.

"పోరు కోరుకోకు సింగన్నదొరా!" తీవ్రంగా అన్నాడతను.

"మీ గూడెపోళ్లకి మా గూడెపోళ్ళ పోరులో తీసిపోరు. కానీ, ముందర పులి సంగతి చూడు మాకు మీరూ, మీకు మేమూ పాత పగోళ్లం. మనిద్దరికీ పులి గాడు పగోడు. ముందర పెద్దపులి పని పట్టాలి. అనక మనం కత్తిపట్టాల అద్దీ జరగాల్సింది."

వృద్ధుడామాట చెప్పగానే ఎదిరిగుంపు లోంచి మరో యిద్దరుముగ్గురు తలలుపం డినవాళ్ళు ముందుకొచ్చారు

"ఈరయ్య సెప్పిందీ సత్తెంగానే వుండాది, యినుకోదొరా !ముందర పులి, అనక పోరు !" అన్నారు వాళ్లు.

సింగన్న దొర ఒక్కక్షణం ఆలోచించి ఎదిరి నాయకుడివైపు చూశాడు

వెంటనే ఈరయ్యకు వత్తాసుగా అతని గుంపులోంచి కొందరు ముందరకొచ్చారు

"ఈరయ్య సెప్పిందినుకోదొరా!" అన్నారు

"ఊ!" అయిష్టంగా గండ్రగొడ్డలి కింద కిదించాడతను.

వెంటనే సింగన్నదొర కూడా ఈటె దించేశాడు.

మరుక్షణం ఆయుధాలన్నీ కిందికి దిగి పోయాయి.

ఈరయ్య అందర్నీ వుద్దేశించి గట్టిగా అరిచాడు.

"లెగండి ! పులిమీదికి పోదాం!"

అతనామాట పూర్తిచేశాడోలేదో డప్పులు మళ్లీమోగడం మొదలెట్టేశాయి.

కొమ్ము, బూరాలు పూరించబడ్డాయి

దివిటీలు పైకిలేచాయి.

బ్రహ్మాండమైన కోలాహలం ప్రారంభ మైంది.

శత్రువులిద్దరూ ఏకమై ఉమ్మడిశత్రు వైన పులిమీదికి బయల్దేరారు.

కోలాహలం ఆకాశానికంటింది !

** ** **

చిన్నోడు గుంజుకుంటున్నాడు.

కూర్చున్నచోటనుంచి కదలడానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్నాడు.

చిన్నమ్మ అతని మెడచుట్టూ చేతు లువేసి పులికేసి భయంభయంగా చూస్తూ వణికిపోతోంది.

గుర్రుమని శబ్దం చేస్తూ మరో అడుగు ముందుకేసింది పులి.

"సిన్నీ, పారిపో !" ఆమెను దూరంగా నెట్టేయడానికి ప్రయత్నిస్తూ హెచ్చరించాడు చిన్నోడు.

ఆమె వినిపించుకోలేదు.

అతను తనని తోసేస్తున్న కొద్దీ మరింత గట్టిగా అతన్ని చుట్టుకుపోతోంది

"పారిపో సిన్నీ, పారిపో !" వగ రుస్తూ అంటున్నాడతను

పులి నడకవేగం పెంచింది. మరు క్షణం దాని నడక పరుగులోకి మారిపో యింది.

చిన్నోడి గుండెలు డప్పుల్లా మోగుతు న్నాయి.

ధారపాతంగా కారుతున్న చెమట రక్తంతో కలిసిపోతోంది.

"పారిపో సిన్నీ !" వేడుకుంటు న్నాడు.

ఈలోగా పులివేగం మరింతగా పెరిగి పోయింది.

దానికీ తమకూ మధ్య కొన్ని అడు గులు తేడా అంతే !

అయిపోయింది ! ఈనాటితో తమ ప్రేమకథ సమాప్తం.

"పారిపో సిన్నీ !" చివరిసారిగా అర్థించాడు.

ఈసారికూడా అతని మాట విని పించుకోలేదామె. మృత్యుదేవతలా తమ వైపు దూసుకొస్తున్న పులిని కళ్లు పెద్దవిచేసి

రతనాలు వినూత్నమైన సమ్మోహశక్తితో మనిషినెప్పుడూ ఆకర్షిస్తూనే ఉన్నాయి రాతి యుగంలో మనిషి ఇతరుల దృష్టి తానుపడటా నికి ముళ్ళను, ఎముకలను, ఈకలను సౌందర్య కారకాలుగా ఉపయోగించేవాడు తరువాతనే కొన్ని విలువయిన రాళ్ళను గుర్తించి ఉపయో గించడం మొదలు పెట్టాడు

రతనాలు ముఖ్యంగా నాలుగురకాలు- వజ్రాలు, కెంపులు, ఇంద్రనీలమణు లు, పగ డాలు ముత్యాలను వీటికోవలోకి చేర్చరు ఎందుకంటే ముత్యాలొక్కటే సముద్రంలో తయారవుతాయి

రతనాలలో ప్రతి అణు వు అతివిలువ యినవే రతనాలను కారట్లలో, పాయింట్లలో కొలుస్తారు గ్రాములో 5వ వంతును కారట్ అంటారు కారట్‌లో వందవ వంతును పాయింట్ అంటారు రతనాల నిపు ణు లు వీటి విలువను గుర్తించడానికి వేర్వేరు కొల తలను ఉపయోగిస్తుంటారు ఉదాహరణకు వజ్రాలను- కారట్, కట్, కలర్ (రంగు), క్లారిటీ (స్వచ్ఛత) అనే నాలుగు'సి'లను కొలబ ద్దలుగా ఉపయోగిస్తారు కట్ అంటే వజ్రం ఎంత అందంగా, ఎన్ని ముఖాలతో ముక్క లుగా చేయబడిందో తెలిపే విధానం సాధా రణంగా వజ్రానికి 58 ముఖాలు ఉంటాయి వీలయినన్ని ఎక్కువ కోణాలున్న వజ్రం అతి విలువయినది

వజ్రాలు నీలం, పసుపు, ఆకుపచ్చ, ఆఖ రికి ఎరుపు రంగులలో కూడా దొరుకుతాయి తెల్లని వజ్రాలు అన్నిటికంటే విలువయినవి వజ్రం విలువ గుర్తించడానికి వజ్రాల నిపు ణు లు ఒక ప్రయోగం చేయమని సలహా

**ఇంతవరకూ సాగిన కథ- 9:** విశ్వధరవర్మకు తండ్రి అనంతరం మిగిలిన బీడు భూమిలో బావి త్రవ్వుతుండగా అపురూపమైన వజ్రం దొరుకుతుంది. అతని దాయాది అయిన వజ్రపాణి దాన్ని కాజేయాలనుకుంటాడు. ఆ వజ్రాన్ని కాపాడుకునేందుకు చేసిన ప్రయత్నంలో విశ్వధరవర్మ కొడుకు రాజేంద్రవర్మ, అతని కుటుంబం వజ్రపాణి కత్తికి ఎరలవుతారు. విశ్వధరవర్మ చిన్నకొడుకు నరేంద్రవర్మపై హత్యానేరం మోపబడి ఉరిశిక్ష పడుతుంది. జైలర్ సత్యం అనుమతితో జైలులో గడిపిన నరేంద్రవర్మ భార్య కౌసల్య ఒక మగబిడ్డకు జన్మనిస్తుంది. ఆ బిడ్డ పుట్టిన ఆనందంలో విశ్వధరవర్మ ధైర్యం పుంజుకొని వజ్రపాణి అంతం చూస్తానని బెదిరిస్తాడు.

## వజ్రసంకల్పం నేపథ్యంలో....

# మనసులను మోహింపజేసే రతనాలు!

స్తుంటారు వజ్రాన్ని సన్నగా ఉండేభాగాన్ని పైకి చూపిస్తూ ఉండేలా చర్మంపై పెట్టుకుని చూస్తే మన చర్మం వజ్రంగుండా కనిపించకపోతే వజ్రం విలువయిన వజ్రం అని చెప్తారు

కెంపులు ఎరుపురంగులో ఉంటాయి కెంపులు దుష్టశక్తులను దూరంగా ఉంచుతాయనే నమ్మకం ప్రజలలో ఉంది ఇవి అదృష్ట చిహ్నాలని కొందరంటారు షాపులో కెంపులను చూసినపుడు అవి సహజమయిన కాంతిలో ఎలా ఉన్నాయో చూడటం చాల ముఖ్యం కెంపులో పూర్తిగా ఒకేరంగు ఉన్న వాటినే తీసుకోవాలి. ఎరుపు ఎంత ఎక్కువగా ఉంటే కెంపులు అంత విలువయినవి అండాకారంలో, హృదయాకారంలో నున్న కెంపులు కూడా విలువయినవే రతనాల నిపుణు లు కెంపుల పరిశీలనకు డైక్రోస్కోప్ అనే పరికరాన్ని ఉపయోగిస్తారు

ఈఇంద్రనీలమణు లు సహజకాంతిలో నీలిరంగులో కనిపిస్తాయి ఇవి ఆకుపచ్చ రంగులో కూడా కనిపిస్తుంటాయి. కెంపులవలే మణు లను కూడా కట్ చేస్తారు మణు లను ప్రక్కనుండీ చూస్తే కాస్త పసుపు రంగులో కనిపిస్తాయనే విషయాన్ని గుర్తుపెట్టుకోవాలి మణు లు మనిషిని మంచిగా నిలబెట్టి, నీతివంతుడ్ని చేస్తాయని, తేలు కుట్టినా, నోరు చేదుగా ఉన్నా, రక్తం కారుతున్నా మణు లు ఔషధ కాంతినిస్తాయని ప్రజలు నమ్ముతారు దృష్టి లోపాన్ని కూడా మణు లు సరిచేస్తాయనే నమ్మకం ఉంది

పగడాలలో పరిసరాలకనుగుణంగా రంగులలో మార్పులు ఉండవు వీటికి 58 ముఖాలుంటాయి, సాధారణంగా మంచి పగడాలు అరుదుగా కనిపిస్తాయి

క్రీ పూ 1700 సంవత్సరాలనాడే పగడాలు ఉన్నట్లు తెలుస్తున్నది ఈజిప్టులో, గ్రీకు దేశంలో ఇవి ఉండేవట ప్రస్తుతం దక్షిణ అమెరికా, బ్రెజిల్, కొలంబియా, పెరు, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికాలలో పగడాలు కనిపిస్తాయి ఇవి అరుదుగా దొరకటం వల్ల వీటి ఖరీదు కూడా ఎక్కువే పగడాలను గుర్తించడానికి స్పెక్ట్రోస్కోప్, కెల్సియాలను రతనాల నిపుణు లు వాడతారు వీటిలో నుండి చూస్తే పగడాలు కానివన్నీ నీలిరంగులోకానీ, రంగులేకుండాకానీ కనిపిస్తాయి

వజ్రాలయినా, పగడాలయినా, మణులైనా, కెంపులయినా, ముత్యాలయినా ఏవయినా రతనాలను అతి జాగ్రత్తగా భద్రపరచి వాడితేనే వాటి విలువ తరగకుండా ఉండి వాటి దర్శనంతో కలిగే ఆనందం పెరుగుతూ ఉంటుంది



చూశాడతను భయంతో రొప్పుతున్నాడు

పులిమరింతగా సమీపించేసింది అతని గొంతులోంచి హఠాత్తుగా వెలువడిందా కేక !

మృత్యువు దగ్గరకొచ్చేస్తున్న క్షణంలో అప్రయత్నంగా అతి బిగ్గరగా అతని కంఠం నుంచి వెలువడిన ఆ కేకకు అడివంతా దద్దరిల్లిపోయిందా అనిపించింది.

"కాపాడండి బాబోయ్ !
"కాపాడండి . !!
"కాపాడండి. .!!!"
అంతే !

చివరిసారిగా ఆ కేక అతని గొంతులోంచి పూర్తిగా బయటికొచ్చిందో లేదో..., అతనేమాత్రం వూహించని సంఘటన జరిగిపోయింది.

చెట్లకొమ్మల్లోంచి హఠాత్తుగా ఎలాంటి హెచ్చరికా లేకుండా ఉల్కలా దూసుకొచ్చి సరిగ్గా అతని ముందు పిడుగులా దూకాడో వజ్రకాయుడు.

అతను కిందికి హఠాత్తుగా దూకిన శబ్దానికి నేల అదిరింది.

సరిగ్గా తమకూ పులికీ మధ్య దూకిన ఆ వజ్రకాయుడు పులిని చూస్తూనే

# వజ్రోత్సవము స్వర్ణోత్సవము

గాంధీజీ ఉప్పు సత్యాగ్రహము చేస్తున్న సమయంలో నెల్లూరులో 1930 ఏప్రిల్ 11వ తేదీ మైపాడులో ఉప్పు సత్యాగ్రహము ప్రారంభించాము. తొలి జట్టులో ఐదుగురు సత్యాగ్రహులు సముద్ర జలమును కాచి ఉప్పు తయారు చేశారు. నేను మొదటి జట్టుకు దళాధిపతిని. దానికై శిక్ష విధించినది మే 26వ తేదిన. తొడనే నెల్లూరు జైలుకు తరలింపు 59 ఏళ్ళు దాటాయి. 1990 మే 26కు అరువది సంవత్సరాలు నిండుతాయి షష్టిపూర్తికి అర్హత వస్తుంది దానినే వజ్రోత్సవము అంటున్నాను స్వరాజ్య సాధనా సమరములో అనుభవించిన తొలి జైలు శిక్షకు వజ్రోత్సవము చేసుకోవడం ఎంతైన విషయమే గదా!

గాంధీజీని దక్షిణాఫ్రికాలో రైల్వు మొదటి తరగతి పెట్టె నుండి క్రిందకు త్రోసిన ఉదంతమునకు శత జయంతిని దక్షిణాఫ్రికాలో జరుపుకొన్నారు. అట్లనే నా జైలు శిక్షకు షష్టిపూర్తి జరపాలని నా సంకల్పము

'స్వతంత్ర సమరములో జైలు కేగుట ప్రముఖమైన ఘట్టమే ఆ వరుసలో మూడు తడవలు జైలుకు పోవడం. 1937లో అవిభక్త చెన్న రాష్ట్రంలో మరో మూడు తడవలు జైలుకు పోవడం జరిగింది చివరకు తంజావూరు జైలు నుండి 1943 డిసెంబరులో విడుదల చేయబడ్డాను. 1930 మే నెలలో ప్రారంభమైన జైలు తీర్థయాత్రలు 1943 డిసెంబరులో అంతమయ్యాయి. ఆరుసారులు చెరసాల కేగినా నా తొలి జైలుశిక్షే నాకు ప్రధాన మైనది దానికే వజ్రోత్సవ సంకల్పము అరువది సంవత్సరాలు నిండిన పండుగ

## 'మాజీ మంత్రి' బిరుదు

అలాగే ఇరవై ఏడున్నర మాసాల పాలన తరువాత 1939 అక్టోబరు 30వ తేదీన మద్రాసు మంత్రిమండలి, దేశంలో అన్ని కాంగ్రెస్ మంత్రి వర్గాలతో పాటు రాజీనామా చేసింది ఆ నాడు నేను 'మాజీ మంత్రి'అనే బిరుదును పొందాను. అది నా తొలి పదవీ మాజీత్వము. దానికి 50 ఏళ్ళు కావస్తున్నది స్వర్ణోత్సవానికి అర్హత పొందుచున్నది 1972 జూలై 1న నా కడపటి రాజకీయ పదవి మాజీత్వము. 82 మాసాలు ఉత్తరప్రదేశకు గవర్నరుగా ఉండి. లక్నో వదలి నెల్లూరు గూటిలో చేరాను అదే నా రాజకీయ పదవుల కడపటి మెట్టు

స్వరాజ్య సమరంలో నా తొలి జైలు శిక్షకు అరువది సంవత్సరాల పండుగ నా మొదటి రాజకీయ పదవీ మాజీత్వమునకు 50 సంవత్సరాల పండుగ. వజ్రోత్సవమని, స్వర్ణోత్సవమని వాటికి పేర్కొదినాను. ఆగస్టు 5న నాకు 82 సంవత్సరములు నిండిన రోజుననే ఈ పండుగలు.

## ముగ్గురమే మిగిలి ఉన్నాము

ఎందరో నా సహచరులు జైలులో మాసాల



తరబడి నాతో కూడా ఉండిన వారు స్వరాజ్యసిద్ధిని చూడకనే కొందరు, కొద్దిగ చూచినవారుగనే మరికొందరు దాటి పోయారు జీవన సాగరాన్ని. 1937లో మంత్రులైన వారిలో ఇంకా అంతకు ముందే మంత్రులైన వారిలో ఈనాటికి ముగ్గురమే మిగిలి ఉన్నాము మొరార్జీదేశాయి. విజయలక్ష్మి పండిట్. నేను. దక్షిణ భారతములో మాజీ మంత్రులకు పెద్దన్నను నేనే

ఫ్రెంచి విప్లవానికి ద్విశత జయంతి ఉత్సవము ఈ సంవత్సరము. తర్వాత రష్యా విప్లవము ఈ శతాబ్దముతోనే వచ్చింది. మన దేశ స్వాతంత్ర్యము. మరి ఎన్నో దేశాల స్వరాజ్యము కూడా ఈ శతాబ్ది చారిత్రక సంఘటనలే ఈ శుభ పరిణామాలకు, సాధించుకొన్న ప్రగతులకు సంతోషిస్తూ, త్యాగ ధనులస్మరించు కొంటూ గడుపుచున్నాను.

— డా. బెజవాడ గోపాలరెడ్డి

## వజ్రసంకల్పం

ఒక్క పెట్టున సింహనాదం చేశాడు.

ఆ వజ్రకాయుడు చేసిన సింహనాదానికి అడివంతా దద్దరిల్లిపోయింది.

చిన్నోడి గొంతులోని కేక గొంతులోనే అణిగిపోయింది.

కళ్ళు పెద్దవిచేసి వజ్రకాయుడివైపు విస్మయంగా చూశాడు.

ఆరున్నర అడుగుల ఎత్తున్న ఆ మహాకాయుని వజ్రసమాన దేహం ఎక్కడికక్కడ కండలు తిరిగి మహాద్భుతంగా వుంది.

చిన్నోడు అంతటి అద్భుతమైన వ్యక్తిని తన జీవితంలో ఎప్పుడూ చూడ లేదు.

మసక చీకట్లో కూడా అతని దేహం బంగారంలా మెరుస్తోంది. ఆ దేహం మీద పడితే గడ్డపార కూడా నడిమధ్యకు వంగిపోతుంది. శరీరంలోని ప్రతి అంగుళం అద్భుతమైన తేజస్సుతో ప్రకాశిస్తోంది.

నడుముకు పులిచర్మంకట్టుకున్నాడు. అది తప్ప అతని మిగతా శరీరంమీద ఎలాంటి అచ్చాదానా లేదు. నడుముకు చిన్న పిడిబాకు వేలాడుతోంది.

ఆ వజ్రకాయుడ్ని చూస్తూనే పులి కూడా ఒక్కసారిగా ఆగిపోయింది. ఒక్క క్షణం వున్నచోటే నిలబడిపోయి క్రూరంగా గాండ్రించింది.

ఆ వెంటనే గుండెలదిరిపోయేట్టు మరోసారి సింహనాదం చేశాడావ్యక్తి.

ఆ సింహనాదానికి చిన్నోడి గుండె జలదరించింది.

పులికూడా చకితురాలైనట్టు చూసి ఒకడుగు వెనక్కివేసింది. ఆ మరుక్షణం అతని సింహనాదానికి తాను జడవబోనన్నట్టుగా ఓసారి భీకరంగా గాండ్రించి పైకి దూకడానికి సంసిద్ధమౌతూ వెనక్కాళ్లమీద వంగింది.

చిన్నోడు మహాశ్చర్యంతో చూస్తున్నాడు.

జరుగుతున్నది కలో నిజమో అతని కేమాత్రమూ అర్థంకాలేదు.

పులి మహావేగంతో ఒక్క పెట్టున వజ్రకాయుడి మీదికి దూకింది.

మరోసారి భయంకరమైన సింహనాదం చేశాడా వజ్రకాయుడు.

చిన్నోడు వణకడం ప్రారంభించాడు.

ఎవరీ మహాబలుడు ? !

(ఇంకావుంది)




# ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక

## రూ. 3000 బహుమతులు!

ఈసారి దీపావళికి-కొత్తరకం కథల పోటీ పెడుతున్నాం!

మూడే కథలు మూడే బహుమతులు !

మొదటి బహుమతి రు. 1300లు. అక్షరాల పదమూడు వందల రూపాయలు

రెండవ బహుమతి రు. 1000 లు. వెయ్యి రూపాయలు అక్షరాలా

మూడవ బహుమతి రు. 700లు. అక్షరాల ఆరున్నొ క్క్ వందల రూపాయలు.

సూచనలు నిబంధనలు గట్రా :

తేట తెనుగులో తెనుగుదేశ వాతావరణంలో

*1) ఉత్కంఠ భరితంగా 2) చమత్కారయుతంగా 3) కొసవిరుపో తుదిమెరుపో ఉండేలాగా*

*ఆరు అరఠావులకి తగ్గకుండా పన్నెండు అరఠావులకి దాటకుండా " కథ" అల్లాలి!*

* మూఢనమ్మకాలు గాఢనమ్మకాలు అనే తర్కవితర్కమేల? కథ లక్షణాలున్న చదువుతున్నంతసేపు వెనక్కు తిరక్కుండా చదివించగల కథలు రాయండి!

* ఈ కొత్తరకం కథల పోటీ మీ ఉపజ్ఞకి ఊహకి అనుభవానికి కూడా ఒక సవాల్‌గా భావించండి తప్ప దెయ్యాలున్నాయా? లేవా? అన్న ' రీసెర్చి' అనవసరంగా మొదలెట్టకండి!

* మీరంతా టాలెంటున్న రచయితలు అటా? యిటా? అన్న సమస్య లేకుండా ఒకే 'యిటు' ఆంధ్రసచిత్ర వారపత్రికకి పంపగల కథలు మీచేత రాయించాలనే మా యీ ప్రయత్నం! విజయీభవ అంటూ బయలుదేరండి! కవరు మీద 'దెయ్యాల కథల పోటీ కోసం' అని వ్రాయండి !

షరాలన్నీ మామూలే. కథ కాపీ కారాదు. ప్రచారం ప్రసారం ప్రచురణ అయినది కారాదు. పూర్తి చిరునామా తప్పక యివ్వునది, హామీ పత్రం పెట్టునది అయివుండాలి. మరువకండి.

-ఎడిటర్
ఆంధ్రసచిత్రవారపత్రిక

కథలు పంపవలసిన చిరునామా ఎడిటర్ ఆంధ్రసచిత్ర వారపత్రిక గాంధీనగర్, విజయవాడ-520 003

**ముగింపు తేదీ : 4 అక్టోబరు 1989**




**శంకరం మాస్టారు చేతి గడియారం చూసుకున్నారు. మధ్యాహ్నం మూడు గంటలు కావచ్చింది. అంటే యింకో ముప్పావు గంటలో విమానం న్యూయార్కు చేరుతుందన్నమాట. ఎక్కడ నిడుమోలూ ఎక్కడ న్యూయార్కూ! దైవలీల అంటే యిదే!!**

తన చిన్నప్పుడు నిడుమోల్లో సెకండరీ స్కూలు కూడాలేదు. ఆరో తరగతి చదువుకోసం పక్కనున్న ఎలకుర్రు రోజూ పంపేందుకు అమ్మా నాన్నా అరవైసార్లు ఆలోచించారు. అలాంటిది తన రెండో కొడుకు కృష్ణమూర్తి హైదరాబాదొచ్చి విమానం ఎక్కిస్తూ ధైర్యంగా వెళ్ళిరమ్మన్నాడు. కొడుకే తండ్రికి ధైర్యం చెప్పాడంటే రోజులు మారాయనక తప్పదు. నిజమే ప్రపంచం మారిపోయింది. బందరెళ్ళి చిన్న పని చూసుకుని తిరిగివచ్చేటంత వ్యవధిలోనే విమానం అమెరికా

చేరుకుంటోంది వట్టుమని తొమ్మిది గంటలు కూడా లేదు. బొంబాయి నుంచి అయిదు గంటల్లోనే విమానం లండను వచ్చేసింది. లండన్లో గంటన్నరసేపు ఆగింది. శంకరం మాస్టారు విదేశం రావడం అది మొదటిసారి అసలు విమానం ఎక్కడం కూడా అదే మొదలు. నమ్మలేనంత ఆశ్చర్యం కలిగింది. ఇంగ్లండు గత చరిత్ర కళ్ళకు కట్టినట్టయింది. ఇక జాగ్రఫీ సంగతి చెప్పనక్కర్లేదు అది ఆయన అభిమాన విషయం సోషల్ స్టడీస్ టీచరుగా కృష్ణాజిల్లా మొత్తంమీద మంచి పేరుంది బేగంపేట విమానాశ్రయం నుంచి బయలుదేరింది మొదలు శంకరం మాస్టారు ప్రతి వూరూ, ప్రతి ప్రాంతం తనను పలకరించిన అనుభూతి పొందారు. ముప్పై అయిదేళ్ళపాటు పిల్లలకి చెప్పిన పాఠాలు చెవుల్లో మారుమోగాయి. ,

బొంబాయి సహారా ఎయిర్‌పోర్టు నుంచి అదే విమానం ఆకాశంలోకి దూసుకుపోయినప్పుడు 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అన్న సూక్తి పదే పదే గుర్తుకొచ్చింది.

ఒంటరిగానే ప్రయాణించవలసి వచ్చినందుకు బాధగానే వుంది. వెంట ఎవరొస్తారు?

అసలు తాను యిలా బయలుదేరడమే ఒక వింత. తనవంటి సామాన్య కుటుంబీకుడి కిది సాహసమే. పదీ పరకా కాదు. ఏడు వేల రూపాయలు టికెట్టు ఒక్క రావడానికే. ఇంత డబ్బు ఎందుకు ఖర్చు చేయడం అంటే కృష్ణమూర్తి విన్లేదు అన్నగారి మాట అక్షరాల పాటించడం అతని స్వభావం. అన్న రామచంద్రం తమ్ముడికి వివరంగా ఉత్తరం రాశాడు స్పాన్సరు కాగితాలు పంపాడు. డబ్బు యేర్పాటు చేశాడు ఏయే పత్రాలు ఎలా సమకూర్చుకోవాలో విడమరిచి తెలియజేశాడు. కాబట్టి ఒకసారి వెళ్ళి వాళ్ళని చూసిరావడం మంచిదని కృష్ణమూర్తి అభిప్రాయం అందులోనూ అన్న కాస్త పురమాయిస్తే చాలు, గంపెడంత అట్టహాసంతో ఎలాంటి లోటు రానీయకుండా చేయడం కృష్ణమూర్తికి అలవాటు వెళ్ళేది కన్న తండ్రి. పంపమన్నది అన్నగారు. పాస్‌పోర్టు కోసం, వీసా కోసం,ఫారిన్ ఎక్స్ఛేంజి కోసం అతలాకుతలం అయ్యాడు అనుకున్న పని సానుకూలమయ్యేదాకా నిద్రపోని నైజం కృష్ణమూర్తిది. అమెరికా వస్తున్నప్పుడు మంచి డ్రస్సు ఉండాలని రామచంద్రం చూచాయగా రాయడంతో యేకంగా సూటే కుట్టించాడు తండ్రికి. అరవై దగ్గర పడుతున్న తనకిప్పుడు సూటెందుకంటే కృష్ణమూర్తి వినిపించుకుంటాడా?

శంకరం మాస్టారి చూపులు తను వేసుకున్న సూటుపైకి మళ్ళాయి పక్క ప్రయాణీకు లెవరైనా తనను గమనిస్తున్నారేమోనని అటూ యిటూ చూశారాయన ఎవరి గొడవలో వాళ్ళున్నారు అది ఒకందుకు నయమనిపించింది. ఎప్పుడో పెళ్ళిలో ముదురు గోధుమరంగు చారలతో ఒక సూటు కుట్టించారు. వేసుకుంటే యిబ్బందిగా తోచేది డి ఇ ఓ వస్తే మాత్రం అప్ప[illegible]ండా వేసుకునేవారు శంకరం మాస్టారు అప్పుడు అందరికీ తెలిసేది స్కూలు ఇన్‌స్పెక్షన్ జరుగుతుందని. తర్వాత సూటు పాతదైపోయింది గవర్నమెంటు స్కూలు టీచర్‌గా పనిచేసినంత కాలం పొడుగు చొక్కా, పంచె, ఉత్తరీయం వదల్లేదు. కిందటేడు రిటైరయ్యాక బయటకెళ్ళేటప్పుడు తప్ప యింట్లో వేషం పట్టింపులేదు. సొంత యిల్లు, సొంత ఊరు చిన్న కొడుకు కృష్ణమూర్తికి వున్న వూళ్ళోనే చిన్న ఉద్యోగం దొరికింది. పెళ్ళయింది. పార్వతి గుట్టుగా సంసారం చక్కబెట్టుకునే నేర్పున్నమ్మాయి మనుమరాలు లావణ్య బంగారు బొమ్మ

ఆలోచన్ను సొంత వూరుమీదికి పోకుండా శంకరం మాస్టారు నిగ్రహించుకున్నారు

మరి కొంతసేపట్లో న్యూయార్కు చేరుకోబోతున్నారు. చదివిన సంగతులన్నీ స్ఫురణకు వస్తున్నాయి తను ఢిల్లీ కూడా ఎన్నడూ చూడలేదు మద్రాసు మాత్రం దక్షిణదేశ యాత్రల సందర్భంగా రెండుసార్లు చూసే అవకాశం లభిం



## చిక్కుల్లో రణధీర్

రణధీర్ కపూర్ తాను తీయబోయే చిత్రం 'హెన్నా'లో నటించేందుకు తగిన హీరోయిన్ కోసం వేట ప్రారంభించాడట. కాని ఎవరూ అందటం లేదట. కాగా రణధీర్ భార్య బబిత యిటీవల విడాకులివ్వాలని అనుకుని యితనితో కలిసి వుండకుండా తన కూతురు కరిష్మాతో వేరే కాపురముంటున్నదట. తన కూతుర్ని సినిమాల్లో నటింప చేయాలని కుతూహల పడుతున్నదట బబిత. ఎలాగూ భర్త సినిమా తీస్తున్నాడు కదా అందులోనే ఛాన్సిప్పిద్దామని ప్రయత్నిస్తోందట. కాని విడాకు లివ్వాలనుకున్న మనిషికి నేనెందుకు సహాయం చేయాలన్న ధీమాతో కాబోలు అందుకు ఒప్పుకోవటం లేదట రణధీర్. కూతుర్ని పెద్ద హీరోయిన్ చేయాలని కలలు కన్న తల్లి ఆశలు మరి ఎంత వరకు నెరవేరుతాయో! ఈ సినిమా నిర్మాణంలో ఎదురైన చిక్కుల్నించి ఎలా బయట పడాలా అని ఆలోచిస్తున్నాడట రణధీర్!



## పాప బొజ్జలో బుల్లెట్!

పుడుతూనే గుండెలో బుల్లెట్‌తో పుట్టిందట ఒక చిన్నారి. ఆ పాప కడుపులో వుండగా ఒకనాడు తల్లికి బుల్లెట్ తగిలిందట. అది దూసుకుపోయి ఆ పాప గుండెలో నిలిచిపోయింది!!

మెంఫిస్‌లో ఈ వింత సంఘటన జరిగింది. ఇటీవల ఆ తల్లి ప్రసవించినప్పుడు యిది కనుగొన బడింది!

తల్లి 31 సంవత్సరాల ఎవిల్లీన్‌పేలె, పాప క్షేమంగా వున్నారట

బుల్లెట్ దూసుకుపోయినా తల్లి ఎలా బ్రతికిందో, ఆ బుల్లెట్ దిగిన పిల్ల ఎలా బ్రతికి భూమిమీద పడిందో ఎవ్వరికీ అంతుచిక్కలేదట ఏమైతేనేమి .. తల్లీ, బిడ్డ క్షేమంగావు,న్నారు . . అంతేచాలు!

చింది కోరిక వున్నా ఉత్తరదేశ యాత్రలు చేయడం పడలేదు ఇక ఒంటరిగా ఆ యాత్రలు జరపడం అసంభవం. ఒంటరితనం అనగానే గుండె చెరువైపోయింది తమాయించుకున్నారు.

అనుకోకుండా యీ మహాయాత్ర తటస్థపడింది న్యూయార్కు మహానగరం. జనాభా రెండు కోట్లపైనే అన్నీ పెద్ద పెద్ద భవంతులే. వరల్డ్ ట్రేడ్ సెంటర్ భవనం నూటపది అంతస్తులు రాక్‌ఫెల్లర్ సెంటర్, లింకన్ సెంటర్, చైనా టౌన్ చూసితీరాలి. మన్‌హట్టన్ దీవిని కలిపే జార్జి వాషింగ్టన్ బ్రిడ్జి అద్భుతంగా వుంటుందట

రామచంద్రం యీ విశేషాలన్నీ తప్పక చూపిస్తాడు తనకే లోటు వుండదక్కడ కోడలు జానకి నిజంగా సీతమ్మతల్లి వంటిది మనవడు ఆదిత్య న్యూయార్కులోనే పుట్టాడు వాణ్ణి యింతవరకు చూడనేలేదు వాడు సిసింద్రీ అని రామచంద్రం, వుత్తరాలనుబట్టి తెలుస్తోంది

శంకరం మళ్ళీ గడియారం చూసుకున్నారు పది నిమిషాల్లో న్యూయార్కు వచ్చేస్తుంది పాస్‌పోర్టు, మనీపర్సు వగైరా తడిమి చూసుకున్నారు. భద్రంగానే వున్నాయి.

కొడుకునీ, కోడల్నీ చూసి చాలాకాలమయింది. వాళ్ళని చూడగానే వుద్వేగం ఆపుకోగలగడం సాధ్యమేనా? గుండెల్లో అలలెత్తుతున్న వేదన తగ్గుతుందా? మరింత విజృంభించి తనను ముంచెత్తుతుందే! గాంభీర్యం తెచ్చిపెట్టుకునే ప్రయత్నం చేశారు శంకరం మాస్టారు కృష్ణమూర్తి మరీమరీ చెప్పాడు అన్నయ్యని చూడగానే మనసును అదుపులో పెట్టుకునే ప్రయత్నం చెయమని మమతలూ మనసూ మనం చెప్పినట్లు వింటాయా?

కొద్దిక్షణాల్లో విమానం న్యూయార్కు చేరుకుంటోందని తెలియజేశారు శంకరం మాస్టారికి ఆతురత పెరిగిపోతోంది

విమానం రన్వేమీదికి దిగింది సంబాళించుకుని హ్యాండ్‌బాగ్ చేతిలో పట్టుకున్నారు అక్కడ ఎక్కువ నడవవలసిన పనివుండదు అన్నిటికీ యాంత్రిక సౌకర్యాలుంటాయి

లౌంజిలోకి రాగానే ఎదురుగా రామచంద్రం, కోడలు జానకి,మనవడు ఆదిత్య కనిపించారు శంకరం మాస్టారు చుట్టూ వున్న జనాన్ని మరిచిపోయారు. గుండెల్లో సముద్రాలు ఘూర్ణిల్లుతున్నాయి మెదడులో అగ్నిపర్వతాలు బద్దలైన చప్పుళ్ళు వినిపిస్తున్నాయి తలలో భూకంపం వచ్చినట్లయింది

రామచంద్రం తండ్రిని కౌగలించుకుని 'నాన్నా! అమ్మేది. ., అమ్మేది .అమ్మేది' అని బావురుమన్నాడు.

శంతరం మాస్టారు 'నాన్నా రామచంద్రా! రామచంద్రా!' అని పెద్దగా రోదించసాగారు

* * * *

హాలులో పడుకున్న తండ్రి నిద్రలో పెద్దగా కలవరించడం విన్న కృష్ణమూర్తి, పార్వతి ఖంగారుపడి గబగబా వచ్చారు. శంకరం మాస్టారి గుండెలు ఎగసిపడుతున్నాయి కళ్ళవెంట నీళ్ళు కారుతున్నాయి

గాబరాతో తండ్రిని కదిపాడు 'నాన్నా! నాన్నా!'' గట్టిగా పలకరించాడు నిద్ర లేపుతున్నట్టు కనురెప్పలు మూసుకునే వున్నాయి కనుగుడ్లు మాత్రం వేగంగా కదులుతున్నాయి

శంకరం మాస్టారు బదులుపలకలేదు పార్వతితో 'నాన్నని చూస్తూవుండు డాక్టర్ని తీసుకొస్తా' అని పరుగెత్తికెళ్ళాడు

మామగారి ముఖంలో గూడుకట్టుకున్న బాధనీ, శోకాన్ని చూసి పార్వతి విలవిలలాడిపోయింది నిస్సహాయంగా చూస్తూ వుండిపోయింది విషాదమూర్తిలా ఎలాంటి కల వచ్చిందో ఆమె వూహించలేకపోయింది

డాక్టరు వచ్చి పరీక్ష చేశాడు బ్లడ్ ప్రెజర్ కొలిచాడు నాడి చూశాడు కనురెప్పలు పైకెత్తి పరిశీలించాడు ఆయన ముఖంలో ఉత్సాహం లేదు

'నాన్నగారు రాత్రి బాగా నిద్రపోయారా?'' అడిగాడు కృష్ణమూర్తిని.

'ఎందుకనో ఈపూట నిద్ర రావడం లేదు రామచంద్ర వుత్తరం రాశాడుగదా సమాధానం రాయాలి. నువ్వు రాస్తున్నావుగా, నేను కూడా రాస్తాను'. అని చాల రాత్రివరకు వుత్తరం రాస్తూనే వున్నారు అంతకీ 'పడుకోండి నాన్నా! రేపు పూర్తి చేయొచ్చుగా పదకొండవ్వొచ్చిందని నచ్చచెప్పాను' అన్నాడు

డాక్టరు యింజక్షన్ యిచ్చాడు

శంకరం మాస్టారి ముఖాన్ని తేరిపార చూస్తూ 'నాన్నగా రీమధ్య ఎలా వుంటున్నారు?' ప్రశ్నించాడు

'ఏం చెప్పమంటారు డాక్టర్! అమ్మ పోయిందిగదా! అప్పట్నుంచి ఆయనకి తీరని దిగులు ఆవేదన ఎలా తీర్చగలం. లోలోపల కుమిలిపోతున్నారు అన్ని విధాల నచ్చచెప్పినా తీరే బాధ కాదు.'

'చాల తీవ్రమైన ఒత్తిడికి లోనవుతున్నట్టుంది'

'నిజమే డాక్టర్! అమ్మ పోయిన తర్వాత అన్నయ్య రాలేకపోయాడు. అన్నయ్యని చూడలేదని బెంగ మరోపక్కన నాన్నని వేధిస్తోంది.'

'కృష్ణమూర్తి! మీరు ధైర్యంగా

వుండాలి. మరో అరగంటలో స్పృహ రాకపోతే మనం నాన్నగారిని బందరు తీసుకెళ్ళడం మంచిది అతి తీవ్రమైన మానసిక సంఘర్షణ మూలంగా మెద డు నరాలు చిట్లే ప్రమాదముంది మనిషి కోమాలోకి పోవచ్చు కూడా '

'డాక్టర్! మా నాన్నని కాపాడండి డాక్టర్. అమ్మ వెళ్ళిపోయింది నాన్న కూడా లేకపోతే ' కృష్ణమూర్తి కంఠం రుద్ధమయింది

పార్వతి కూతుర్ని దగ్గర తీసుకుని కన్నీళ్ళు తుడుచుకుంటూ 'ఊరుకోండి మామగారికి తప్పకుండా స్పృహవస్తుంది' వూరడించింది.

'కృష్ణమూర్తీ! అలా అధైర్యపడకూడ దు అన్నీ తెలిసినవాడివి. మనం బందరు తీసుకువెళ్దామని చెప్పాగా సంగతి తెలు సుకుంటావని అన్నా '

'అయితే నే వెళ్ళి షావుకారుగారి కారు అడిగి తీసుకొస్తా నాన్నంటే ఆయనకి చెప్పలేని అభిమానం తప్పకుండా యిస్తా రు.'

'తెల్లారొచ్చింది షావుకారు ఈపాటికి లేస్తారు వెళ్ళిరా నేను చూస్తుంటాను '

# శేష లేఖ

'పార్వతీ! ఈలోగా కావలసినవి సర్దు నువ్వు కూడా వద్దువుగాని '

కృష్ణమూర్తి కారుకోసం వెళ్ళాడు

పార్వతి కావలసినవి సర్దేపనిలో వుంది

డాక్టర్ శంకరం మాస్టార్ని మరోసా రి పరీక్షచేశాడు

అట్టకి పెట్టివున్న కాగితాలు కనిపిం చాయి ఆ వుత్తరం శంకరం మాస్టారు రాసింది ఇంకా పూర్తిగా రాయలేదు పెన్ను కూడా అక్కడేవుంది మాస్టా రు ఏం ఆలోచించారో, ఎలాంటి మానసి క ఘర్షణపడుతున్నారో తెలుసుకోవచ్చునని డాక్టర్ వుత్తరం చదవాలనుకున్నాడు

శంకరం మాస్టారు దస్తూరి చక్కగా వుంటుంది అక్షరాలు ముత్యాల్లా వుంటా యి

'నాన్నా రామచంద్రా! 'ఆశీస్సులు

నీ వుత్తరం అందింది

ఈసారి నే నొక్కణ్ణే వుత్తరం రాస్తు న్నాను. మీ అమ్మ రాయడంలేదు ఇంత కాలం ఇద్దరం రాసేవాళ్ళం ఆమె అనంత దూరాలకు వెళ్ళిపోయింది

కనిపెంచిన తల్లి ఎన్నటికీ కన్పిం కుండా పరలోకంలోకి వెళ్ళిపోతే బిడ్డ బాధ నాకు తెలుసు నాన్నా! నీకు ఏ చెబితే వూరట కలుగుతుంది?

చివరి క్షణం వరకూ మీ అమ్మ పేరూ, తమ్ముడి పేరూ వలవరిస్తూ వుంది పిల్లలపైన ఏ తల్లికైనా ప్రేమ వుంటుంది కాని మీ అమ్మకి మీరే లోకం నాన్నా! కూతుళ్ళెవరు లేని మా యి రికీ కోడళ్ళే కూతుళ్ళయ్యారు అందుక మా ముసలి గుండెలు ఎంత ఆనందపడే వో ఎలా చెప్పను.

మీ అమ్మని ఎప్పుడూ పెద్ద వుత్త రం రాయమని అడిగేవాడివి వానాకాలపు చదువుతో మీ అమ్మ రాసిన తప్పులు దిద్దవద్దని, అవి అలాగే వుంటే చదువుకో వడం చాలా ఆనందమని రాసేవాడివి అవును అక్షరాలు తప్పులొచ్చేవి కాని వాక్యాల్లో తేనె వుండేది మీగడ వుండేది అవి మమతల హారాలు నాన్నా!

నీ వేదన అర్థంచేసుకున్నా - అమ్మ మరణవార్త మీకు చేరే సమయానికి నువ్వు పనిపైన మాంచెస్టర్ వెళ్ళినట్టూ, రెండు వారాల తర్వాతే ఆ కబురు విన్నట్లు కుమిలి

పోతూ రాశావు మాంచెస్టర్ వర్తమానం వంపినా అది నీకు చేరనట్టూ మధ్యలో యితర చోట్లకు వెళ్ళవలసి వచ్చినట్టూ రాశావు పరిస్థితులలా వచ్చాయి ఏమిచే యగలం!

రామచంద్రా! ఒక్కసంగతి ఈ వయసులో నేను ఒంటరివాడనైపోవడం ఎంత దుర్భరమో చెప్పలేను మీరం తా వుండగా ఒంటరివాణ్ణి ఎలా అవుతానని మీ రడగవచ్చు. నిజమే. నన్ను మీ రంతా కంటికి రెప్పలా చూసుకుంటున్నారు ఆప్యాయత, అభిమానం పంచుతున్నారు. ఎలాంటి లోటూలేదు నాన్నా!

ఉత్తరం కొంచెం విశదంగా రాస్తే నా మనసు బరువు కొంత దించుకునే వీలుంటుంది. తీరుబాటు వున్నప్పుడు చదువుకో ఈలోగా చి సౌ. జానకి చదువుతుంది నేనూ మీ అమ్మా పెద్ద వాళ్ళమైపోయాం పచ్చని చెట్టుకు రెండు పండుటాకుల్లా వున్నాం. రెండు పండుటాకులు ఒక చోటే వున్నాయి ఎంతకాలం వుంటాయి? చెట్టంతా వాటిని ప్రాణప్రదంగా చూసుకుంటున్నా ఎల్లకాలం వుండవు కాలం రాగానే రాలిపోవాలి. అది ధర్మం రెండింటిలో ఏది ముందు రాలిపోవాలనే సమస్యపైన ఆ ఆకులు వాదించుకునేవి వాటిచేతిలో ఏముంది నాన్నా!

ఒక ఆకు రాలిపోయింది మీ అమ్మ శాశ్వతంగా మనల్ని విడిచి వెళ్ళిపోయింది ఇక ఎప్పుడూ కంటికి కనిపించదు పోయే టప్పుడు మీ అమ్మ ముఖంలో ఎంత తృప్తో

# శేష లేఖ

- ఎంత ఆనందమో చెప్పలేను. నువ్వు దగ్గరలేవనే చింత తప్ప మరో వెలితి లేదు సుమంగళిగా వెళ్ళిపోతున్నాననే గర్వం నాకు కనిపించింది నిజమే. మనదేశంలో సంప్రదాయం అలాంటిది ఆ సౌభాగ్యం మీ అమ్మకు దక్కింది అందుకు నేను కూడా గర్వపడుతున్నాను కాని ఆ గర్వం చాటున సప్త సముద్రాల హోరు దాగి వుంది, అనంతమైన నిర్జన స్థలంలో ఒక్కణ్ణే నన్ను దిగవిడిచి మీ అమ్మ వెళ్ళిపోయినట్లనిపిస్తోంది అది పండుటాకు స్వభావం నాన్నా మరోలా అనుకోవద్దు మీరంతా నాపై చూపే ఆదరం అంతా యింతా కాదు అది నా అదృష్టం

నువ్వు నన్ను న్యూయార్కు రమ్మని రాశావు జానకి మరీ మరీ చెప్పినట్టు కూడా రాశావు మీ అమ్మ నన్నునిర్దయగా వదిలిపెట్టినా మీరు నాపైన యింత ప్రేమ చూపడం నా పూర్వజన్మ సుకృతం తల్లి తండ్రులకి కావలసింది భోగభాగ్యాలు కాదు పిల్లల నుంచి ఆదరణ, అనురాగం మా కది మెండుగా లభించడం మా భాగ్యం

నిన్నూ, జానకినీ, ఆదిత్యని చూడాలనేవుంది తల్లి లేని బిడ్డగా మారిన నిన్ను ఓదార్చాలని వుంది మీ యిద్దరి ఓదార్పు పొందాలనివుంది నా కన్నీటిని మనవడు ఆదిత్య చిన్నారి చేతులతో తుడిపించుకుంటే నా ఆవేదన కొంతవరకైనా తీరుతుంద ని నా ఆశ కొడుకు దగ్గరికి వెళ్ళాలని యే తండ్రికి వుండదు? అక్కడ నాకు అన్ని సౌకర్యాలు వుంటాయి నిజమే అక్కడే వుండిపొమ్మన్నావు సంతోషమే

కాని అంత దూరం ప్రయాణం చేయగలనా? ఎప్పుడు యాత్రలు చేసినా మీ అమ్మా నేనూ కలిసి చేశాం ఒంటరి ప్రయాణం యెరగను పైగా నిడుమోలు నాప్రాణంలో ఒక భాగమైపోయింది ఈ నీరు, యీ నేల, యీ గాలి నాలో భాగంగా మారాయి సొంత యిల్లు విడిచిపెట్టగలనా? చిన్నాడు కృష్ణమూర్తిని యిక్కడ ఒక్కణ్ణే వదిలిపెట్టడం యెలా?

ఉత్తరం యింతవరకే రాశారు శంకరం మాస్టారు. పూర్తిచేయలేదు ఆయన నిర్ణయం చెప్పలేదు ఆయన ఆలోచన యింకా ఒక నిర్ణయానికి దారితీయలేదు చదివిన డాక్టరు నిట్టూర్చాడు మాస్టార్ని మరోసారి పరీక్షచేశాడు పరిస్థితి యింకా దిగజారుతున్నట్టుంది

కృష్ణమూర్తి కారు పట్టుకొచ్చాడు

అందరూ కలిసి శంకరం మాస్టార్ని జాగ్రత్తగా కారులోకి చేర్చారు కారు బందరు రోడ్డు వెంట వేగంగా పోతోంది కృష్ణమూర్తి తండ్రి తలను ఒళ్ళో పెట్టుకుని మధ్యమధ్య 'నాన్నా నాన్నా' అని ఆర్తితో, ఆవేదనతో, ఆశతో పిలుస్తున్నాడు ఆ పిలుపు భగవంతుణ్ణి వేడుకుంటున్నట్టుంది తండ్రి ప్రత్యక్ష దైవంగా కనిపించాడు తన తండ్రిని ఎలాగైనా రక్షించుకోవాలని అతని తపన 'డ్రైవర్! కొంచెం త్వరగా పోనీ' అని అర్థించాడు

పరిస్థితి గ్రహించిన డ్రైవరు వేగం పెంచాడు కారు పెద్దాసుపత్రిలోపల ఎమర్జెన్సీవార్డు దగ్గర ఆగింది స్ట్రెచర్‌పైన శంకరం మాస్టార్ని పడుకోపెట్టి లోపలికి తీసుకువెళ్ళారు పరీక్షచేసిన డాక్టర్లు మెల్లగా వచ్చి కృష్ణమూర్తిని ఓదార్పుగా భుజం తట్టి 'యువర్ ఫాదర్ యీజ్ నో మోర్ ఉయ్ ఆర్ సారి సెరిబ్రల్ హెమరేజ్‌తోపాటు కార్డియాక్ అరెస్ట్ కూడా ఏర్పడింది' అన్నారు

కృష్ణమూర్తికి అంతా చీకటి అలముకున్నట్టయింది 'నాన్నా నాన్నా నాన్నా' అని రోదించాడు

శంకరం మాస్టారు బదులు పలకలేదు రెండో పండుటాకు కూడా రాలిపోయింది ●

# ముసుగు తెచ్చిన తంటా

''కోనసీమ కు నట బొత్సు గ్రామమైన 'ముక్కామల గ్రామం కీ శే కళా వెంకట్రావుగారు పుట్టి పెరిగిన వూరు ఆయనకు కళాకారులంటే విపరీతమైన అబిమానం

ఒకసారి వారి ఆద్వర్యంలో వూళ్ళో 'లంకా దహనం' హరికదా కాలక్షేపం ఏర్పాటు చెయ్యబడింది అప్పటికి నా వయస్సు పన్నెండు సంవత్సరాలు మాత్రమే ఆ హరికదా కాలక్షేపానికి ఆడా, మగా, పిల్లా, జెల్లా తండోపతండాలుగా వేంచేశారు

హరికద మొదలైంది అవి చలికాలం రోజులు కాబట్టి, ఓ వృద్ధ రైతు ఆడవాళ్ళకు కాస్త దూరంగా నెత్తిమీద కంతువా కప్పుకొని ఓమూల కూర్చున్నాడు ఆ ప్రదేశంలో అంత వెలుగులేకపోవడం వల్ల, ఆ వ్యక్తి ఆడో - మగో తెలియడంలేదు కథ మొదలైన పదినిముషాలకు మా వూరి బ్రాహ్మణ వితంతువు ఒకరు నెత్తిమీదకు ముసుగు నిండుగా కప్పుకొని, యీ కద జరిగే ప్రదేశానికి వచ్చి, ఓసారి చుట్టూ కలయచూసింది ఆవిడ దృష్టి సరిగ్గా యీ ముసుగు వ్యక్తిమీద పడింది ఆ వ్యక్తి కూడా తన మార్కు బాపతు వితంతువే అనుకొని, నెమ్మదిగా అతని ప్రక్కచేరి కూర్చుంది ఆ వ్యక్తి యీ సంగతి గమనించలేదు

కొంతసేపటికి ఆవిడ అతని భుజంమీద చెయ్యివేసి "ఏమే! కద ఎంతవరకూ అయ్యింది?" అంటూ ప్రశ్నించింది దానికి ఆ వ్యక్తి ఒణికిపోతూ ఆవిడని గమనించి "అమ్మో!" అని గట్టిగా అరిచి లేచి నిలబడిపోయాడు అతని ముసుగు జారిపోయి, అవతారం బయటపడింది

దానితో ఆవిడ నరసింహావతారం ఎత్తి "అప్రాచ్యపు వెధవా! ఆడవాళ్ళ ప్రక్కన కూర్చుంటావా?" అంటూ చిందులు త్రొక్కసాగింది

ఈ సంగతి తెల్సుకొన్న ప్రముఖులు కీ శే కళావెంకట్రావుగారు అటు ప్రక్కకువచ్చి పరిస్థితిని అదుపుచేసి, ఆ వ్యక్తిని మగవాళ్ళ వైపుకు లాక్కొచ్చారు




ఈ సంగతి తెలుసుకున్న ప్రేక్షకుల నవ్వులతో ఆ ప్రదేశం మారు మ్రోగింది

- బచ్చు వీర్రాజు

# నవ్వు నాలుగందాల ఆరోగ్యం

## ఎడకలురుకు

ఓ రోజు నేనూ, నా ఫ్రెండ్ నర్గీస్ వాళ్ళింట్లో కూర్చుని ఆ రోజు మా కాలేజీ-లో జరిగిన డిబేట్స్ గురించి మాట్లాడుకొం-టుండగా వాళ్ళ ప్రక్కింటావిడ కాబోలు వచ్చింది! నర్గీస్ లేచి "కూర్చోండి అంటీ కాఫీ తెస్తాను" అంటూ కిచెన్‌లోకి పరుగు దీసింది! ఎదురు కుర్చీలో కూర్చుని ఆవిడ అమిత ఇంట్రస్టుగా చూస్తొంటే ఇబ్బందిగా వుంది నాకు! చివరికి ఆవిడే కల్పించు-కుంటూ "ఏం పేరు పాపా?" అంది! చెప్పాను! ఇక మొదలు పెట్టింది! నువ్వేం చదువుతున్నావ్? మీ నాన్నగారేం చేస్తా-రు? మీ రెంత మంది పిల్లలు? స్వంత ఊరు ఇదేనా? మీ ఇల్లెక్కడా? అంటూ ఓ మినీసైజు ఇంటర్వ్యూ చేసి పారేసింది! విసుగనిపించినా పైకి కనబడనివ్వకుండా సమాధానా లిచ్చాను మొహమాటానికి నేను "మీరు ఇక్కడికి కొత్తా?" అన్నాను! "అవును పాపా! పది రోజులయింది మేమీ ఊరొచ్చి" అంది "మీవారేం చేస్తారు?" అడిగాను



"ఎడకలురుకు" అంది!

"ఏంటండీ?" అన్నాను, నేను విన-డం పొరపాటేమోనని!

"ఎడకలురుకు పాపా!"

నాకైతే ఏమీ అర్థం కాకుండా, అయోమయంగా అన్పించింది! ఆవిడ నావైపు "అంతమాత్రం కూడా తెలీదా?" అన్నట్టు ఓ మృగాన్ని చూసినట్టు చూస్తోంది! ఇంతలో నర్గీస్ కాఫీ తీసుకొచ్చి "ఏంటే, ఏదో విషమ సమస్య నెదుర్కొంటున్నట్టు ఆ మొహం, నువ్వూను!" అంది! ఆవిడ అందుకొంటూ "ఎడకలురుకు అంటే తెలీదంట ఈ అమ్మాయికి" అంది! నర్గీస్ వస్తున్న నవ్వును అతికష్టంమీద ఆపుకుంటూ "హెడ్‌క్లర్కు" అంది! ఇక చూడండి నవ్వును ఆపుకోవడం నాతరం కాలేదు లోపలికి పరుగెత్తుకెళ్ళి పొట్ట పట్టుకుని మంచాని కడ్డంగా పడిపోయి పడీ పడీ నవ్వసాగాను, అక్షరజ్ఞానం లేని ఆ మహాతల్లి దారుణంగా ఖూనీ చేసిన ఆ "ఎడకలురుకు"ను మరీ మరీ గుర్తు చేసుకుంటూ!

- వింజమూరి జ్యోతిశంకర్

# కాలేయం జబ్బులన్నీ తాగినవాళ్లకే రావు!



డాక్టర్ డి. నాగేశ్వరరెడ్డి

కళ్ళు పసుపుగా మారడంతో 'జాండిస్' అనారోగ్యము వచ్చినట్లు రోగిని చూస్తున్న వాళ్ళందరికీ కూడా అర్థమవుతుంది

జాండిస్ వస్తే కొంతమంది మణికట్టు మీద వాతలు పెట్టించుకుని వైద్యం చేయించుకుంటారు మరి కొందరు కొన్ని పసర్లు, తీసుకుంటూ జాండిస్ తగ్గిపోతుందనుకుంటారు ఇలాంటి చిట్కా వైద్యాలతో జాండిస్ తగ్గదు జాండిస్ అనేది లివర్ (కాలేయము) వల్ల కలిగే అనారోగ్యము జాండిస్‌లో రకరకాలున్నాయి వాటికి కారణాలు వేరువేరు, చికిత్సలు వేరు వేరు!

ఈ విషయాలు వివరంగా తెలుసుకోవడానికి లివర్, పాంక్రియాజ్‌లతో పాటు ఆహారనాళాల అనారోగ్యాల చికిత్సా నిపుణు లు డాక్టర్ డి నాగేశ్వరరెడ్డిగార్ని కలుసుకోవడం జరిగింది

"లివర్ జబ్బుల గురించి తెలుసుకోవాలంటే ముందు లివర్ గురించి కొన్ని విషయాలు తెలుసుకోవాలి" అంటూ డా నాగేశ్వరరెడ్డిగారు ముందు లివర్ గురించి కొన్ని విశేషాలు చెప్పారు

## లివర్ ప్రత్యేకత!

లివర్ బరువు దాదాపు 1 25 కిలోగ్రాములుంటుంది కడుపులో కుడి ప్రక్క వుంటుంది లివర్ చాలా భాగం క్రింద రిబ్స్ వెనుకే వుంటుంది కేవలం ఒక సెంటీమీటర్ భాగం మాత్రమే రిబ్స్ బయటికి వచ్చి వుంటుంది మెత్తగా వుంటుంది రెండు లోబ్స్‌గా వుంటుంది లివర్ రెండూ విడివిడిగానే పని చేస్తుంటాయి లివర్ ప్రత్యేకత ఏమిటంటే కొంతభాగం పాడైపోయినా, యాక్సిడెంట్లలో తెగిపోయినా-మిగిలిన భాగం తిరిగి పూర్తి సైజ్‌కి లివర్‌ని పెంచగలదు అంటే మూడవ వంతు లివర్ మిగిలున్నా తిరిగి పూర్తి సైజ్ వచ్చేంత వరకూ పెరుగుతుందన్న మాట ఒక వయసు దాటిన తర్వాత కూడా పెరుగుతుండే స్వభావంగల ప్రత్యేక అవయవం లివర్! ఈ పెరుగుదలకు కేవలం రెండు, మూడు నెలల వ్యవధి చాలు" లివర్ కున్న మరో ప్రత్యేకత ఏమిటంటే రెండు మార్గాల ద్వారా ఈ అవయవానికి రక్త ప్రసరణ జరుగుతుంటుంది మామూలుగా అన్ని అవయవాలకు ఒక మార్గం ద్వారానే రక్త ప్రసరణ జరుగుతుంటుంది, హిపాటిక్ ఆర్టెరీ ద్వారానే కాకుండా పోర్టల్ వీన్ ద్వారా కూడా జీర్ణాశయం, పాంక్రియాజ్ మొదలయిన వాటి నుంచి రక్తం లివర్‌కి చేరుతుంటుంది ఆహార నాళంలోని అన్ని భాగాల నుంచీ వచ్చే రక్తం లివర్ ద్వారా ప్రయాణించే గుండె, ఊపిరితిత్తులకు వెళ్తుంది



అమీబియాసిస్ వచ్చిన లివర్

ఇలా రక్తం లివర్ ద్వారా వెళ్ళేప్పుడు రక్తంలో వున్న విషపదార్థాలు జీర్ణరసాలు వేరు చేసి శుద్ధ రక్తాన్ని బయటికి పంపుతుంది లివర్ అంటే లివర్ రక్తాన్ని శుద్ధి చేసి విషపదార్థాల్ని వేరు చేస్తుందన్న మాట ఈ వేరు చేసిన పదార్థాల్ని బైల్ రసంతోపాటు కామన్ బైల్‌డక్ట్ ద్వారా డుయోడనమ్‌లోకి పంపుతుంది అవి చిన్న ప్రేవులలోకి వెళ్తాయి అక్కడ నుంచి జీర్ణరసాలను చిన్న ప్రేవులు పీల్చి ఆయాఅవయవాలకు పంపుతాయి మిగిలిన వ్యర్థపదార్థములతో కలసి బయటకి నెట్టి వేయబడతాయి

నిమిషానికి 1 2 లీటర్ల రక్తం లివర్ ద్వారా ప్రవహిస్తుంటుంది హిపాటిక్ వీన్స్ ద్వారా లివర్ నుంచి రక్తం బయటకు వెళ్తుంది ఈ వీన్స్‌లో అడ్డం పడితే హిపాటిక్ వీన్ థ్రాంబోసిస్ వస్తుంది ఇది చాలా అపాయకరమైన అనారోగ్యము కానీ ఇలా హిపాటిక్ వీన్స్ సాధారణంగా బ్లాక్ కావు.

లివర్ రెండు లోబ్స్‌లోను బైల్ రసం తయారవుతుంది ఈ రసం బైల్‌డక్ట్ అనే మార్గం ద్వారా ఆహార నాళాన్ని డుయోడినమ్ దగ్గర చేరుకుంటుంది బైల్ డక్ట్, డుయోడినమ్‌లోకి ప్రవేశించిన ప్రదేశంలో ఒక కవాటము వుంటుంది ఆహార పదార్థాలు జీర్ణమవుతూ డుయోడినమ్‌లోకి ప్రవేశించినప్పుడు మాత్రం బైల్ రసంలోపలికి వెళ్ళేట్లు చేస్తుంది ఈ కవాటము మిగతా సమయాలలో ఈ రసాన్ని డుయోడినమ్‌లోకి రానీయదు అప్పుడు లివర్‌లో తయారైన బైల్ రసమంతా మరో మార్గం గుండా గాల్‌బ్లాడర్‌లోకి వెళ్లి నిల్వ వుంటుంది. అవసరమైనప్పుడు డుయోడినమ్‌లోకి వస్తుంది లివర్, గాల్ బ్లాడర్‌ల నుంచి వచ్చే మార్గాలే కాకుండా పాంక్రియాజ్ నుంచి వచ్చే మార్గం కూడా వీటితో కలసి కామన్ డక్ట్ ఏర్పడి, అది డుయోడినమ్‌కి కలువబడి వుంటుంది అంటే పాంక్రియాటిక్ జ్యూస్ కూడా బైల్ రసంతో పాటే డుయోడినమ్‌లో కలుస్తుందన్నమాట! కాబట్టి ఈ మార్గంలో ఎక్కడ అడ్డంకి ఏర్పడ్డా ఈ రసాలు డుయోడినమ్‌లోకి ప్రవేశించలేవన్నమాట! పాంక్రియాటైటిస్ అనే జబ్బు మన దేశంలో ఎక్కువగా వస్తోంది సరయిన పోషకాహారం లేక పాంక్రియాజ్ దెబ్బతింటే ఇన్సులిన్ ఉత్పత్తి

**అందుకే వాటిని తెలుసుకోండి**

కాదు దాంతో రక్తంలోషుగర్ పెరుగుతుంది

మన శరీరంలో మెదడు తర్వాత అతి క్లిష్టమైన, ముఖ్యమైన అవయవము లివర్ ఇది రక్తాన్ని శుభ్రం చేయడం, బైల్ రసాన్ని వుత్పత్తి చేయడంతోపాటు మరెన్నో ముఖ్యమైన పనుల్ని కూడా నిర్వర్తిస్తోంది మనం తిన్న ఆహారాన్ని, కేలరీస్‌లోకి శక్తిగా మార్చేది లివరే! క్రొవ్వుల్ని, వాటిలో కరిగి వుండే విటమిన్లుని స్వీకరించేది లివరే!! లివర్‌కి అనారోగ్యం వస్తే క్రొవ్వులు శరీరంలో స్వీకరించబడక మలము ద్వారా బయటకు వెళ్లిపోతుంటుంది విటమిన్ ఎ, డీ, కె లు క్రొవ్వులలో కరిగి వుంటాయి కాబట్టి లివర్‌కి జబ్బు వస్తే ఈ విటమిన్లను శరీరం స్వీకరించలేదు ఇవన్నీ మలము ద్వారా బయటకి వెళ్లిపోతుంటాయి విటమిన్ 'ఎ' తగ్గితే కంటి చూపు దెబ్బతింటుంది, 'డి' తగ్గితే ఎముకలు దెబ్బతింటాయి, 'కె' తగ్గితే రక్తం గాయం ద్వారా బయటికొస్తుంటే త్వరగా గడ్డ కట్టి, స్రావం ఆగదు లివర్ అనారోగ్యం వస్తే ఈ విటమిన్లని ఇంజక్షన్స్ ద్వారా ఇవ్వాల్సి 'వస్తుంది సెక్స్ హార్మోన్ల వుత్పత్తిని కూడా లివర్ క్రమపరుస్తుంటుంది లివర్ అనారోగ్యం వల్ల ఆడవాళ్ళలో రుతుక్రమం దెబ్బతింటుంది, మగవాళ్ళలో శరీరం మీద వెంట్రుకలు రాలిపోవడం, ఇంపొటెన్సి కలగవచ్చు ఏవైనా కణాలు దెబ్బతింటే, ఆ ప్రాంతంలో క్రొత్త కణాలని వుత్పత్తి చేసే ఎంజైమ్స్, ప్రొటీన్సని కూడా లివరే తయారు చేస్తుంటుంది కాబట్టి లివర్‌కి అనారోగ్యం వస్తే దెబ్బతిన్న కణాల స్థానంలో క్రొత్త కణాలు తయారవడం కూడా ఆలశ్యమవుతుంది లివర్ జబ్బు వున్న వాళ్ళకు యాక్సిడెంట్లయినా, ఆపరేషన్ అయినా తిరిగి మామూలు స్థితికి రావడానికి ఆలశ్యమవుతుంది

"గుండె, ఊపరితిత్తులు మొదలైన అవయవాలకి అనారోగ్యము వస్తే నొప్పి ద్వారా మనం వెంటనే తెలుసుకోగలం లివర్ అనారోగ్యాల ప్రారంభ దశలో ఇలాంటి నొప్పులేవీ వుండవు కాబట్టి వస్తున్న అపాయాన్ని ముందుగా పసిగట్టలేము" అంటారు డాక్టర్ డి నాగేశ్వరరెడ్డిగారు

"మరి లివర్ జబ్బుల్ని పసిగట్టడం ఎలాగండి?"

"ఇందుకు కొన్ని రక్త పరీక్షలు వున్నాయి రక్తంలో బిలిరుబిన్ అనే ఆరెంజ్ రంగు పదార్థం ఎంత వుందో తెలుసుకునే పరీక్ష చేస్తారు దీనివల్ల లివర్ సామర్థ్యాన్ని తెలుసుకోవచ్చు ట్రాన్సామినేజెస్ అనే ఎంజైమ్స్ రక్తంలో వున్నాయేమో తెలుసుకునే పరీక్ష చేస్తారు లివర్ కణాలు దెబ్బతిన్నప్పుడు ఈ ఎంజైమ్ వుత్పత్తి అవుతుంటుంది అందు



లివరు

కని రక్తంలో ట్రాన్సామినేజెస్‌ని బట్టి లివర్ ఎంత ఎక్కువగా దెబ్బతిందో తెలుసుకోవచ్చు అల్బుమిన్ లెవల్‌ని బట్టి లివర్ సామర్థ్యాన్ని తెలుసుకోవచ్చు ఎక్కువగా త్రాగుడుకు అలవాటుపడితే తట్టుకోవడానికి గామా గ్లుటామిల్ ట్రాన్స్‌పెప్టిడేజ్ అనే ఎంజైమ్‌ని లివర్ వుత్పత్తి చేస్తుంటుంది రక్తంలో ఈ ఎంజైమ్‌ని బట్టి లివర్‌కి వచ్చే కొన్ని అనారోగ్యాలని పసిగట్టవచ్చు ఈ రక్త పరీక్ష అన్నింటిని లివర్ జబ్బుల్ని తెలుసుకోవడానికి చేస్తుంటారు అలాగే హెపటైటిస్ ఎ, బి వైరస్‌లు వున్నాయేమో తెలుసుకునే పరీక్ష ముఖ్యం! అల్ట్రా సౌండ్ పరీక్షలతో లివర్ లోపల, చుట్టూ వున్న అవకతవకల్ని పసిగట్టవచ్చు, బైల్ డక్ట్‌లో రాళ్ళు అడ్డంపడితే పసిగట్టవచ్చు, గాల్‌బ్లాడర్, లివర్‌లో రాళ్ళున్నా తెలుసుకోవచ్చు పాంక్రియాజ్ హెడ్‌లో కాన్సర్ వున్నా అల్ట్రా సౌండ్ ద్వారా పసిగట్టవచ్చు పాంక్రియాజ్ హెడ్‌లో కాన్సర్ వున్నా జాండిస్ రావచ్చు అలాగే డక్ట్‌లో అడ్డం పడ్డా, లివర్-గాల్‌బ్లాడర్‌లలో స్టోన్స్ ఎక్కువైనా, లివర్ హెపటైటిస్ వైరస్ వల్ల దెబ్బతిన్నా, త్రాగుడు ఎక్కువై లివర్‌కి సిరోసిస్ వ్యాధి వచ్చినా జాండిస్ వస్తుంది" అంటారు డాక్టర్ నాగేశ్వరరెడ్డి

## జాండిస్ అంటే ఏమిటి?

"అసలు జాండిస్ అంటే ఏమిటండీ ?"

"లివర్ ఉత్పత్తిచేసే బైల్‌రసంలో బైల్ పిగ్‌మెంట్స్, కొలెస్టరాల్, బైల్‌సాల్ట్స్ ఉంటాయి ఇది బాగా చేదుగా ఉంటుంది వాంతిలో ఈ రసాన్ని, గాస్ట్రిక్ యాసిడ్‌ని వేరువేరుగా మనం కనుక్కోవచ్చు బైల్‌రసంలో ఉండే బిలిరుబిన్, బిలివెర్డిన్ అనే బైల్ పిగ్మెంట్స్ పసుపు, ఆకుపచ్చ బైల్ రసానికి కారణాలు ఎర్ర రక్తకణాలు పగిలి ఈ పిగ్మెంట్స్ తయారవుతుంటాయి ఎర్ర రక్తకణాలు ఎక్కువగా విభజింపబడితే ఏర్పడ్డ పిగ్‌మెంట్స్ బాగా దగ్గరగా అంటుకుపోయి నల్లటి రాళ్లలా ఏర్పడతాయి ఈ రాళ్లు చిన్నవైతే బైల్ రసంతో కలసి డుయోడినమ్‌లోకి కొట్టుకుపోతాయి లేకపోతే బైల్‌డక్ట్ ద్వారా వెళ్లకుండా అడ్డం పడతాయి ఈ బైల్ పిగ్‌మెంట్సే మలానికి పసుపు రంగునిచ్చేది కాబట్టి డుయోడినమ్‌లోకి ప్రవేశించకుండా బైల్ రసానికి అడ్డం పడితే మలము రంగు మారుతుంది బైల్ లోని యురోబిలినోజిన్ అనే పసుపుపచ్చని పదార్థం మూత్రానికి మామూలు రంగునిస్తుంది కాబట్టి ఈ పదార్థము ఆహార నాళంలోకి రాకపోతే మూత్రం ముదురు ఆరెంజ్ రంగులో వస్తుంది బైల్ పిగ్‌మెంట్‌తో పాటు బైల్‌రసంలో కొలెస్ట్రాల్, బైల్‌సాల్ట్స్ ఉంటాయనుకున్నాము కదా. కొలెస్టరాల్ నీటిలో కరుగదు బైల్

వాతలు జాండీస్‌కి వైద్యం కాదు. ఇలాంటి చికిత్సవల్ల ప్రాణాపాయం కొనితెచ్చుకోవడమే!





అతిగా త్రాగడం వల్ల లివర్‌కి 'సిరోసిస్' అనే అనారోగ్యము కలుగుతుందంటున్నారు డాక్టర్లు

సాల్ట్స్, పాస్ఫోలిపిడ్స్ ఉంటే వాటిలో ఇది కరిగి ద్రవ రూపంలో ఉంటుంది ఒక వేళ బైల్‌సాల్ట్స్ తగ్గితే కొలెస్ట్రాల్ గడ్డకట్టి రాళ్లలా లివర్‌లో, గాల్‌బ్లాడర్‌లో అడ్డం ఎడుతుంటుంది ఈ రాళ్లు గాల్ బ్లాడర్‌లో గాని, లివర్‌లో గాని ఉన్నా ఒక్కోసారి నొప్పి కూడా లేకుండా ఉంటుంది అందుకని నొప్పి లేనంత మాత్రాన ఇవి లేవని అనుకోవడానికి వీలు లేదు ఎన్నాళ్లో ఉన్న తర్వాత ఒక్కోసారి ఎప్పటికో బయటపడతాయి కొద్దిగా నొప్పి, జ్వరము ఉండవచ్చు ఆకలి ఉండదు జాండిస్ రావచ్చు అప్పుడు ఈ రాళ్లను తీసివేయడం ఒక్కటే మార్గం దీన్ని సర్జికల్ జాండిస్ లేక అబ్‌స్ట్రక్షన్ జాండిస్ అంటారు గాల్ బ్లాడర్‌లోనో, లివర్‌లోనో కామన్ బైల్ డక్ట్‌లోనో ఈ రాళ్లు అడ్డం పడటం వల్ల ఈ జాండిస్ వస్తుందన్న మాట "

## ఎండోస్కోప్ ద్వారా రాళ్ల తొలగింపు

"శస్త్రచికిత్స ద్వారా ఆ రాళ్లను తొలగించవచ్చు కదండీ "

"తొలగించవచ్చు ఇప్పుడు శస్త్ర చికిత్స చేయకుండా కూడా ఈ రాళ్లను ఇ ఆర్ సి పి అనే పక్కకి చూసే ప్రత్యేక ఎండోస్కోప్ సాయంతో కనుక్కొని తొలగించవచ్చు" అంటారు నాగేశ్వరరెడ్డి

"శస్త్రచికిత్స చేయకుండా ఈ ఎండోస్కోప్‌ని లివర్‌లోకి ఎలా పంపుతారండి ?"

"ఎండోస్కోప్ సన్నని గొట్టము ఒక చివర ఫైబర్‌లైట్ ఉంటుంది ఈ భాగాన్ని నోటి ద్వారా లోపలికి పంపి, రెండో కొనకున్న లెన్స్ ద్వారా చూడవచ్చు ఈ ఎండోస్కోప్ సాయంతో ప్రక్కకీ చూడవచ్చు కాబట్టి లివర్, గాల్‌బ్లాడర్, పాంక్రియాజ్‌లను ఈ ఎండోస్కోప్ సాయంతో క్షుణ్ణంగా చూడవచ్చు ఈ ఎండోస్కోప్ ద్వారానే సన్నని సూదిని లోపలికి పంపి రాళ్లను ముక్కలు చేసి అడ్డు తొలగించవచ్చు ఇలా ఎండోస్కోప్ సాయంతో లోపల ఎన్ని రాళ్లున్నా తీసేయవచ్చు అరగంటలో రోగికి ఎటువంటి నొప్పి కలగకుండా వీటిని తొలగించవచ్చు అదే సర్జరీ చేస్తే కొన్ని రోజులు బెడ్‌మీద ఉండాల్సి వస్తుంది ఎండోస్కోప్ చేసిన అరగంట తర్వాత మామూలు పనికి అటెండవవచ్చు" అంటున్నారు డాక్టర్ నాగేశ్వరరెడ్డిగారు

హైద్రాబాద్‌లోని మెడినోవాలో ఆయన ఈ ఎండోస్కోపి చేస్తున్నారు

"ఒక్కోసారి ఎర్ర రక్తకణాలు ఎక్కువగా విభజింపబడటం వల్ల, లివర్ రోగగ్రస్థమవటం వల్ల, బైల్ రసానికి అడ్డం పడటం వల్ల జాండిస్ వస్తుంటుంది అప్పుడు బైల్ రసంలోని పిగ్‌మెంట్ 'బిలిరుబిన్' రక్తంలో కలిసి, చర్మంలో డిపాజిట్ అవుతుండటం వల్ల జాండిస్ వచ్చినప్పుడు పసుపు రంగు కనిపిస్తుంటుంది బైల్‌సాల్ట్స్ చర్మంలో డిపాజిట్ అవటం వల్ల జాండిస్ వచ్చినప్పుడు దురద పుడుతుంటుంది గాల్ బ్లాడర్‌లోని రాళ్లు కామన్ బైల్‌డక్ట్‌లో అడ్డం పడుతున్నప్పుడు నొప్పిగా ఉంటుంది లివర్‌కి హెపటైటిస్ ఎ బి అనే వైరస్‌ల ఇన్‌ఫెక్షన్‌వల్ల వచ్చే జాండిస్‌ని 'మెడికల్‌జాండిస్' అంటారు అంటే దీనికి సర్జరీ అక్కర లేదు మందుల ద్వారానే తగ్గించవచ్చు ఈ జాండిస్‌ని పక్కకు చూసే ఎండోస్కోపి సాయంతో కనుక్కోవచ్చు ఒక్కోసారి ఏ మందులు వాడకపోయినా శరీరానికి ఉన్న రోగ నిరోధక శక్తితో క్రమంగా ఈ ఇన్‌ఫెక్షన్‌ని తగ్గించగలదు ఇలాంటి జాండిస్ మందులు వేయకపోయినా తగ్గుతుంది కాబట్టి మనం పసర్లు, వాతలు లాంటివి పెట్టి, కొంతకాలం వేచివున్న తర్వాత తగ్గితే ఈ పసర్లు, వాతల ప్రభావంతోనే తగ్గాయనుకుంటాం కానీ కాదు వాస్తవానికి ఆ ఇన్‌ఫెక్షన్ దానంతట అదే తగ్గిందన్నమాట ఇలాంటి నాటు వైద్యాలను తీసుకోవడంవల్ల జాండిస్ తగ్గటం మాటటుంచి, ముదరవచ్చు ఎందుకనంటే అబ్‌స్ట్రక్షన్ జాండిస్ లేక ఫాంక్రియోటైటిస్‌వల్ల, సిరోసిస్ వల్ల జాండిస్ వచ్చి ఉంటే అది పెరిగిపోతుంది కదా" అన్నారు నాగేశ్వరరెడ్డిగారు

"హెపటైటిస్ ఇన్‌ఫెక్షన్ ఎందుకు వస్తుందండీ ?"

"కలుషిత నీరు త్రాగటం వల్ల, కలుషిత ఆహారం వల్ల, అపరిశుభ్ర రక్తాన్ని శరీరంలోకి ఎక్కించటం వల్ల, సరిగ్గా స్టెరిలైజ్ చేయని సిరంజిలతో ఇంజెక్షన్ చేయటం వల్ల హెపిటైటిస్ ఎ, బి అనే వైరస్‌లు లివర్‌లోకి ప్రవేశించి జాండిస్ వస్తుంది లివర్ దెబ్బతింటే గొంతు లోపల రక్తనాళాలు ఉబ్బుతాయి స్ప్లీన్ పెరుగుతుంది హెపటైటిస్ ఇన్‌ఫెక్షన్ వస్తే లివర్ పెరుగుతుంది కాబట్టి హెపటైటిస్ ఒక మనిషి నుంచి మరో మనిషికి నీటి ద్వారా, ఆహారం ద్వారా, రక్తం ద్వారా, ఇంజెక్షన్ల ద్వారా వ్యాపించవచ్చన్న మాట' ఈ ఇన్‌ఫెక్షన్ వస్తే ప్రారంభ దశలో ఫ్లూ జ్వరంలా ఉంటుంది ఆకలి ఉండదు, కండరాలలోను, కీళ్ల దగ్గర నొప్పులుంటాయి కొన్ని రోజులలోనే ఈ లక్షణాలు జాండిస్‌లోకి దించుతాయి మూత్రము, మలము రంగు మారుతుంది ఈ తరహా జాండిస్ వస్తే ప్రధమ

లివర్ మన శరీరంలో ఈ స్థానంలో వుంటుంది



దశలో క్రొవ్వులు లేని ఆహారం తీసుకోవటం మంచిది "

## ఆల్కహాల్ తీసుకుంటే లివర్ వ్యాధి!

"ఆల్కహాల్ వల్ల లివర్ పాడవుతుందంటారా ?"

"తప్పకుండా వైరస్ లాంటి వాటివల్ల లివర్ దెబ్బ తిన్నప్పుడు ఆల్కహాల్ తీసుకోవటం అసలు మంచిది కాదు అప్పుడు లివర్‌కి రెండో దెబ్బ తగులుతుంది హెపటైటిస్ 'ఏ' వైరస్ ఇన్‌ఫెక్షన్ రాకుండా ఏ వాక్సిన్ లేదు గాని, హెపటైటిస్ 'బి' రాకుండా వాక్సిన్ ఉంది ఈ ఇన్‌ఫెక్షన్ రాకుండా డాక్టర్లు కూడా ఈ వాక్సిన్‌ని తీసుకుంటూ ఉంటారు ఆల్కహాల్ తీసుకోవటం వల్ల 'సిర్రోసిస్' అనే లివర్ వ్యాధి వస్తుంటుంది. కొంతమందికి బాగా తీసుకుంటే రావచ్చు మరికొంతమందికి కొద్దిగా తీసుకున్నా వస్తుంది కాబట్టి అతిగా తాగితేనే వస్తుందని చెప్పడానికి వీలు లేదు కొందరికి తక్కువగా తాగినా రావచ్చు ఏ రకమైన ఆల్కహాల్ తీసుకున్నా సిర్రోసిస్ రావచ్చు ఆల్కహాల్ తీసుకోవటం వల్ల లివర్ లోపల క్రొవ్వు చేరుతుంది. క్రమంగా లివర్ చిన్నదై గట్టిపడుతుంది. అప్పుడు వచ్చే జాండిస్ హెపటైటిస్ వచ్చినప్పటి జాండిస్ లాగానే ఉంటుంది కాకపోతే రక్త విరేచనాలు కావచ్చు క్రమంగా లోపలి కణాలు చనిపోయి లివర్ గట్టిపడడంవల్ల బైల్ రసం ఉత్పత్తి తగ్గిపోతుంది. ఇలా లివర్‌కి రకరకాలుగా అనారోగ్యాలు కలుగుతాయి లివర్ అమీబియాసిస్ కూడా రావచ్చు. అప్పుడు ఇన్‌ఫెక్షన్‌తో లివర్ చిల్లులు పడటం, చీము పట్టడం జరుగుతుంది. కొన్ని కొన్ని రకాల మందుల్ని అతిగా వాడడంవల్లా లివర్ దెబ్బ తింటుంది. లివర్ మన శరీరంలో మెదడు తర్వాత అంత ముఖ్యమైన అవయవం దీని ఆరోగ్యాల చికిత్సకు నాటు వైద్యాల జోలికి పోకుండా సరయిన చికిత్స సకాలంలో పొందడం అవసరం" అంటారు డి నాగేశ్వరరెడ్డిగారు.

## చిన్న పిల్లల్లో లివర్ వ్యాధులు

"చిన్న పిల్లల్లో కొందరికి లివర్ జబ్బుతో పొట్ట ఉబ్బరిస్తుంటుంది కదండి ."

"దాన్ని ఇండియన్ చైల్డ్‌హుడ్ సిరోసిస్ అంటారు. మూత్ర పిండాలు పనిచేయడానికి అవసరమయ్యే కొన్ని హార్మోన్లని లివర్ ఉత్పత్తి చేయలేకపోతున్నప్పుడు ఈ జబ్బు వస్తుంది పెద్ద ప్రేగులలో, కడుపులో నీరు చేరుతుంది కడుపులో వాపు, తర్వాత కాలు వాపు వస్తుంది చాలాకాలం ఎటువంటి లక్షణాలు లేకుండా హఠాత్తుగా కళ్ళు తిరి పడిపోవచ్చు. రాగి పాత్రలలో వేడినీరు లే పాలు త్రాగడం మంచిది కాదు. హెపటైటిస్ బి ఇన్‌ఫెక్షన్ రావచ్చు. కళాయి పేసిన పాత్రలే వాడాలి" అని కూడా చెప్తున్నారు డాక్టర్ నాగేశ్వరరెడ్డి



శస్త్రచికిత్స లేకుండా ఎండోస్కోప్ ద్వారా లివర్ కాయన్ డక్ట్‌లోని రాళ్లని తొలగించడం.

ఇ. ఆర్ సి పి. అనే ప్రత్యేక ఎండోస్కోప్‌తో శస్త్రచికిత్స లేకుండా లివర్, గాల్ బ్లాడర్‌లోని రాళ్లను తొలగించే ఈ చికిత్స మన రాష్ట్రంలో ఈయనే చేయగలరు. డా. నాగేశ్వరరెడ్డి చిరునామా:

డా. డి. నాగేశ్వరరెడ్డి,
(ఎమ్ డి, డి ఎమ్)
మెడినోవాడయాగ్నస్టిక్ సెంటర్,
పంజగుట్ట, హైదరాబాద్.

-వేదగిరి రాంబాబు
ఫొటోలు మిట్టమీద సుధాకర్

సీరియల్

# పంచశూలమ్

## విశ్వప్రసాద్

## 70

(గత సంచిక తరువాయి)

ఓ డాక్టరు యిద్దరు నర్సులు సపర్యలు చేశారు ఊర్వశికి

ఆమె మంచం పక్కనే కూర్చున్నాడు పంచశూలమ్

ఉదయం పది గంటలకు తెలివిలోకి వచ్చింది ఆమె కొన్ని మందులు టానిక్కులు యిచ్చి డాక్టరూ నర్సులూ వెళ్ళిపోయారు

నీరసంగా దీనంగా పంచశూలమ్ వంక చూసింది ఊర్వశి

తప్పు

ప్రశ్నార్ధకంగా అతని ముఖంలోకి చూసింది ఆమె

మీ జీవితాలకు బవిష్యత్తుకు అతను బాధ్యుడు కాదు ఓ బిక్షగత్తె కూతుర్ని వ్యబిచారి చెల్లెల్ని పెళ్ళి చేసుకోడానికి - సాంప్రదాయం గల ఏ యువకుడూ అంగీకరించడు మీ కుటుంబం - నిర్భాగ్య స్థితిలోంచి దౌర్భాగ్యం లోకి నీతి నుండి అవినీతికి దిగజారడానికి కారణం మీ అమ్మ నాన్నలే కాదు - నువ్వు కూడా బాధ్యురాలివే మీ నాన్న హత్యగావింపబడ్డాడు అతన్ని వక్ర మార్గంలో పెట్టిన

**ఇంతవరకూ సాగిన కథ- 18:** జోషీ కేసు దర్యాప్తులో భాగంగా పంచశూలమ్ పంపిన యువకుడు ఇన్‌స్పెక్టర్ 'షా'గా చెలామణీ అవుతుంటాడు గురూజీ కూతురు మీనాక్షి అంధురాలై తర్వాత కన్ను మూస్తుంది. పంచశూలమ్ కిడ్నాప్ చేసిన జయరాజ్ కొడుకు మోహన్ హత్యకు గురవుతాడు. ఊర్వశి చేతిలో ఎం. ఎల్. ఏ దీపాదేవి కాల్చి చంపబడుతుంది. కసి పెంచుకున్న మదన్ పరిమళను కాల్చి చంపి ఆమె శవాన్ని యింటిముందు వ్రేలాడదీస్తాడు. ఊర్వశి తల్లి, చెల్లెలు ఉరిపోసుకొని చచ్చిపోతారు సుభాష్ తండ్రే పంచశూలమని సోఫియా అతనికి తెలియజేస్తుంది

ఎలా ఉంది? ప్రశ్నించాడు

చచ్చిపోవాలని ఉంది అంటూ బోరున ఏడ్చింది

నువ్వు కాదు - నీ శత్రువులు చావాలి బేబీ! ఇది మహా ప్రపంచం గతాన్ని గడచిన రాత్రిని తెల్లవారే సరికి మరచి పోవాలి

మా అమ్మా చెల్లీ

చనిపోయారు వాళ్ళ గురించి విచారించి ప్రయోజనం లేదు

వాళ్ళిద్దరి ఆత్మహత్యలకు కారకు లెవరు?

నువ్వు చెప్పు

మల్లికను పెళ్ళి చేసుకుంటానన్న యువకుడే

దీపాదేవి కాల్చివేయబడింది మీ అమ్మ ఉరేసుకుంది ఇహ మిగిలింది నువ్వు గతాన్ని మరచిపో బవిష్యత్తును తీర్చిదిద్దుకో

నా జీవితానికి మిగిలిందేముంది? నేను వ్యబిచారిని నాకు చరిత్ర లేదు నిష్కృతి లేదు బవిష్యత్తు లేదు నేను బతకడం వ్యర్థం

ఈ ప్రపంచంలో ఏ ఒక్కరూ తన కోసం బతకడం లేదు బేబీ! తనను కోరేవారి కోసం బతుకుతున్నారు

నన్నెవరు కోరుతున్నారు? ఎవరికి కావాలి నేను?

నాకు కావాలి

నేనే విదంగా ఉపయోగపడతాను మీకు?

వెంటనే సమాదానం చెప్పలేక పోయాడు పంచశూలమ్ కొన్ని క్షణాల పాటు మౌనం వహించాడు

అతని ముఖం వంక చూస్తూ మొదటి రోజున మిమ్మల్ని అర్థంజేసుకో లేక పోయాను కాని ఈ నాడు క్షుణ్ణంగా అర్థంజేసుకున్నాను మీరు నా ప్రశ్నకు జవాబివ్వరు నేనే సమాదానం చెబుతాను అంది ఊర్వశి

చెప్పు

మదనంటే ప్రాణం నాకు

పంచశూలమ్ మాట్లాడలేదు

అతనికి నేనంటే జాలి యిష్టం

కావచ్చు

అందుకే మీరు నన్ను అబిమానిస్తున్నారు

మీ యిద్దరు - ఒకరంటే మరొకరికి యిష్టం

వెల్ నేనెందుకు నిన్ను అబిమానించాలి?

మదన్ మీ కొడుకు కనుక వెంటనే సమాదానమిచ్చింది

ఆశ్చర్య పోయాడు ఆమె ముఖంలోకి విచిత్రంగా చూశాడు ఏదో కొత్త వార్త చెబుతున్నావ్? అన్నాడు పంచశూలమ్

వాస్తవం చెబుతున్నాను

ఇది నీ వూహ

ఏడెనిమిది సంవత్సరాల నుండి వ్యబిచారం చేస్తున్నాను ఈ వృత్తికి అందంతో పాటు లౌకిక జ్ఞానం మనస్తత్వ పరిశోదన కూడా కావాలి మీకు పరిమళమ్మ గారికి మదన్‌కి మద్య జరిగిన సంఘటనల్ని తర్జనబర్జన చేసి ఆలోచించాను మీరే మదన్ తండ్రి - జోషీగారని నిశ్చయించుకున్నాను

తొందర పడి యిలాంటి నిర్ణయాలు చెయ్యకూడదు

నా నిర్ణయం పొరపాటు కాదు

నువ్వు వూహించిన విషయాలు మదన్‌కి చెప్పావా?

లేదు చెప్పినా అతను పట్టించుకోడు ఇలాంటి బాదర బందీలు పెట్టుకోడు

దీర్ఘంగా నిట్టూర్చాడు పంచశూలమ్ కుర్చీలోంచి లేచాడు రెండు గ్లాసుల్లో హార్లిక్స్ కలిపాడు ఓ గ్లాసు ఊర్వశి కిచ్చాడు

చటుక్కున మంచం మీద నుండి లేచింది ఆమె మీ చేత సేవ చేయించుకో లేను అంది

పర్వాలేదు

మీకు మేము సేవ చెయ్యాలి ఈ వయసులో మీరు విశ్రాంతిగా జీవితాన్ని గడపాలి

జీవితానికి విశ్రాంతి లేదు విశ్రాంతిని కోరేది జీవితం కాదు

పంచశూలమ్ ఈ మాటలు అంటూ ఉండగా, లోపలకు వచ్చాడు మదన్ థేంక్ గాడ్! అన్నాడు ఉత్సాహంగా

దేనికి? ప్రశ్నించింది

నువ్వు ఆరోగ్యంగా ఉన్నందుకు

మదన్! పిలిచాడు పంచశూలమ్

సాబ్!

ఊర్వశి ఎప్పుడూ ఆరోగ్యంగా, ఆనందంగా ఉండాలంటే వెంటనే ఆమె జీవితానికి ఓ ఆధారం ఏర్పాటు చెయ్యి

మ్యార్ శూలమ్ సాబ్! ఊర్వశికి ఓ ప్లాటు కొంటాను నాలుగైదు లక్షలు బ్యాంక్‌లో వేస్తా_న ఆమె జీవితానికి ఏ లోటూ రాకుండా చూస్తా_న అన్నాడు దృఢ కంఠంతో మదన్

ఆమెకు సెక్యూరిటీ కావాలి

నా ప్రాణాన్ని ఇపచంగా తొడిగేస్తా_ను సా ఆమె ప్రాణాల కేమీ భయం లేదు



మీ యిద్దరకు నా మీద ఉన్న అబిమానానికి చాలా చాలా థేంక్స్ ఇహ నాకు సెలవిప్పించండి అంది ఊర్వశి

ఎక్కడికి కెళతావ్? కంగారుగా అడిగాడు మదన్

మా యింటికి

నో ఆ యింట్లో నువ్వు ఒంటరిగా ఉండలేవు

అన్నాడు పంచశూలమ్

వెంటనే తన కోటు జేబులోంచి తాళాల గుత్తి తీసి యిచ్చాడు-మదన్ మన బంగ్లా కెళ్ళు అక్కడ కూడా ఒంటరిగా ఉండలేవు

అతను యింకా ఏదో అనబోతుండగా సోఫియా లోపలకు వచ్చింది ఆమెను చూసి ముగ్గురూ ఆశ్చర్య పోయారు

నేను ఏదో చెప్పబోయింది సోఫియా

తెలుసు సుబాష్ భార్యవి అన్నాడు పంచశూలమ్

యస్ ఊర్వశిని చూడాలని వచ్చాను జరిగిన దానికి చాలా విచారిస్తున్నాను సిస్టర్' నీతో పరిచయం లేకున్నా నిన్ను కలుసుకుని నా ...ంతాపాన్ని తెలపాలనిపించింది అంది ఊర్వశిని ... ంచి సోఫియా

ఆల్ రైట్ అంకుల్! కమాన్ ఊర్వశీ! నేను కూడా నీతో పాటు మదన్ బంగ్లాలోనే ఉంటాను ఆ తర్వాత యిద్దరం కలసి మా భవనానికి వెళదాం అని ఆమె చెయ్యి పట్టుకుంది సోఫియా

ఏం చెయ్యమంటారు?' – అన్నట్లు పంచశూలమ్ ముఖంలోకి చూసింది ఊర్వశి

నిన్ను ఒంటరిగా విడిచి పెట్టడం సోఫియాకు యిష్టం లేదు ఎక్కడున్నా యిద్దరూ కలిసే ఉండండి అన్నాడు పంచశూలమ్

# 71

సోఫియా కారులో కూర్చుంది ఊర్వశి

ఇద్దరూ మదన్ బంగ్లాకు వచ్చారు తలుపులు తెరిచారు లోపల ప్రవేశించారు

అంతవరకూ మౌనంగా ఉంది ఊర్వశి గదిలోకి




తలగ ... అయింది ఊర్వశికి

అంతలోనే గడ్డాన్ని దువ్వుకుంటూ బేబీ! ధైర్యాన్ని కోల్పోవద్దు ఎన్ని కష్టాలయినా ఎదుర్కొనడానికి సిద్ధంగా ఉండు సోఫియా నీకు తోడుగా ఉంటుంది అన్నాడు

యస్ బాధల్ని తలచుకుని కుమిలి పోకూడదు పరిస్థితులకు తల వంచ కూడదు జీవితంతో పోరాడాలి కమాన్! రెండు రోజులు మా యింట్లో ఉండు అంది సోఫియా

ఆమెతో పాటు వెళ్ళేకంటే మదన్ బంగ్లాలో ఉంటేనే ఊర్వశికి శాంతి కలుగుతుందని భావించాడు పంచశూలమ్ అతని ప్రేమలోనే ఆమె గతాన్ని మరచి పోగలదని వూహించాడు అందుకే సోఫియాను ఉద్దేశించి బేబీ! ఊర్వశిని ఒకటి రెండు రోజులు మదన్ బంగ్లాలో ఉండనియ్ తర్వాత తీసుకెళుదువుగాని అన్నాడు

రాగానే దు ఖాన్ని ఆపుకో లేక పోయింది తన తల్లి చెల్లెలు చేసుకున్న అఘాయిత్యం గురించి వివరిస్తూ ఏడవ నారంభించింది

ఇంతలో గేటు బైట జీప్ ఆగిన శబ్దం వినిపించింది

కిటికీ లోంచి బైటకు చూసింది సోఫియా ఇన్‌స్పెక్టర్ అబ్దుల్లా వస్తున్నాడు అంది

అతని ప్రాణాలు తీసేస్తాను దుఃఖంతోనూ ఆవేశంతోనూ వూగిపోతూ అంది ఊర్వశి

తొందర పడవద్దు అతను ఎవరి కోసం వస్తున్నాడో ఎందుకు వస్తున్నాడో చూద్దాం ఆ తర్వాత ఎం చెయ్యాలో ఆలోచిద్దాం అంది సోఫియా

ఇంతలో కాలింగ్ బెల్ మోగింది

వీధి తలుపు గది తలుపులు జేరవేసి ఉన్నాయి ఎప్పుడూ ఏ తలుపూ వెయ్యనివ్వడు మదన్ కమిన్! అంది నిర్లక్ష్యంగా ఊర్వశి

చటుక్కున కుర్చీలోంచి లేచింది సోఫియా ఫోన్ మీది రిసీవరు తీసి పక్కన పెట్టింది

తలుపు తోసుకుని ఓ ఎస్ ఐ నలుగురు కానిస్టేబుల్సు అబ్దుల్లా ఒకేసారి లోపలకు వచ్చారు

గదిలో అడుగు పెట్టగానే రివాల్వర్ తీసి పట్టుకున్నాడు అబ్దుల్లా ఊర్వశీ! యు ఆర్ అండర్ అరెస్ట్ అన్నాడు – గుబురు మీసాలు దువ్వుకొంటూ

దేనికి?

లాకప్‌లో ఉన్న భీమరాజును, ఎర్‌పోర్ట్‌లో ఎమ్మెల్యే దీపాదేవిని హత్య చేసినందుకు – ఐ పి సి 302 సెక్షన్ కింద నిన్ను అరెస్ట్ చేస్తున్నాం

కోపం మితిమీరి పోయింది ఊర్వశికి ఇన్‌స్పెక్టర్! ఎన్నో సార్లు నా మనసును హత్య చేశావ్ అమానుషంగా నా శరీరాన్ని అనుభవించావ్ వ్యక్తిత్వాన్ని నిలువునా ఖూనీ చేశావ్ ఈ నేరాలకు ఐ పి సి లో ఏ సెక్షన్‌లు వర్తిస్తాయి? అడిగింది

ఆమె ప్రశ్నకు అతని దగ్గర సమాధానం లేదు షటప్ అన్నాడు

నోరు మూసుకో వలసింది సిగ్గు పడవలసింది నేను కాదు – నువ్వు పోలీస్ స్టేషన్‌కి తీసుకెళ్ళి నువ్వు నన్ను చంపకుండా ఉంటే – కోర్టులో యిదే చెబుతాను

ఏమని?

ఆ రోజు రాత్రంతా నేను నీ కింద నలుగుతున్నానని అంతేకాదు– అసూయతో నువ్వే భీమరాజును చంపావని నిరూపిస్తాను

ఎంత ధైర్యం నీకు?

"పోలీసు వాళ్ళను చూసే నేర్చుకున్నాను మొండి ధైర్యం అబద్ధాలాడటం కూడా తెలుసు కున్నాను దీపంటే నీకు మహా మోజు ఆమె కోసం తాపత్రయ పడుతున్నాడని – లాకప్‌లో పెట్టి భీమరాజును చంపేశావ్ ఈ దేశం నుండి పారిపోతున్న దీపను విడిచి పెట్టలేక వెళ్ళొద్దని ప్రాధేయ పడ్డావ్ ఆమె వినలేదు అవమానంతో అసూయతో కక్షతో కోపంతో ఆమెను హత్య చేశావ్ ఈ విషయాలన్నీ కోర్టులో చెప్పి నిరూపిస్తాను దబాయించింది ఊర్వశి

ఉడికి పోయాడు అబ్దుల్లా షటప్ గది ప్రతిధ్వనించేటట్లు అరిచి ఆమెను కొట్టడానికి చెయ్యి పైకెత్తాడు

మెరుపులా అతని చెయ్యి పట్టుకుంది సోఫియా ఇన్‌స్పెక్టర్! ఆవేశ పడవద్దు మీరు మంచి చేసినా, చెడు చేసినా – దానికి రెట్టింపు అనుభవిస్తారు అంది

ఎవ్వేవరు?

"మీ ముత్తాత లాంటి పోలీసు ఆఫీసరు కూతుర్ని ఇంజనీర్ సుబాష్ భార్యను

ఆమెను తినేసేటట్లు గుడ్లురిమి చూశాడు

అబ్బుల్లా

మిస్టర్' మీ కోపతాపాలకు భయపడేదానిని కాను నేను అలా చూడండి రిసీవరుఫోన్ పక్కన ఉంది మీ మాటలన్నీ అవతలి వ్యక్తి వింటున్నారు

ఫోన్ మీదకు దృష్టిని సారించాడు అబ్దుల్లా అంతవరకు ఎవరితోనో మాట్లాడుతూ రిసీవరు పక్కన పెట్టినట్లు ఉంది అవతలి వ్యక్తి ఎవరు? అడిగారు

మదన్ పంచశూలమ్ డి యస్ పి, ఐ జి

సోపియా యింకా ఏదో చెబుతూనేవుంది ఐ జి పేరు వినేసరికి అదిరిపడ్డాడు అబ్దుల్లా చటుక్కున రిసీవరు తీసి ఫోన్‌మీదపెట్టాడు

అరెస్ట్‌హెర్' అన్నాడు ఊర్వశిని చూపిస్తూ

మరుక్షణంలోనే ఎస్ ఐ ముందుకు వచ్చాడు ఊర్వశి చేతులకు సంకెళ్ళు తగిలించాడు

మిస్టర్' తొందరపడుతున్నారు తర్వాత పశ్చాత్తాపపడతారు ఆమెను విడిచిపెట్టేయండి లేదా మీకు అనర్థాలు తప్పవు అంది సోపియా

చూస్తాం నోరెత్తినవాళ్ళను నరికేస్తాం ఎదురుతిరిగినవాళ్ళ తలలు పగలగొట్టేస్తాం'' అని గదిలోంచి బైటకు నడిచాడు అబుల్లా

ఊర్వశిని తీసుకుని అతని వెనకనే పోలీసువారంతా బయలుదేరారు

మహాకాళిలా తయారయింది సోపియా రిసీవరు అందుకుంది పంచశూలానికి ఫోన్ చేసింది గబగబా విషయంచెప్పింది అంకుల్' అబ్దుల్లా క్రూరుడు ఊర్వశిని చంపేస్తాడు అంది

డోంట్‌వర్రీ' నేను బతికున్నంతవరకు అబ్దుల్లా ఆటలు సాగనివ్వను ఊర్వశి మీద ఒక్క ఈగ వాలిందో పదిమంది అబ్దుల్లాల తలలు ఎగిరిపోతాయి అని అవతలివైపు రిసీవర్‌పెట్టేశాడు పంచశూలమ్

## 72

చెళ్ చెళ్ చెళ్

అబ్దుల్లా చేతిలోని కొరడా తాండవ నృత్యం చేసింది

బాదతో ఆవేదనతో సుడులు తిరిగిపోయింది ఊర్వశి

ఆమె పవిట తొలగిపోయింది – బొడ్డుకిందవరకు నగ్నదేహం కనిపిస్తోంది'

జాకెట్టు పిగిలిపోయింది – ఆమె స్తనాలు బైటకొచ్చాయి'

చీర చినిగి కిందకు జారిపోయింది' లంగా చినిగిపోయింది'

అర్ధనగ్నంగావున్న ఆమె శరీరాన్ని చూసి కామంతోనూ కోపంతోనూ మరీ రెచ్చిపోయాడు అబ్దుల్లా ఒపూరు మీసాలు దువ్వుకున్నాడు కొరడా పైకెత్తి మళ్ళీ ఆమెను కొట్టబోయాడు

కాని అతని చెయ్యి సాగలేదు కొరడా తాడు ముందుకు రాలేదు ఎవరో వెనక నిలబడి – చివరిబాగాన్ని పట్టుకున్నట్లనిపించింది

వెనక్కి తిరిగి చూశాడు అబ్దుల్లా

పర్వతంలా నిలబడిఉన్నాడు పంచశూలమ్

అతన్ని చూసేసరికి మరీ ఉగ్రుడైపోయాడు అబ్దుల్లా 'డేమ్ డెకారమ్ నా స్టేషన్‌లో కొచ్చి నామీద ఎదురుతిరగడానికి ఎన్ని గుండెలున్నాయ్? అరిచాడు

చాలా ఉన్నాయి అబ్దుల్లా' లెక్కపెట్టడం ఆరంభిస్తే నీ గుండెలు ఆగిపోతాయి అన్నాడు గంబీర కంఠస్వరంతో పంచశూలమ్

అరెస్ట్ హిమ్' స్టేషన్ దద్దరిల్లేలా అరిచాడు అబ్దుల్లా

కాని కానిస్టేబుల్స్ ఎస్ ఐలు ఒక్క అడుగు కూడా ముందుకు వెయ్యలేదు ఎక్కడివా రక్కడే నిలుచున్నారు

ఇంతలో డాం 'అన్న తుపాకి శబ్దం స్టేషన్ బైట నుండి వినిపించింది

రెండడుగులు ముందుకు వచ్చాడు గుమ్మంలోంచి బైటకు చూశాడు అబ్దుల్లా

రోడ్డుమీద మదన్, సోపియా నిలబడిఉన్నారు

# పంచశూలమ్

దూరంలో ఓ కారులో జయరాజ్ గురూజీలు కూర్చుని స్టేషన్‌వైపే చూస్తున్నారు

వాళ్ళను గమనించేసరికి మళ్ళీ - నిప్పు తొక్కిన కోతిలా ఎగిరిపడ్డాడు అబ్దుల్లా 'స్టేషన్‌మీదకే దండయాత్రకు వచ్చారా? అన్నాడు గుడ్లెర్రజేస్తూ

న్యాయంకోసం దేవుడితో నైనా పోరాడతాను ' పైప్ పీలుస్తూ శాంతంగా సమాధానమిచ్చాడు పంచశూలమ్

మీకు జరిగిన అన్యాయం ఏమిటి?

ఊర్వశి మీద చెయ్యిచేసుకోవడం అన్యాయం కాదా?

"ఆమె హంతకురాలు

ఎవర్ని చంపింది?

పోలీస్‌స్టేషన్‌లో భీమరాజును ఎర్‌పోర్ట్‌లో ఎమ్మెల్యే దీపాదేవిని

సిగ్గు సిగ్గు ఓ ఆడది మీ లాకప్‌లో వున్న ముద్దాయిని చంపడమా? ఇలా చెప్పుకోడానికి సిగ్గుపడాలి మీరు అయినా ఈ హత్యలు ఆమే చేసిందనడానికి ఆధారాలేవీ?

ఆధారాలు అక్కర్లేదు అనుమానం వున్న ప్రతి వ్యక్తిని అరెస్ట్ చేసే అధికారం ఉంది మాకు

కాని ఓ యువతిని నగ్నంగాచేసి ఇలా చిత్రహింసలుపెట్టే అధికారం లేదు మీకు ఆమెమీద అనుమానం వుంటే, నిరూపించి కోర్టుకు అప్పగించండి "

కోర్టుకేఅప్పగిస్తాను ఉరిశిక్షవేయిస్తాను '

సుబాష్ అంతవరకూ ఆమెకు రక్షణ కావాలి జామీనుమీద తీసుకెళతాను

జామీను యివ్వడానికి వీల్లేదు

"వెరీగుడ్! మీరు అలా అంటారని తెలుసు అందుకే ఏంటిసిపేటరీ బెయిల్ తీసుకున్నాను మీ స్టేషన్‌లో ఉంచి చిత్రహింసలుపెట్టి చంపడానికి వీల్లేదు ' అంటూ జేబులోంచి బెయిల్ ఆర్డర్ తీసి అబ్దుల్లాకిచ్చాడు పంచశూలమ్

ఆ ఆర్డరు చూసి స్తంభించిపోయాడు అబ్దుల్లా

అహింసావాదిని నేను హింసను సహించలేను చట్టాల్ని వ్యతిరేకించలేను కనుకనే ఏంటిసిపేటరీ బెయిల్ తీసుకు వచ్చాను దీనిప్రకారం ఊర్వశిని మీరు విడుదల చేస్తే సరేసరి లేకుంటే మరో మార్గం చూసుకుంటాను నేను

పంచశూలమ్ మాటలు శూలాల్లా గుచ్చుకున్నాయి అబ్దుల్లాకు కాని బెయిల్ ఆర్డరు చూసినతర్వాత తన నిస్సహాయ స్థితిని అర్థంజేసుకున్నాడు ఊర్వశిని విడిచిపెట్టకపోతే - స్టేషన్ బైటవున్న మదన్ కాల్పులు సాగిస్తా ...

పోరాటాలు జరుగుతాయని తన పదవికే ప్రమాదమని తెలుసుకున్నాడు ముక్తసరిగా

పార్మాలిటీలు పూర్తిచేసి ఆమెను విడిచిపెట్టండి అన్నాడు సార్జెంట్‌ని ఉద్దేశించి

తనకు కావలసిన వివరాలన్నీ రాసుకుని ఊర్వశి పంచశూలమ్‌ల సంతకాలు తీసుకున్నాడు సార్జెంట్

'డ్రస్ అప్ బేబీ" అన్నాడు గడ్డం సవరించుకుంటూ పంచశూలమ్

చినిగిపోయిన చీరనే తిరిగి కట్టుకుంది ఊర్వశి

ఆమె చెయ్యిపట్టుకున్నాడు పంచశూలమ్

ఇద్దరూ స్టేషన్‌లోంచి బైటకు నడిచారు

దీన హీనస్థితిలో వున్న ఊర్వశిని చూశాడు మదన్ కోపంతో పళ్ళు పటపట కొరికాడు తుపాకి సవరించుకుని - పరశురాముడిలా రెండడుగులు ముందుకువేశాడు

అతని ముఖకవళికలు గమనించాడు పంచశూలమ్ ఏమాత్రం అవకాశమిచ్చినా అతను అబ్దుల్లా ప్రాణాలు తీసేస్తాడని గ్రహించాడు ఊర్వశితో సహా అతని ముందుకెళ్ళి అడ్డంగా నిలుచున్నాడు మై బోయ్! రక్తపాతం మంచిదికాదు" అన్నాడు

శూలమ్ ...ట్! ఆవేశంతో ఏదో ...నబోయాడు మదన్

అ...పూర్తిగా చెప్పనివ్వలేదు

మ...లో అంచుకుని నో ఆర్గ్యుమెంట్స్ జరిగిందిమరించాలి జరగబోయేదానినిఎదుర్కోవాలి ఊర్వశి బాగా అలసిపోయింది తీసుకెళ్ళి విశ్రాంతి యివ్వు అన్నాడు ఆజ్ఞాపిస్తున్న ధోరణిలో ...ంచశూలమ్

మారు మాటాడలేదు మదన్ ఊర్వశి భుజంమీద చెయ్యివేశాడు ఆమెతో సహా తన టూరర్ కారు వైపు బయలుదేరాడు

వీడ్కోలు చెబుతున్నట్లు చెయ్యివూపాడు ...ంచశూలమ్

అదే సమయంలో -

ఇన్స్పెక్టర్ ఆలీషా వేషంలో - ఒంటరిగా జీప్‌లో అక్కడికి వచ్చాడు సుబాష్ జీప్ దిగి నలువైపులకు దృష్టిసారించాడు

ఊర్వశి మదన్ టూరర్‌వైపు వెళుతోన్నారు

సోఫియా పంచశూలాలు స్పోర్ట్స్ కారు దగ్గర కెళుతున్నారు

జయరాజ్, గురూజీలు తమ కారు స్టార్ట్ చేశారు

తోకతెగిన తాచుపాములా బుసలుకొడుతూ పోలీస్‌స్టేషన్ సింహద్వారం దగ్గర నిలుచున్నాడు అబ్దుల్లా!

పులిపిరి కాయను గోక్కొంటూ అబ్దుల్లావైపు అడుగులువేశాడు సుబాష్

(ఇంకావుంది)



ఇటీవలి భారీ వర్షాల కారణంగా ముంపునకు గురైన విజయవాడ రామలింగేశ్వర నగర్‌లో తాడు సహాయంతో ఒక వ్యక్తి ప్రాణాలు కాపాడుతున్న దృశ్యం

## కాగితం పడవ!

అది పాత కాగితమే
అలా అని చింపి పారెయ్యలేదు
అది కిలో చింతపండుని
మూటకట్టి ఇంటికి తెచ్చింది!
ఆ కాగితంతో కత్తి పడవ చేశాను
నిలిచిన వర్షపు నీటిలో వదిలాను
నీటిలో మునిగి పోతున్న చీమని
ఎక్కించుకుని ఒడ్డుకి చేర్చింది
ప్రాణబిక్ష పెట్టింది!
అయితే గాలికి ఆకు – మీద పడగా
ఆ బరువుకు బ్యాలెన్స్ తప్పింది
నీటిలో మునిగి పోతున్న చీమని రక్షించిన
నా కాగితం పడవ నీటిలో మునిగి పోయింది!

–తాజీ ప్రసాద్



## జీవితం

తరిగిపోయేది కాలమైతే
తిరిగి రానిది యవ్వనం!
జీవితం గతం కాక మునుపే
భవితవ్యానికి బాటలు వెయ్!
కష్టసుఖాల సమన్వయం
జీవితమని గుర్తించి
బాటసారిగా పయనించు!
జీవితాన్ని బాటగా మార్చు!!!!!

– కంకటి శంకర్‌రావు



## తంత్రం- మంత్రం

విభజించి పాలించుట
తెల్లవాడి తంత్రం!
రిజర్వేషన్ పాటించుట
మన "వాడి" మంత్రం!

- కె.వి.ఎస్. ప్రసాద్

## రాక్షసులు

శాంతి శాంతి యని
పలికితే పళ్ళూడగొడుతున్నారు!
నీతి నీతి యని చెబితే
నిలువునా పాతేస్తున్నారు!
న్యాయం న్యాయం కావాలని
గొంతెత్తితే గుండెల్లో
గునపం దించుతున్నారు!
ధర్మం ధర్మం యని
ప్రవచిస్తే చేతులు కాళ్ళను
తెగ నరుకుతున్నారు!
రోజూ దారుణ మారణాలు
గావించే రాక్షసులు!!
రక్తం రుచి మరిగిన పెద్దపులులు!!

-వి. జయరామిరెడ్డి

## దేవుడు!

దేవుడు! వున్నాడని
తప్పులు ఎన్నైనా చేయవచ్చు!
ఏడి? ఎక్కడ? దేవుడు? అన్నామో!
ఇంతకంటె నరరూపరాక్షసుడు
లేడంటారు

-ఆర్.కె.రావు సిరిపురపు

## కులదేవతలు

మా నాయకుల
కులదేవతలు–
గోడలు దూకినట్లు
పార్టీలు దూకడంలో
పిల్లులు!
పురుగుల్ని
భక్షించినట్లు
ప్రజల సొమ్ము
తినెయ్యడంలో
బల్లులు!
నేర్పుగా
జవం నెత్తురు
పీల్చడంలో
నల్లులు!!!
పదవి కోసం
ఏ రంగైనా
మార్చగలగడంలో
ఊసర వెల్లులు!

"సింహం"

## ఉన్నంతవరకే

చమురు ఉన్నంతవరకే
దీపం వెలిగేది!
వెలుగున్నంతవరకే
కాంతి వచ్చేది!
అందమున్నంతవరకే
ఆడదాన్ని చూసేది!
సిరావున్నంతవరకే
కలం రాసేది!
ప్రాణమున్నంతవరకే
మనిషి జీవించేది!
ఈ నిజం తెలుసుకో
నీ దీపం వెలిగించుకో!

-కె. సత్యవల్లి

## ఉద్యోగం

డిగ్రీలు ఎన్ని ఉన్నా
గోల్డ్ మెడల్స్ సాధించినా
కష్టించి పనిచేసే సత్తా నీకున్నా
లంచాలు రాక్షసాకారంతో
స్వైర విహారం చేస్తున్న ఈ యుగంలో
ధనమే ఉద్యోగానికి మొదటి క్వాలిఫి-
కేషన్
అప్పుడే బోర్డుపై వెలిసేది ఉద్యోగపు
నోటిఫికేషన్!

- షేక్ శిలార్




"ఈ యేటి సంబరాలకు ఎన్ని కొదాలు (బలి పశువులు) వచ్చాయి వీరన్నా...?" అడిగాడు గోవిందరెడ్డి

"నిరుటికంటే తక్కువే వచ్చాయి దొరా .!" చెప్పాడు వీరన్న

"ఆ తొలుసూరుపల్లె మల్లేశం నాయుడు యేటపోతు ఈ యేడు రాలేదు దొరా !" చెప్పాడు తవిటయ్య

"అదేమిటి?" మల్లేశం చచ్చిపోయినంత మాత్రాన ఈ యేడు యేటపోతు వేయటం మానేస్తారా ఆ గ్రామ ప్రజలు ? సరే దాని సంగతి తరువాత చూద్దాం మరి ఆ నీలాపురం సంగతి ఏమైంది ?" అడిగాడు గోవిందరెడ్డి

"వాళ్ళు ప్రతి యేడు ఒక మేకపోతు, ఒక గొర్రెపోతూ యేట వేసేవారు ఈ యేడు ఒక్క మేకపోతే తెచ్చారు దొరా !" చెప్పాడు అసిరిగాడు

"వాళ్ళకేంవచ్చిందీ ? ఇలా యేటలు తగ్గిపోతుంటే అమ్మోరికి కోపం రాదా ఏంటి? ఆపైన మన పనేం కావాలి ? వాళ్ళ సంగతి తేల్చాలి" సరే పదండి అవతల యేట ముహూర్తం మించి పోతోంది." విసుగ్గా గోవిందరెడ్డి తన అనుచరులతో అమ్మవారిగడి వైపు చరచరా నడక సాగించాడు

ప్రతి యేడు నర్సిపురం అమ్మవారి సంబరాలు విజయ దశమికి ఘనంగా చేస్తారు ఆ వూరి వారే కాకుండా పరిసర గ్రామాల వారు కూడా నర్సిపురం దుర్గమ్మ సంబరాల్లో పాల్గొని యేటపోతులు బలి ఇస్తారు.

అది ఆంధ్రప్రదేశ్‌లోని కోస్తా చివరిలో ఉండే మారు మూల కొండ ప్రాంతం, నాగరికత, సంస్కృతి పూర్తిగా అబ్బని ఆ పల్లె ప్రాంత ప్రజలకు గోవిందరెడ్డి పెనకాపు

ఆయన మాట నర్సిపురం గ్రామస్థులకే కాక పరిసర గ్రామ ప్రజలకు వేదవాక్కు

నర్సిపురం దుర్గమ్మవారి ఉత్సవాలు ప్రతి యేడు గోవిందరెడ్డి ఆధ్వర్యంలో జరుగుతుంది

స్తోమతుబట్టి ఇంటింటికి బియ్యం, డబ్బు, కట్టెలు, చందాలు వసూలు చేస్తారు దాంతో అమ్మవారి సంబరాలు ఘనంగా జరిపిస్తారు సంబరాలకు వచ్చేవారందరకు ఉచిత భోజనం పెడతారు ఇదంతా గోవిందరెడ్డి ఘనతే అని ప్రజలు వేనోళ్ళ చెప్పుకుంటారు

అమ్మవారికి మేకలు, గొర్రెలు, కోళ్ళు, పావురాళ్ళు, మారుపు చేపలు బలి ఇస్తారు అలా బలిఇచ్చే ప్రతి ప్రాణికి నూటపదార్లు అర్థ నూట పదార్లు గోవిందరెడ్డికి బలి సుంకంగా సమర్పించుకుంటారు ఈ రివాజు ఆనవాయితీగా జరుగుతూ ఉండటంతో ఎందుకు ఈ బలి సుంకం కట్టాలి ? అనేది అడిగే ప్రసక్తి లేదు

బలిఇచ్చిన ప్రాణుల మాంసం కూడా తమ శక్తికొలది గోవిందరెడ్డికి వాటా వెళ్ళాల్సిందే అలా జరుగని యేట యేటే కాదు సరికదా గోవిందరెడ్డి ఆగ్రహానికి గురియై కష్టాల పాలౌతూ ఉంటారు

మకుటంలేని మహారాజులా ఛలామణి అయ్యే గోవిందరెడ్డి ప్రజలకు చేసే ఉపకారం ఏమిటో. ? ఎవరికీ అర్థంకాదు అలా తెలుసుకునే హక్కు ఎవరికీ లేదు

ఐదు రోజులుగా జరుగుతున్న నర్సిపురం దుర్గమ్మ సంబరాలు ఆ దినం ఆఖరి రోజు ఆ దినం అమ్మవారికి పశువులు బలిఇచ్చి తృప్తి పఱచే దినం

ఆ దినం కనీసం పది బస్తాల బియ్యం ఉడికింది అరిసెలు, పొంగడాలు, గారెలు అన్నం రాశిగా పోసి దానిపై ఈ పిండి వంటలన్నీ తాల్చారు దానిపై త్రిశూలం గుచ్చి శూలానికి ఒక నిమ్మపండు గుచ్చారు దాసుదు మంత్రాలు చదువుతుండగా ఆ కుంభరాశిని అమ్మవారి అవతారంగా తలచి తన్మయత్వంతో మొక్కుబడులు తీర్చటం మొదలు పెట్టారు ప్రజలు

కుంభం దగ్గర చేరిన గోవిందరెడ్డి అక్కడే వరుసగా కట్టిన బలి పశువులను చూసి తృప్తిగా మీసం మెలేశాడు

బజాలు మిరుమిట్లు గొలుపగా మొదటగా పెద్దినాయుడు తన వంకం పోతు పొట్టేలును బలి పశువుగా అమ్మవారి కుంభం దగ్గరకు తెచ్చాడు

పెద్దినాయుడు పెద్దరికపు హోదాతో గోవిందరెడ్డికి పొందూరు పంచెల చాపుతో నూట పదారు రూపాయిలు ఇచ్చి నమస్కరించాడు

తృప్తిగా తల పంకించి పెద్దినాయుడు ఇచ్చిన కానుక గ్రహించి "బలి ప్రారంభించండి!" అన్నాడు గోవిందరెడ్డి

చాకలి సోములు తళతళ మెరిసే పదునైన కత్తితో జంతువులను బలిచేస్తున్నాడు

పశుమేధం ప్రారంభం అయినప్పటి నుండి గోవిందరెడ్డి పొడుగాటి జేబులు నిండుతున్నాయి

నర్సిరెడ్డి మేకపోతును బలికి సిద్ధం చేసాడు

"కొదం చిన్నది తెచ్చావేం నర్సి. ?" అడిగాడు గోవిందరెడ్డి

"డబ్బు ఉన్నంతలో ఈ కొదం తెచ్చాను దొరా !" వినయంగా చెప్పాడు నర్సిరెడ్డి

సోములు వేసే ఒకే వేటుకు తెగిపడుతున్నాయి బలి పశువుల తలలు రక్తం అమ్మవారి కుంభంపై చిమ్మబడుతోంది అమ్మవారు తృప్తి పడుతున్నట్లు గోవిందరెడ్డి తృప్తిగా మీసం మెలేస్తున్నాడు

భక్తి ప్రపత్తులలో అమ్మవారి రాశి ముందు సాగిలపడి మొక్కులు తీరుస్తు

కొండవలస శ్రీనివాసరావు

న్నారు ప్రజలు

చిత్ర విచిత్ర వేషాలతో డప్పు వాద్యాలకు లయబద్ధంగా రెచ్చిపోయి ఆడుతున్నారు కొందరు.

రాత్రి తొమ్మిది గంటలు అయింది అంజలాపురం రాజయ్య తన మేకపోతును బలికి సిద్ధం చేసాడు రాజయ్య కొడుకు మల్లయ్య మేకపోతుపై పసుపునీళ్ళు జల్లి కుంకం బొట్టు పెట్టాడు

రాజయ్య చేతులు దులుపుకుంటూ వినయంగా గోవిందరెడ్డి దగ్గరకు వెళ్ళాడు

“రా, రాజయ్యా ” సాదరంగా అన్నాడు గోవిందరెడ్డి .

“చిత్తం దొరా. ! మేకపోతు కొనగా మిగిలింది ఈ డబ్బు కాస్త కొరదాగా ఉంది తమరు కనికరిస్తే అమ్మవారి మొక్కు తీర్చుకుంటాను.” రాజయ్య డబ్బు గోవిందరెడ్డి చేతిలో పెట్టాడు.

గోవిందరెడ్డి డబ్బు లెక్కచూడగా ఏడు పది రూపాయలు ఉన్నాయి.

“ఇదేమిటి రాజయ్యా డబ్బులు తక్కువ చేశావ్. పూర్తిగా ఇచ్చుకో ”

“మూడు పదులు చాలదు దొరా రెండు రోజుల్లో ఆ కొరత డబ్బు ఇచ్చుకుంటాను. నా మొక్కుబడి చెల్లించుకోనీ దొరా .” వినయంగా అడిగాడు రాజయ్య గోవిందరెడ్డి భృకుటి కోపంతో ముడిపడింది

“అలా వీల్లేదు రాజయ్యా. బలిసుంకం పూర్తిగా చెల్లించాల్సిందే అమ్మవారు తృప్తి పడాలంటే ముందు బలిసుంకం పూర్తిగా చెల్లించు .” అన్నాడు గోవిందరెడ్డి

మీ కాలొట్టుకుంటాను నా మాట నమ్మండి రేపీపాటికి మీ డబ్బు పువ్వుల్లో పెట్టి ఇచ్చుకుంటాను బలికి ఆటంకపర్చకండి గోవిందరెడ్డి పాదాలపై చేతులాన్చాడు రాజయ్య

“పువ్వులు నాకెందుకు రాజయ్యా పువ్వులు అమ్మవారి చెవిన పెట్టి డబ్బులు నాకు ఇచ్చుకో.. లేకపోతే నీ కొదంతోలుకపో. ” అన్నాడు గోవిందరెడ్డి.

“అంత మాట అనకండి దొరా బలికి తెచ్చిన కొదం వెనక్కు తిరిగి తీసుకపోతే అశుభం నన్ను కనికరించుదొరా కళ్ళవీళ్ళ పర్యంత మయ్యాడు రాజయ్య ”

“వీల్లేదంటే నీక్కాదూ అవతల మిగి[illegible]వ శారి యేట్లకు ఆలస్య మౌతోంది లే



లే ” అంటూ చేతులు అన్చిన రాజయ్యను కాలితో ఒక్క తోపు తోసాడు గోవిందరెడ్డి

బక్కపలుసగావున్న రాజయ్య బోర్లాపడ్డాడు

“అయ్యో..” అంటూ మల్లయ్య తండ్రిని లేవనెత్తాడు.

రాజయ్య పొట్టమీద చేతులు పైని గీరుకొని రక్తం వస్తోంది

తలపాగా గుడ్డతీసి తండ్రి గాయాన్ని నెమ్మదిగా వత్తుతున్నాడు మల్లయ్య.

ఇంతలో పవరు కట్టయింది విద్యుద్దీపకాంతులతో పట్టపగలుగా వెలుగొందిన ఆ ప్రదేశం క్షణంలో చిమ్మ చీకట్లు కమ్మింది

కళ్ళు బైర్లు కమ్మినట్టయి ప్రజలకు ఏదీ కన్పించలేదు

“అమ్మా. !” భూమి దద్దరిల్లేటట్టు ఓ గావుకేక వినిపించింది

ఆ కేక భయం గొలుపగా ప్రజలంతా ఏమైందో అనే భయంతో చెల్లా చెదురై ఎవరికి వారే పరుగెత్తసాగారు.

అమ్మా ! అనే ఆర్తనాదంతో పాటు చిక్కని వేడి రక్తం అక్కడి వారందరిపై చిమ్మింది

“ఏమైందీ ?”

“ఎవరు బలిపశువు వేశారీ చీకట్లో ?”

ఇంకెవరు ఆ రాజిగాడే బలి పశువేసుంటాడు ఆ చీకట్లో ఎవరికి తోచి నట్లు వారు అనుకుంటున్నారు

కళ్ళు జిగేలుమనేలా మెరుపువంటి విద్యుద్దీపాలు వెలిగాయి

“అయ్యో దొరా...!”

“దొర బలి అయిపోనారు....”

గగ్గోలు మొదలైంది.

త్రొక్కిసలాట మొదలైంది.

పిల్లలు పెద్దలు ఒకరి కొకరు త్రోసుకుంటూ గగ్గోలు పెడుతూ పరుగెడుతున్నారు.

గోవిందరెడ్డి తలతెగి మొండానికి దూరంగా అమ్మవారి కుంభానికి దగ్గరగా పడి ఉంది క్షణంలో జరిగిన ఈ దారుణానికి ప్రజలు ఆశ్చర్యంతో, మరి భయంతో దొర బలై పోనారు అంటూ గగ్గోలు పెడుతున్నారు

“ఎలా జరిగిందో బలి...?”

“ఎవరు చేశారీ పని....?”

దొరని ఎవరు చంపారు ?

ప్రతి ఒక్కరూ ఇవే ప్రశ్నలతో దిక్కులు చూడసాగేరు

అంత మందిలోనూ, ఆశ్చర్యం భయం, ఏమీ లేకుండా తృప్తిగా నిట్టూర్పు వదిలాడు చాకలి సోములు. కొన్నేండ్ల క్రితం ఇదే అమ్మవారి సంబరాల్లో బలి సుంకం ఇచ్చుకోలేని సోములు తండ్రిని ఇదే గోవిందరెడ్డి బలి చేశాడు

సోములు తండ్రినే కాదు తన నెదిరించిన వారి నెందరినో బలిగొన్నాడు గోవిందరెడ్డి తన తండ్రిని బలిగొన్న గోవిందరెడ్డిపై ఆనాటి నుండి పగగొన్నాడు సోములు. ఈ పశు మేధంతో పాటు సాగుతున్న నరమేధాన్ని ఆపాలి అనుకున్నాడు సోములు.

గోవిందరెడ్డితో మంచిగా నటిస్తూ అమ్మవారి సంబరాల్లో పశువులను నరికే కిరాతక వృత్తి చేపట్టాడు సోములు

ఇంత వరకూ కొన్ని వందల పశువులను బలిఇచ్చాడు గానీ అనుకున్న బలి జరుగనందుకు సోములుకు తృప్తి లభించలేదు అదను కోసం ఎదురు చూస్తున్న సోములు ఇప్పుడీ అదను మంచి అవకాశంగా తీసుకున్నాడు

తనేమైనా ఫరవాలేదు కానీ అన్యాయంగా నరమేధం సాగిస్తున్న గోవిందరెడ్డిని చంపాలన్నదే ధ్యేయం గల సోములు గోవిందరెడ్డిని అమ్మవారికి బలి పశువును చేసాడు ●

# కలగా పులగం



## అస్రానీ తిప్పలు

ప్రముఖహిందీ హాస్యనటుడు అస్రానీ దుఃఖసాగరంలో మునిగి యున్నాడట. కారణం అతని భార్య మంజు అతన్ని వదిలేసింది. ఇద్దరి మధ్య సంవత్సరం నుండి పచ్చగడ్డి వేస్తే భగ్గు మంటున్నదట.

ఇంటి బయట దిక్కు ముఖం వేసుకొని కూర్చుంటున్న అస్రానీని పెళ్ళామేబయటకు గెంటిందేమోనని అనుమానం వ్యక్తం చేస్తున్నారు.

'మంజు'కి పడని మరెవరితోనైనా హాస్యాలాడపోయాడేమో! అందుకే చాపా, చెంబూ బయటపడేసుంటుంది. పాపం చివరికి ఏమవుతుందో అస్రానీ పరిస్థితి!

## డబ్బుకు శత్రు దాసోహం

శత్రుఘ్నసిన్హాకు టైము ముఖ్యం కాదట డబ్బే ప్రదానమట చంద్రబరోత్ శత్రుఘ్నసిన్హాతో చిత్రం తీయాలని సంకల్పించి 3 లక్షలు అడ్వాన్సు యిచ్చాడట

సినిమా షూటింగ్ ఆరంభిద్దాం రమ్మంటే మిగిలిన బ్యాలెన్సు రెండు లక్షలు యిస్తేగాని రానుపొమ్మన్నాడట దాంతో సినిమా ముహూర్తం వాయిదా పడిందట చంద్ర దగ్గర డబ్బులు కూడా లేవట జాకీ్ష్రాఫ్‌కు, సంగీతకు నీలమ్‌కు కూడా డబ్బు చెల్లించాలట చంద్ర మరి వాళ్ళకెప్పుడు డబ్బు చెల్లిస్తాడో ముహూర్తం ఎప్పుడు మొదలవుతుందో!

## ఆనంద్ పెళ్లి!

'రామ్‌లఖన్'లో విలన్‌గా వేసిన ఆనంద్ బాల్‌రాజ్ పెళ్లయిందట 'ఒక' ఎయిర్ హోస్టెస్‌తో. చాలా హడ్రీబుడ్రీగా ఈ పెళ్లి తంతు జరిగిపోయిందట...ఎవ్వరికీ తెలియకుండా.

ఈ పెళ్లికి సుభాష్‌ఘయ్, అనిల్ కపూర్, జాకీష్రాఫ్‌లు మాత్రమే హాజరయ్యారట... సాక్షులుగా.

తన ఇమేజ్‌కు (అసలు వుంటే కదా తగినట్లు పెళ్లి జరుగలేదని వాపోతున్నాడట ఆనంద్. మరి యింత హడావుడిగా, రహస్యంగా ఎందుకు చేసుకున్నాడనేది ఎవ్వరి అంతుబట్టని విషయమైపోయింది పరిశ్రమలో!

సీరియల్

# ద్రౌపది

ప్రయాగ రామకృష్ణ



(గత సంచిక తరువాయి)

**ఇంతవరకూ సాగిన కథ- 14:** పాంచాల దేశాధీశుడు ద్రుపదుడు వ్యాస మహర్షి ఆదేశంపై పాండవు లయిదుగురికి ద్రౌపదినిచ్చి వివాహం జరిపిస్తాడు. పట్టాభిషేకానంతరం ధర్మరాజు- ద్రౌపదిని, మిగిలిన సోదరులను తీసుకొని ఖాండవప్రస్థం చేరతాడు. నారదుడి సలహాపై రాజసూయయాగం నిర్విఘ్నంగా జరిపి కృష్ణుడికి అర్ఘ్యమిస్తాడు. మయసభలో తనకు జరిగిన అవమానానికి ప్రతీకారంగా పాండవుల సంపదను హరించే నెపంతో ధర్మరాజును జూదానికి ఆహ్వానించి ధనకనక వస్తువులతో సహా పాండవులను, ద్రౌపదిని గెలుచుకుంటాడు దుర్యోధనుడు. తమ దాసి అయిన ద్రౌపదిని నిండుకొలువుకు ఈడ్చుకురమ్మని దుశ్శాసనుడ్ని దుర్యోధనుడు పంపుతాడు.

కురు వృద్ధులారా! మీ ఇంటి కోడలికి ఏ గతి పట్టిందో చూశారుగా! కాపాడవల్సిన రాజులే అరాజకత్వాన్ని సృష్టిస్తే ఈ ప్రజలకు దిక్కెవరు? అధికారదర్పం, అహంకారం, మదం, మత్సరం ఆవేశించిన ఈ దుర్యోధనుడు నన్ను సభా మధ్యానికి యీడ్చుకు రమ్మని తమ్ముణ్ణి ఆదేశిస్తే అతను యింత పిసరు సంకోచం సిగ్గులేకుండా నా శిరోజాలను ఒడిసి పట్టుకున్నాడు .... అంటూ దుశ్శాసనుడి వేపు తీవ్రంగా చూసింది.

అతను వికటాట్టహాసం చేశాడు.

.... .సర్వ ధర్మసంవిదులని ప్రసిద్ధికెక్కిన భరత వీరుల వంశంలో ఇలాంటి రాక్షసులు పుట్టారా?

అధర్మం, అసత్యం, స్త్రీలోలత, అత్యాచారాలు, అక్రమాలతో కురువంశం ఇంత నింద్యమై పోయిందా?

పంచదార కన్నా పరదార తీయగా తోచే ప్రబుద్ధులున్న ఇంటికా నేను కోడలిని అయింది.....

అని ద్రౌపది కోపంతో అరిచింది.

ఆమె ఆక్రోశానికి ఆ సభా భవనంలోంచి ప్రతిధ్వని తప్ప మరేమీ రాలేదు.

చేతులు జోడించి ద్రౌపది మళ్ళీ అడిగింది. 'మహా మహులారా! ఈ జూదంలో నేను ధర్మ బద్ధంగా ఓడిపోయానా లేక మోసాలతో, కుట్రలతో జరిగిందా ఈ పందెం. చెప్పండి'

ఎవరూ మాట్లడలేదు

ద్రౌపది భీష్ముడి వంక చూసి 'వయసులో నేగాక అన్ని విధాలా పెద్దవారు మీరు. మీకున్న లోకానుభవం కురువంశానికి మీరు చేసిన సేవలు, మీరు కల్పించిన రక్షణ మీకు పెద్ద పీట వేశాయి. మీరు చెప్పండి, నేను ధృతరాష్ట్ర సంతతికి బానిస నేనా?'అని దీనంగా అడిగింది.

భీష్ముడు ముందు ధర్మ నిర్ణయం చెయ్యడానికి నిరాకరించాడు తరువాత ద్రౌపదిని అనునయిస్తూ 'తల్లీ! తనే ఓడిపోయాక మరే సొమ్మునూ పణంగా పెట్టే అధికారం జూదరికి వుండదు కాని భార్య ఎప్పుడూ భర్త అధీనంలో వుండేదే! వాడు ఇతరులకు ఊడిగం చేస్తున్నా, వాడు స్వతంత్రుడయినా కాకపోయినా భార్యమీద అధికారం వాడికి ఎప్పుడూ వుంటుంది అందుకని ఈ విషయంలో నేనేమీ చెప్పలేకపోతున్నాను శకుని జూదంలో నేర్పరని ధర్మరాజుకు తెలుసు తెలిసి కూడా ఆడాడు. ఓడిపోతూ కూడా ఆడాడు తను ఓడి కూడా నిన్ను పణంగా పెట్టాడు' అన్నాడు.

ద్రౌపది కళ్లు కోపంగా చూశాయి. ఎర్రగా మండుతున్నాయి

'తప్పంతా యుధిష్ఠిరుడుదే అన్నట్టు చెబుతున్నారు '

పాండవులు ఇంద్రప్రస్థంలో సుఖంగా వున్నారని కళ్ళు కుట్టే కదూ - జూదమాడేందుకు రమ్మని వాళ్ళకు కబురంపింది? జూదం వల్ల అన్నదమ్ముల మధ్య తగాదా వస్తుందని విదురుడు చెబితే విన్నారు కాదు పాండవ పక్షపాతుడని దుమ్మెత్తి పోశారు అయినా తెలీక అడుగుతాను ప్రొద్దుపోవాలంటే ఎన్ని క్రీడలు లేవు కనుక! జూదమే ఎందుకు ఆడాలి? వంచనా, జూదం క్షత్రియులకు తగవని పాండవ జ్యేష్ఠుడూ చెప్పాడు. వినలేదు. తెలివిగా ఆయనలో పౌరుషాన్ని రెచ్చగొట్టారు. ఆటకు సిద్ధపడేటట్టు చేశారు. ధృతరాష్ట్ర మహారాజు ఆహ్వానం మన్నించి తీరాలని వచ్చినందుకు పాండు కుమారులకు మంచి గుణపాఠమే చెప్పారు.

"అయినా,శకునితో ఆటన్నప్పుడు ఇదేద మోసమని మీరు గ్రహించలేదా?"

ధర్మరాజు గెలుస్తాడనే మీరు అనుకున్నారా?

కురు పాండవ వంశాలు రెండింటికీ పెద్దలే మీరు ఈ ఆటను ఆదిలోనే

ఎందుకు ఆపెయ్యలేదు?

ఈ అన్యాయాన్ని ఇంతసేపూ ఎందుకు కొనసాగనిచ్చారు! అని భీష్మణ్ణి సూటిగా అడిగింది.

గద్గద గంభీర స్వరంతో వేసే ద్రౌపది ప్రశ్నలతో కాసేపు కాలం ఆగిపోయినట్లయింది.

భీష్ముడికి నోట మాటరాలేదు....తల తిరిగిపోయింది.





ఇంతలో దుశ్శాసనుడు లేచి 'ఏమిటి ఇష్టం మొచ్చినట్లల్లా మాట్లాడుతున్నావు? ముమ్మాటికీ నువ్వు మా దాసీవే. ప్రభువు ఆజ్ఞమన్నించడమే సేవకుల ధర్మం. ఇప్పుడు నీ యజమాని, గురువు దైవం అన్నీ దుర్యోధన చక్రవర్తి. ఆయన చెప్పినట్లు నడుచుకో' అన్నాడు.

ద్రౌపది అతని వంక చాలా అసహ్యంగా పురుగును చూసినట్టు చూసింది.

ఒక్కమాట కూడా మాట్లాడలేదు.

ఆమె కళ్ళు చిమ్మిన సెగపొగలకి దుశ్శాసనుడు కుత కుతలాడి పోయాడు.

భీముడు ధర్మరాజు ముఖంలోకి చూస్తూ 'అన్నయ్యా! ద్యూతవ్యసనమదోన్మత్తుడవై ఎంతపని చేశావు?

ధన కనక వస్తు వాహనాలకూ రాజ్యానికీ మాకూ నువ్వు అధిపతివి కనుక మమ్మల్ని పందెంగా పెట్టినా మేము ఏమీ అనుకోలేదు. కాని ద్రుపద పుత్రికను కూడా పందెం పెట్టడానికి నీకు చేతులెలా వచ్చాయి! మనసెలా అంగీకరించింది? చూడు! కష్టాల గాలి సోకకుండా పెరిగిన పాంచాల రాకుమారి నీ పుణ్యమా అని ఎలా ఏడుస్తోందో! వినబడుతోందా! ఆమె దుఃఖావేశం! లేక నీ చెవులకు గ్రహణ శక్తి కూడా నసించిందా? శకుని ఎలాంటివాడో తెలిసి కూడా పారవశ్యంతో జూదమాడావు! ఇంత అధర్మానికి పాల్పడిన నీ చేతులను దహించాల్సిందే' నన్నాడు.

ధర్మరాజు వంచిన తల ఎత్తలేదు.

> **బహుమతులు గెలుచుకోండి!**
>
> **ద్రౌపది సీరియల్**
>
> **విడువకుండా చదవండి**
>
> **బహుమతుల పథకం ఉన్నది!**
>
> —ఎడిటర్

'భీమసేనా! చచ్చిన పామును ఇంకా చంపడం ఎందుకు? సహృద్యూతానికీ, ధర్మ యుద్ధానికీ రమ్మని పిలిస్తే రాననడం రాచరికానికి తలవంపు. ఇది క్షాత్ర ధర్మం.

ధర్మరాజు ఆ "ధర్మాన్ని" అనుసరించాడు.

ఇందులో ఆయన చేసిన నేరమేముంది?

విధి వైపరీత్యం. ఒక్కోసారి వెలుగును చీకటి మింగుతుంది. ధర్మం అధర్మం ముందు తలవంచుతుంది

మానవులే దానవులవుతారు. అందు కని-

ధర్మపరుడ్ని మన అగ్రజుని నిందిస్తే ఎలా?' అని అర్జునుడు భీముణ్ణి మందలించాడు.






భీముడు అమాయకుడు-

ఆవేశంలో తన అన్నను అనరాని మాటలన్నందుకు మౌనంగా రోదించాడు

ద్రౌపదికి కూడా ఏడ్చి ఏడ్చి ప్రాణాలు కడబట్టాయి.

ఇక ఏడవడానికి కూడా శక్తిలేదు తను ఓడిపోయింది. తన వాళ్లందరూ ఓడిపోయారు. తన మీద, తన వాళ్ళ మీద తనకే అసహ్యం. జరిగిన అవమానాన్ని మర్చిపోదామన్నా అది జరిగే పనిగా లేదు. లోలోపల అగ్ని.

## వికర్ణుని పలుకులు

ద్రౌపది స్థితికి జాలిపడ్డవాడు వికర్ణుడు ఒక్కడే.

లేచి నిలబడ్డాడు. ఎర్రగా అందరినీ తీక్షణ చూపులతో కలయ చూశాడు

'సభా సదులారా! జరుగుతున్న అన్యాయం చూస్తూ కూడా నోరు మెదపని మిమ్మల్ని చూస్తే అసహ్యం కలుగుతోంది ద్రౌపది అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పకుండా ధర్మ సూక్ష్మాలు గురించి ఉపన్యాసాలు ఎందుకు చెబుతున్నారో తెలియడం లేదు.

భీష్ముడూ, ధృతరాష్ట్రుడూ, విదురుడూ, ద్రోణు డూ, కృపుడూ కూడా న్యాయం చెప్పడం మాని ఈ అధర్మ చక్రవర్తికి జేజేలు పలకడం కన్నా సిగ్గుమాలిన పని మరొకటుందా? . . .' అన్నాడు.

ఆ మాటలకు ఎవరూ నోరెత్తలేదు.

వికర్ణుడే అన్నాడు-'ధర్మనిర్ణయం నేను చేస్తున్నాను'

జూదమూ, వేటా, మద్యపానం, తిండిపోతుతనం, సోమరితనం, కామభోగాసక్తి కూడని పనులు.

ఈ వ్యసనాలకు దాసుడైనవాడు ధర్మాధర్మాలు విచారించకుండా ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తుంటాడు.

అటువంటి వాడు చేసే పనులను విజ్ఞులు అంగీకరించకూడదు. ధర్మరాజు, పాండవులకందరికి సమంగా చెందే పాంచాలిని అనాలోచితంగా జూదంలో పణంగా పెట్టాడు.

కనుక ద్రౌపది అధర్మ విజిత. పైగా ఏకవస్త్ర అయిన స్త్రీని ఇలా సభా మధ్యానికి ఈడ్చుకు రావడం చాలా నేరం'

అన్నాడు

సభలో పెద్ద సంచలనం.

వికర్ణుడు వేసిన బాణాలు ఎంతదూరం వెళ్ళి ఎవరెవరికి గుచ్చుకున్నాయో తెలీదు కానీ, కర్ణుడు మాత్రం 'నువ్వనవసరంగా ఎక్కువ మాట్లాడుతున్నావు. ఎవరికీ తెలియని ధర్మం నీకొక్కడికే తెలిసినట్టుంది. చిన్న నోట పెద్దమాటలు మన్నన కలిగించవు ఇంతమంది వృద్ధులిక్కడుండగా నీకీ పెద్దరికం ఎవరిచ్చారు? తమ్ముల సమక్షంలోనే ధర్మరాజు తన సర్వస్వంతో పాటు ద్రౌపదిని కూడా ఓడిపోయాడు. ఆమెను విజితగా పాండవులే అంగీకరించారు మధ్య నీ ప్రమేయమేమిటి? ఏక వస్త్ర అయినదాన్ని సభలోకి తీసుకురావడం అధర్మమన్నావు. నాకు తెలియక అడుగుతాను, లోక ధర్మమేమిటి? ఒక స్త్రీకి ఒకడే భర్త దీనికి అయిదుగురు భర్తలున్నారు. కులటకీ దీనికీ భేదం లేదు. ఇలాంటి స్వైరిణిని విగత వస్త్రను చేసి తీసుకు వచ్చినా తప్పులేదు నువ్వు చిన్నవాడివి అలాగే వుండు. లేనిపోని పెద్దరికం తెచ్చుకోకు' అన్నాడు కోపంగా.

'భేష్! బాగా చెప్పావు' అని దుర్యోధనుడు కర్ణుడి భుజం తట్టి 'దుశ్శాసనా! ఈ పాండవులనూ, ఈ బంధకినీ వివస్త్రలను చెయ్యి' అని ఎకసక్కెంగా నవ్వుతూ అన్నాడు.

పాండవులు తమపై వస్త్రాలను తీసి నేలమీదకు విసిరేశారు.

దుశ్శాసనుడు ద్రౌపదిని సమీపించి ఆమె చేలాంచలాన్ని అందుకున్నాడు.

పాండవపత్ని సిగ్గుతో చితికి పోయింది.

తనను రక్షించే నాధుడే కనిపించలేదు ఆమెకు

## ద్రౌపదీ వస్త్రాపహరణం

ఎటు చూసినా చీకటి! కారు చీకటి! బయట చీకటి! మనసులో చీకటి!

ఈ చీకటి దోవన తనకు రక్షకుడెవరు?

ద్రౌపది ఏడుస్తోంది.

అంతలో ఎటునించో సన్నగా మురళీనాదం వినిపించింది.

అప్రయత్నంగా మోకాళ్ళ మీద కిందకు వాలి, చేతులు జోడించి-

'కృష్ణా! జగత్రయ విజయ భుజ వీర్య సనాథులైన నాధులుండి కూడా అనాథనయ్యాను.

ఇక ఈ దిక్కులేని దాన్ని నువ్వే కాపాడాలి. కంసుణ్ణి సంహరించిన వాడివి, చిటికెన వేలిపై గోవర్ధనగిరిని నిలిపినవాడివి, జగదోద్ధారకుడివి నన్ను రక్షించలేవా?' అని వేడుకుంది.

కృష్ణుడు విన్నాడది

ద్రౌపదిని ఆశీర్వదించడానికి ఆయన దక్షిణహస్తమెత్తేసరికి ఆమె గుండెల్లో సూర్యోదయ మయింది

ఆయన అభయహస్తం చాపాడు.

ఆమె ధన్యురాలయింది

దుశ్శాసనుడు విప్పుతున్న కొద్దీ ఆమె



ఒంటిని కొత్తవలువలు చుట్టుకుంటున్నాయి

సభలోని వారంతా జరుగుతున్న వరమాద్భుతం కలో నిజమో కానలేక దిగ్భ్రాంతులై చూస్తున్నారు

దుశ్శాసనుడు విప్పిన వలువలు గుట్టలుగా పెరిగి పెరిగి వస్త్ర పర్వతాలయ్యాయి.

ద్రౌపదీ వస్త్రాపహరణం చెయ్యలేక దుశ్శాసనుడు చతికిలబడ్డాడు.

సంభ్రమంతో ఆశ్చర్యంతో చూస్తూ బొమ్మల్లా నిలబడిపోయిన పాండుకుమారులను గోపాల దేవుడు చిరునవ్వుతో మేలుకొలిపాడు.

సర్వం కృష్ణమయం!

కృష్ణమయం జగత్ సర్వం!

మాయలు చేసే వాడికి, మహిమలు చేసేవాడికి, కర్మ ధర్మ చక్రవర్తికి వాళ్ళు మనసుల్లోనే నమస్కరించారు అంతా

ద్రౌపది మానసంరక్షణ జరిగినందుకు సంతోషపడినా భీముడు దుశ్శాసనుడు చేసిన దుస్సాహసానికి మండిపడ్డాడు. కోపంతో అతని నేత్రాలు నెత్తురు ముద్దలయ్యాయి.

'దుర్మార్గుడా! పాంచాల పుత్రికకు వస్త్రాపహరణం చెయ్యడానికి పూనుకున్నావు, కురువృద్ధులూ, గురుబాంధవులూ అందరూ చూస్తుండగా నిన్ను యుద్ధంలో ఓడించి నీ గుండెల్ని చీల్చి, నీ రక్తాన్ని తాగకపోతే నేను భీముడ్నే కాదు. ఇదే నా ప్రతిజ్ఞ' అన్నాడు

అది విని అందరూ నిశ్చేష్టులయ్యారు.

కొంతసేపటికి సభలో కలకలం బయలుదేరింది.

కొందరు ధృతరాష్ట్రుడ్నీ, అతని కొడుకులనూ వేరు వేరుగా నిందించారు.

కొందరు, ద్రుపదరాజ పుత్రి ప్రశ్నలకు సమాధానం చెప్పని వృద్ధుల బుద్ధిలేనితనాన్ని దుయ్యబట్టారు.

చేసేదిలేక ధృతరాష్ట్ర కుమారులు ఒకరి మొహాలు ఒకరు చూసుకుంటూ వుండిపోయారు.

విదురుడు లేచి నిలబడ్డాడు. సభంతా




కలయ చూశాడు

'పెద్దలారా! ఇప్పటికైనా మించిపోయింది లేదు. ద్రౌపది ప్రశ్నలకు సమాధానం చెప్పండి ఏది ధర్మమో ఏది అధర్మమో తెలిసి కూడా లాభ, లోభ, పక్షపాత బుద్ధులతో వ్యవహరించేవారు పాపాన్ని మూటగట్టుకుంటారు నామాట వినండి. వికర్ణుడు చిన్న వాడయినా బృహస్పతిలా ధర్మనిర్ణయం చేశాడు. అతని నిర్ణయాన్ని మీరెందుకు అంగీకరించలేకపోతున్నారు?' అని అడిగాడు.

దుర్యోధనుడి మీది భయంతో ఎవరూ నోరెత్తలేదు

నీళ్ళు నిండిన కళ్ళు పైకెత్తి ద్రౌపది దీనంగా అందరి వైపూ చూసింది.

'మీ ఎవరికీ నా మీద జాలి కలగకపోవడం నా దురదృష్టం. కురువంశాన్ని మెట్టిన కోడలినై, శ్రీకృష్ణుని చెల్లెలినై, పాంచాల నృపతి కూతురునయి కూడా ఈనాడు ఈ సభా మధ్యంలో ఈ నీచుడి చేత పరాభవింపబడాలని నా మొహాన రాసి వుంది

మీరు మాత్రం ఏం చేస్తారు?

కాని నేను దాసినో, కానో విచారించి పెద్దలంతా నిర్ణయించండని మాత్రమే నేను కోరుకుంటున్నాను' అని ద్రుపద కన్య చేతులు జోడించి వేడుకుంది.

**భీష్ముడికి దయకలిగింది 'తల్లీ! నీ ప్రశ్నకు ధర్మరాజు తప్ప మరెవరూ సమాధానం చెప్పలేరు. ధర్మసూక్ష్మం మాకంటే అతనికే బాగా తెలుసు. కాని, నిన్నింత క్షోభ పెట్టిన వాళ్ళు ఇంతకు ఇంతా అనుభవిస్తారు. నా మాట వృధా పోదు' అని ద్రౌపదిని ఓదార్చాడు.**

కర్ణుడు పెద్దగా నవ్వాడు 'సుందరీ! పనికి రాని వాళ్ళు అయిదుగురు భర్తలుండటం కంటే సమర్థుడైన ఒక భర్త వుండడం మంచిది. ఈసారైనా జూదంలో అలిని ఓడిపోకుండా వుండగల వాణ్ణి చూసి భర్తగా వరించు' అని ద్రౌపదిని వేళాకోళం చేశాడు.

ఆ మాటలకు దుర్యోధనుడు వికటాట్టహాసం చేశాడు.

తెరలు తెరలుగా వస్తున్న నవ్వును అవుకుంటూ ఒక చేతితో తొడ చూపిస్తూ రెండో చేతితో ఆమెను వచ్చి తన తొడ మీద కూర్చోమని ద్రౌపదికి సైగ చేశాడు దుర్యోధనుడు.

అది చూశాడు భీముడు నల్ల త్రాచులా బుసలుకొట్టాడు.

'రాజ్యమదంతో కళ్ళు మూసుకుపోయి ఒడిలో కూర్చుందువుగాని రమ్మని ద్రౌవదినే పిలిచావు! యుద్ధంలో నా గదాఘాతంతో నీ తొడలు విరగకొట్టకపోతే చూడు' అని భీముడు గద అందుకోబోయాడు.

'కోపానికి సమయం కాదిది. నిగ్రహించుకో....' అని విదురుడు అతనిని శాంతింప చేశాడు.

సరిగ్గా అదే సమయంలో ధృతరాష్ట్రుని అగ్నిహోత్ర గృహంలో ఎడ తెరిపి లేకుండా నక్కలు అరవడం ప్రారంభించాయి. అగ్ని జ్వాలలు తేజో విహీనలయ్యాయి.

ధృతరాష్ట్రుని కొడుకుల శయన మందిరాలలో కాకులూ, గుడ్ల గూబలూ చేరాయి.

గాంధారి కోడళ్ళ తలలో వున్న పూలు అప్రయత్నంగా జలజల నేల రాలాయి. నల్ల పూసలు తెగి కిందపడ్డాయి. ఆ దుశ్శకునాలు చూసి గాంధారి కోడళ్ళంతా పెద్దగా ఏడవడం మొదలు పెట్టారు.

వాళ్ళ శోకాలు విని గాంధారి భయపడింది.

వెంటనే విదురుణ్ణి పిలిపించి అతనిని తోడు తీసుకుని ధృతరాష్ట్రుడి దగ్గరకు వెళ్ళింది.

'పాండవులని నువ్వూ, నీ బిడ్డలూ కలిసి పరాభవించారేమో దానికి తగిన ప్రతిఫలం అనుభవిద్దురుగాని .' అంది గాంధారి కోపంగా

ధృతరాష్ట్రుడు అప్పటికప్పుడు దుర్యోధనుడ్ని పిలిపించాడు.

'ఓరి బుద్ధిహీనుడా! నీ వల్ల కులమంతా నాశనమయింది. పాండవపత్నిని, ఈ ఇంటి పెద్ద కోడల్ని పరాభవం చేస్తావా? నీ కంటే నీచుడు లేడు

నీ వల్ల పాండవులు అంతులేని సంతాపాన్ని అనుభవించారని మీ అమ్మ చెప్పింది.

ఫలితమేమవుతుందే చూసుకో ఫో!' నా ఎదుటి నుంచి వెళ్ళిఫో' అని ధృతరాష్ట్రుడు పట్టరాని కోపంతో అరిచాడు.

దుర్యోధనుడు మౌనంగా నిష్క్రమించాడు.

విదురుడు అతన్ని చూస్తూ 'దేవుడా! రక్షించు పాండు పుత్రుల్ని.....ఈ భ్రష్టుల్నించి. ...ధృతరాష్ట్ర సంతతి నుంచి...... అధికార మదోన్మత్తుల్నుంచి.....' అనుకు

న్నాడు.

*** *** *** *** *** ***

సకల బాంధవహితం కోరి గాంధారి మాట మీద ధృతరాష్ట్రుడు ద్రౌపదీ దేవిని పిలిపించాడు.

ఆమె వచ్చి అత్త మామలకు నమస్కరించి కన్నీరు తుడుచుకుంటూ వినయంగా నిలబడింది

'అమ్మా! నువ్వు మా ఇంటి దీపానివి. మా నట్టింటి వెలుగువి. నీకు జరిగిన అన్యాయానికి నిజంగా విచారిసున్నాను. మమ్మల్ని చూసైనా నా కొడుకుల్ని మన్నించు. నీ మనసుకి సంతోషం కలిగించే కోరికలేవైనా కోరుకో' అన్నాడు ధృతరాష్ట్ర మహారాజు.

'మహారాజా! నన్ను అనుగ్రహించ దలుచుకుంటే లోక పూజ్యుడైన ధర్మ తనయుడికి దాస్య విముక్తి కల్పించండి లేకపోతే నా బిడ్డలు శాశ్వతంగా దాసీ పుత్రులవుతారు' అని అర్థించింది ద్రౌపది.

'అలాగే! ఇంకేదైనా వరం కోరుకో' అన్నాడు ధృతరాష్ట్రుడు

'మహారాజా! ధర్మజుని తమ్ములు నలుగురూ ఆయుధాలతోనూ, సైన్యాలతోనూ దాస్య విముక్తులయ్యేలా అనుగ్రహించండి'

'అమ్మా! అలాగే జరిపిస్తాను. ఇంకేం కావాలో చెప్పు?'

'మహారాజా! వైశ్య స్త్రీ ఒక వరం, క్షత్రియ స్త్రీ రెండు వరాలు, శూద్ర స్త్రీ మూడు వరాలు, బ్రాహ్మణ స్త్రీ నూరు వరాలూ కోరుకోవడం ధర్మం. నాకు కావల్సిన రెండు వరాలూ కోరుకున్నాను. ఇంక నాకేమీ అక్కర్లేదు' అంది ద్రౌపది కృతజ్ఞతగా చేతులు జోడిస్తూ.

ధృతరాష్ట్రుడు కోడలి ధర్మగుణాన్ని మెచ్చుకున్నాడు. వెంటనే పాండవులకు కౌరవ చెర విడిపించాడు.

యుధిష్ఠిరుణ్ణి దగ్గరకు పిలిచి 'నాయనా! నువ్వు నీ రాజ్యమూ, సర్వ సంపదలూ తీసుకుని ఎప్పటిలాగే ఇంద్రప్రస్థానికి వెళ్ళి రాజ్యం చేసుకుంటూ సుఖంగా వుండు నా కొడుకులు మూర్ఖులై నిన్ను అవమానించారు నా ముఖం చూసి వాళ్ళను క్షమించు. నేను కూడా తెలివి తక్కువగా జూదాన్ని వారించకుండా ఉపేక్షించాను. నా కొడుకులు చేసిన పాపంలో నాకూ భాగం వుంది. మన్నించు' అన్నాడు.

ధర్మరాజు వంగి ధృతరాష్ట్రుడి పాదాలు తాకాడు.

'అన్నయ్యా! పాండవులకు రాజ్యం ఆడదాని కారణంగా సంక్రమించిందనే మాట రావడం నాకిష్టం లేదు. ఈయన దానం చేసే రాజ్యం మనకు అక్కర్లేదు. పరాక్రమం చూపించి, శత్రువులను వధించి మన రాజ్యం మనం తీసుకుందాం' అన్నాడు భీముడు.

ధృతరాష్ట్రుడు ఆ మాటలకు కలవరపడ్డాడు.

'నేను చేస్తోంది దానం కాదు. నేనే నా బిడ్డల్ని దయతో చూడమని మిమ్మల్ని అర్థిస్తున్నాను' అన్నాడు మహారాజు.

భీముడేం మాట్లాడలేదు

పాంచాలీ సహితులై పాండవులు ఇంద్రప్రస్థానికి విషణ్ణవదనాలతో బయలుదేరి వెళ్ళారు.

(ఇంకా వుంది)

# తూర్పు-పడమర

**ఆమె కంటి కొసల నుండి ఓ బొట్టు రాలింది.**
**అదే సమయంలో... స్టాండుకు తగిలించబడ్డ సెలైన్ బాటిల్ నుండి ఓ నీటి బిందువు ఆమె శరీరంలోకి ప్రవేశించింది.**
**ఆమె కళ్ళు అతనికేసి ఆబగా చూశాయి. ఏదో చెప్పాలన్నట్లుగా ఆమె పెదవులువణుకుతున్నాయి.**

అతని చూపుడు వేలు తన కంటి మీద జాలువారుతున్న నీటి బిందువుల్ని తుడుస్తున్నప్పుడు సన్నగా కంపించటాన్ని ఆమె గ్రహించింది

జారిపోతున్న గుండెను దిటవుపర్చుకుంటూ ఆమె కళ్ళలోకి నిస్సహాయంగా చూశాడు ఖరీదైన ఆ కళ్ళజోడు అద్దాల వెనక ఆ కళ్ళు ఎర్రబడి ఉన్నాయి

చెప్పలేని ఉద్వేగం అట్టడుగు పొరల నుండి ఎగతన్నుకొస్తోంది బలవంతం మీద ఆయన తనను తాను కంట్రోల్ చేసుకుంటున్నాడు

ఆమె కళ్ళతో నేమాట్లాడుతోంది

మౌనంగా తలూపాడు మెల్లగా వెనక్కి తిరిగాడు

ఇంటెన్సివ్ కేర్ రూమ్ తలుపు నిశ్శబ్దంగా తెరుచుకుంది

అతను వెనక్కి తిరిగాడు ఆమె కళ్ళలో ఏదో వెలుగు!

అతను నడుస్తున్నా ఆమె ఆరాటం గుర్తొస్తున్నాయి బయటకొచ్చాడు చేతులు కట్టు... వినయంగా డోర్ తెరిచాడు

అతను కూర్చున్నాడు

తలుపు మూసుకుంటూ డ్రైవర్ తన సీట్లో కూర్చున్నాక ప్రశ్నార్థకంగా వెనక్కి ...

'ఇంటికి పోనీయ్ ''

కారు మెల్లగా కదిలింది డ్రైవర్ ఓ బటన్ ప్రెస్ చేశాడు సంగీత తరంగాలు ఆ చల్లని కారులో పయనిస్తున్నాయి ... తక్కుకుంటున్న

అతను విసుగ్గా తలెత్తి అన్నాడు

'స్టాపిట్''

నిర్ఘాంతపోయిన డ్రైవర్ ... వెంటనే తిరిగి బటన్ ప్రెస్ చేశాడు ఒక్కసారిగా నిశ్శబ్దం.

కారు ముందుకు వెళ్తూనే ఉంది

నల్లని అద్దాల నుండి వేగంగా మారిపోతున్న దృశ్యాలకేసి చూస్తున్నాడాయన కారు ఓ మలుపు తిరిగింది

ఎటు చూ... అదునాతనమైన బవనాలు

'దివ్య ...న్న ఓ బవనపు గేటు ముందు కారు ... అయింది డ్రైవర్ హార్న్ కొట్టాడు వాచ్‌మెన్ తలుపు తీశాడు కారులోపలికెళ్ళింది

డ్రైవర్ దిగివచ్చి వినయంగా తలుపు తెరిచాడు

... మౌనంగా లోపలకు నడిచాడు

... వచ్చి కాళ్ళకు చుట్టుకున్న పింకీ'ని ...లేదు సరాసరి తన బెడ్‌రూంలోకి

... తలుపులు మూసుకున్నాయి ఎర్రటి రంగులో ఉన్న అత్యంత అదునాతనమైన ఫోన్ అందుకున్నాడు

"న్యూయార్క్ ఓ కాల్ కావాలి నెంబర్ నోట్ చేసుకోండి వెరీ అర్జెంట్ ఓకె '

...జర్ నొక్కాడు

చేతులు కట్టుకున్న పనిమనిషితో చెప్పాడు

...జ్‌లో బాటిల్ పట్రా ఐస్ క్యూబ్స్ కూడా '

* * * * * * *

"...ది? వాళ్ళలా గుండెల మీద కూర్చు...కుంటారు మరీ అంత గారాబం ... గుండె పట్టేయదూ '

... అన్నపూర్ణకేసి చూసి నవ్వాడు రామ్

'పూర్ణా ... మనుష్యుడి హృదయమేగా దాంతోనే ఆడుకోనీ ... అంత బలహీనం కాదు ... కోష్ణం ... కొట్టుకుంటూనే ఉంటుంది నా బిడ్డలు ఈ దేశాన్ని దాటి విశాల ప్రపంచాన్ని చూడాలి

... అయితే మాత్రం అంత గారాబమా'

"నువ్వు ...న్నదాంట్లో ఎన్నోవంతు ఇది నీ గుండెల ... పడి పాలచుక్కల కోసం నిన్ను హింసిస్తున్నప్పుడు నువ్వేమన్నావో నాకింకా గుర్తే "

అన్నపూర్ణ మాట్లాడలేకపోయింది

"భోజనానికి వస్తారా"

తప్పకుండా''

* * * * * *

గ్లాసులోకి ద్రవం వంపాడు రామ్ ఐస్ క్యూబ్స్ మెల్లగా అందులో కరుగుతున్నాయి తన జీవితంలోని విబిన్న దశలు తన కళ్ళ ముందు గిర్రున తిరుగుతున్నాయి మెల్లగా గ్లాసెత్తి గొంతులోకి వంపుకున్నాడు

"అన్నపూర్ణా నాకే మాత్రం తీరిక దొరకటం లేదు పిల్లలకి తల్లీతండ్రి కూడా నువ్వే నా బాద్యతల్లా డబ్బు సంపాదించటం నేను సంపాదిస్తాను నా బిడ్డల బంగారు బవిష్యత్ కోసం ఎంతైనా సంపాదిస్తాను

"పూర్ణా రవి సరిగ్గా చదువుతున్నాడా? వాడసలు నీ మాట వింటున్నాడా?? దగ్గరుండి బాగా చదివించు వాడ్ని స్టేట్స్ పంపించటానికి అన్ని ఏర్పాట్లు చేశాను



వాడు అక్కడ సెటిలయినా ఫర్వాలేదు ఇండియా వచ్చినా మన ఇండస్ట్రీస్ చూస్తాడు

దివ్యకు కూడా అక్కడి-సంబంధమే చూస్తాను అందరూ కలిసే ఉంటారు అవును మన కుటుంబానికి చెంది అంతా నూతనత్వమే అందరూ విదేశాల్లోనే పిచ్చి పూర్ణా సమాజం ఎంత ఉండదు అక్కడ ఒక్కసాం ... చాలు అరవై సంవత్సరాల పాటు డోక ఉండదు ఇక్కడంతా వేగం ట్వంటీ ఫస్ట్ సెంచరీలోకి పయనిస్తూన్నాం కదా అందుకే మేం మా ఉద్యోగాన్ని జాగ్రత్తగా చూసుకోవాలి'

అమ్మాయి కూడా ఉద్యోగం చేస్తుందా??

# పి.చంద్రశేఖర్ అజాద్



ముందుకెళ్ళిందనీ విమానంలో వెళ్తే ఒక్కరోజులో పిల్లల్ని చూడవచ్చు మద్రాసు నుండి మన ఊరు వెళ్ళినంత దూరం'

'దివ్యా నీకేం కావాలో అమ్మకే బాగా తెలుసమ్మా నీకు ఏం తక్కువైనా ఆమె ఊరుకుంటుందా? స్టేట్స్‌లో నువ్వింకా చదువుతావా? నీ ఇష్టం

'రవి బిజినెస్‌లోకి వచ్చేట్టు లేదు వాడి జీవితం వాడిష్టం నువ్వు సరేననాలిగానీ మనం కూడా వెళ్ళిపోయి వాళ్ళతోనే ఉందాం అయినా నీ చాదస్తంగానీ ఇంకా మన ఊరు మన ముగ్గులు అంటూ కూర్చుంటే ఎన్ని వందల సంవత్సరాలు పడతాయో ముందుకు పోవటానికి ఎదగాలి పూర్ణా నువ్వు ఎదగాలి'

* * * * * *

రవి ఐ హేట్ దిస్ కనీసం ఒక్క ముక్క మాతో చెప్పొచ్చుగా మేం కాదంటామా? నీ [illegible] వ్యతిరేకంగా చేస్తామా? ఏకంగా [illegible] చేసుకురావటంలో నీ ఇండివిడ్యువాలిటీని మా ముందు ప్రదర్శించాలనా [illegible] ఉద్దేశ్యం ఏమిటసలు?'

''పోనీండి ఎందుకంత ఆవే[illegible]'' అన్నపూర్ణ కళ్ళలోకి చూస్తూ [illegible]

రవీ అమ్మాయిని లోపలకు [illegible] అంది అన్నపూర్ణ

'మనం అన్నిటికీ [illegible] పడే [illegible] అక్కడకు పంపించాం

* * * * * * *

'మమ్మీ ఓసారి అమెరికా రాకూడదూ' ఫోన్లో అరుస్తున్నాడు రవి

వస్తున్నాం నేనూ మీ నాన్నగారూ వచ్చే నెలలోనే'

డేట్ ఫిక్స్ చేసి చెప్పండి లేకుంటే మాకు తీరిక దొరకదు




[illegible]లమైన ఆ [illegible]వంతలో తనూ అన్నపూర్ణ మిగిలారు

ఓ సాయంకాలం [illegible] రవి మాట్లాడాడు

డాడ్ [illegible] జాబ్ [illegible]

పిల్లల్ని ' అంది అన్నపూర్ణ

చైల్డ్ కేర్ సెంటర్స్ ఉంటాయి అక్కడ ఇచ్చేసి వెళ్ళా

అక్కడ [illegible]దీ నూతనంగానే ఉంది తన వ్యాపారంలో భాగంగా రామ్ అనేక సంస్కృతులు చూసి ఉన్నాడు మొట్ట మొదటిసారిగా ఏదో మూర్తిక్యమైన స్థితిని పొందిన బావన

ఏమిటది? వేగం అంతా వేగం ఇన్‌స్టెంట్ ఫుడ్స్ ఆలోచనలు ఆచరణ అంతా చిత్రంగా [illegible] వీటితో రాజీ పడటం అంత సులభంగా కనిపించటం లేదు

ఒక్కసారి మాత్రం దివ్య అల్లుడితో వచ్చింది తనెంత హడావుడిగా ఉందో తమను కలవటం కోసం ఎంత తీరిక చేసుకు రావలసి వచ్చిందో ఆమె చెప్పటానికే సమయం సరిపోయింది

అన్నపూర్ణకు ఇదంతా అగమ్య గోచరంగా ఉంది ఆమె మనసు ఇవేమి అర్థం చేసుకో లేక పోతోంది

తనలో సంఘర్షణ

ఇవన్నీ ఈ సమాజంలో సహజం వారికి చెందిన [illegible] సమస్యలుంటాయి రెండోది మొదటి నుండి [illegible] నాగరికత ఇక్కడ ఉంది దానికి తోడు అంతులేని వేగం ఉంది ఇక్కడ ఉండాలనుకున్నప్పుడు ఈ పరిస్థితులకు తగ్గట్టు [illegible]ంచాలి కదా [illegible]

[illegible] తిరిగి [illegible]ప్పుడు అన్నపూర్ణ అంది-

ఈ [illegible] గుండెల మీద ఆడుకున్న వారేనా? [illegible] రోజుల్లో ఎన్ని గంటలు మనతో [illegible] మన ఊరికంటే ఈ అమెరికా ఏం బాగుంది? [illegible]కోసం మన పిల్లల్ని విదేశాలు పంపాలని [illegible]పడ్డారు కనీసం అమ్మా అని పలకటానికి దివ్యకు కూడా నోరు రాలేదు

రామ్ [illegible]యంగా చూశాడు

రెండు దేశాల నడుమ జీవన విధానాల్లోని వైరుధ్యాలు ఇప్పుడు అనుభవంలోకి వస్తున్నాయి

ఫోన్ రింగయిన చప్పుడు

ఆత్రంగా అందుకున్నాడు రామ్

యస్ ఇవ్వండి ఎవరూ రవి కావాలి లేడా? అమ్మాయుందా? ఎవరూ లేరా? నేను వెంటనే మాట్లాడాలి వాడు రాగానే నాతో మాట్లాడమని



చెప్పు నేనిక్కడే ఉంటాను "

ఫోన్ పెట్టేశాడు

కళ్ళు ఎర్రబడుతున్నాయి గోడకున్న ఎలక్ట్రానిక్ గడియారంలో ముళ్ళు కదులుతూనే ఉన్నాయి

"చూడండి మిస్టర్ రామ్ మీ శ్రీమతికి కేన్సర్ మీ పిల్లలు అమెరికాలో ఉన్నారు కదా , అక్కడకు తీసుకు వెళ్ళకూడదూ "

"అమెరికా వెళ్ళాలా ఇక్కడా అసుపత్రులున్నాయండీ నేను రాలేను ఓ వేళ నా ప్రాణం పోతే ఈ గడ్డమీదే పోవాలి మీరేమి అనుకోనంటే ఒకటడుగుతాను మీరు అలా చేస్తారా"

"అడుగు అన్నపూర్ణా"

"నేను మీ కంటే ముందు చచ్చిపోతే మన ఊరు తీసుకెళ్ళండి అక్కడ పచ్చని పొలాల నడుమ నన్ను దహనం చెయ్యండి మన మట్టిలో కలసి పోయాననే తృప్తి నాకుంటుంది "

"ఎందుకలా మాట్లాడతావ్?" రామ్ కంఠం వణికింది

సిగరెట్ వెలిగించాడు

జ్ఞాపకాల శకలాలు ఒక్కొక్కటి చిందర వందరగా జీవితం కోసం ఆరాటం దరిద్రం రాబోయే మంచి రోజుల్ని తలుచుకుంటూ ఆశ నిరాశల నడుమ ఏమీ చేయలేక ఒక్కో రంగంలో విఫలమవుతున్నప్పుడు కలిగిన కసి ఎందుకో ఈ దేశం విడిచి వెళ్ళాలనే తపన పిల్లల్ని ఎక్కడెక్కడికో పంపించాలనే ఏవేవో శిఖరాగ్రాలకు చేర్చాలనే ఆరాటం

అన్నీ నెరవేరాయి ఒక్కొక్కటే ఏం కోల్పో తుందీ తెలియటం లేదు కాలం గడుస్తూనే ఉంది తమకు కనిపించని ఉక్కుతెర తమ నడుమ వ్రేలాడుతుందనే ఆలోచనను ఇంకా అంగీకరించ లేక పోతున్నాడు

ఏమిటి తను సాధించింది?డబ్బునేనా?అన్న పూర్ణకు కేన్సర్‌నా?పిల్లలకు వేగవంతమైన జీవితాన్నా?

సమయం గడుస్తూనే ఉంది ఫోన్‌కేసి విసుగ్గా చూశాడు

ఆ తీగలకు ఓ మాతృమూర్తి ఆరాటాన్ని దూరతీరాలకు మోసుకెళ్ళే శక్తి ఉంది కానీ

"డాడ్ ఇక్కడకు రండి అమ్మకు ట్రీట్‌మెంట్ ఇప్పిద్దాం అయినా ప్రపంచం ఇంకా కేన్సర్‌కు మందు కనిపెట్టలేదు "

అంటే త్వరలో అన్నపూర్ణ కనుమరుగౌతుంది ఇన్ని దశాబ్దాలు తనతో నడిచి కష్టంలోనూ సుఖంలోనూ తనను లాలించి, తను తీవ్రమైన నిరాశలో ఉన్నప్పుడు విజయం సాధించగలననే నమ్మకాన్ని కలిగించిన అన్నపూర్ణ

తన రక్తపు చుక్కల్ని పాలుగా మార్చి, తన ప్రేమనూ, అనుభూతినీ అనుక్షణం పిల్లల్లో చూసుకున్న అన్నపూర్ణ ఇంక తమతో ఉండదు



కాళిందునిపై
చిన్ని కృష్ణుని తాండవం
టైపు చిత్రం శర్మ సి హెచ్

అన్నపూర్ణ లేకపోతే ఏముంటుంది ?

శూన్యం

తనకెవరున్నారు?

పిల్లలు లేరూ 'పిల్లలు "

రవీ దివ్య!

"నాది మూర్ఖత్వం అని మీరు అనుకోవద్దు అమెరికా వెళ్తాం పిల్లలేం చేస్తారు ఏ అసుపత్రిలోనో నన్ను వదిలేసి వెళ్ళిపోతారు వారానికోసారి నన్ను చూడటానికొస్తారు అలా రావటం కోసం వాళ్ళెంతో ఇబ్బంది పడతారు అక్కడ నాకు తెలియని మొఖాలు ఆ బాష నాకు రాదు కనీసం ఇక్కడ మన మనుష్యుల నడుమ ఉంటే అదో తృప్తి నన్ను అర్థం చేసుకోండి'

అవును మరి తల్లి తన బిడ్డల్లో మాతృత్వపు అనుభూతిని దర్శిస్తుంది తను కోరుకుంటున్న మాతృత్వపు అనుభూతులకు దూరం అవుతున్నాననుకున్నప్పుడు 'మాతృదేశ' బావనే ఆ అర్తిని తీరుస్తుందా!?

పుట్టిన ఊరునూ, దేశాన్ని ఇంతగా ప్రేమించే అన్నపూర్ణ ఎంత గొప్ప అత్యల్ప వ్యక్తి!

ఒకానొకప్పుడయితే ఇదంతా సంకుచిత మనస్తత్వంగా తనకు కనిపించేది ఇన్ని దశాబ్దాలలో అన్నపూర్ణతో తను గడిపిన సమయం చాలా తక్కువ జీవన పోరాటంలో విజయం సాధించి చివరి కాలం కేవలం తనూ అన్నపూర్ణ మాత్రమే కొన్ని సంవత్సరాలపాటు లౌకిక విషయాలకు దూరంగా ఉండాలనుకున్నాడు

మరిప్పుడు .

తల్లిగా, భార్యగా తన పాత్రను మహోన్నతంగా పోషించిన అన్నపూర్ణ మరి కొద్ది కాలంలో



మిస్టర్ రామ్ ఆవిడేదో మానసిక పరమైన వత్తిడికి లోనవుతూంది మనం చేయగలిగిందల్లా మృత్యువును మరి కొంత కాలం ఆమెకు దూరం చెయ్యటమే ఈ చివరి కాలంలో ఆమె ప్రశాంతంగా ఉండేలా చూడటం ఎంతో అవసరం

తన చేతుల్లో మాత్రం ఏముంది?

ఫోన్ రింగయిన చప్పుడు

ఆరాటంగా అందుకున్నాడు

"యస్ నేనే రవీ అమ్మ మీ కోసం కలవరిస్తోంది నువ్వూ, దివ్యా బయలుదేరి వస్తే బాగుంటుంది అమ్మకిప్పుడు మీ ప్రేమ కావాలి

రామ్ చేతిలో రిసీవర్ నిస్త్రాణంగా జారి పోయింది

రవి మాటలే వినపడుతున్నాయి

సారీ డాడ్ కెనడాలో ఓ కాన్ఫరెన్స్‌కు ఎటెండ్ కావాలి ఇలాంటి అవకాశం ఇప్పట్లో రాదు అయినా అమ్మ మూర్ఖత్వంగానీ ఇక్కడకొస్తే ఏమైంది? ఆవిడ ఆ పల్లెటూర్లో పుట్టి పెరిగింది ఈ పరిస్థితుల గురించి తెలియదు ట్రైటు అండర్‌స్టాండ్ డాడ్ ఇరవై దేశాల ప్రతినిధులు పాల్గొంటున్న ఈ కాన్ఫరెన్స్ నా డ్రీమ్ అమ్మ ఆరోగ్యం జాగ్రత్త '

"ఒరేయ్ తొమ్మిది మాసాలు ఈ పల్లెటూర్ల గాలినీ, నీటినీ మీ శరీరాల్లో ప్రవహింప చేసిన తల్లి తన రక్తాన్ని అనురాగాన్ని మీ కోసం పంచేసిన తల్లి మీ కోసం తనకంటూ ఏమీ మిగుల్చుకోని అమ్మ చావు బతుకుల నడుమ విలవిలలాడుతూ మిమ్మల్ని చూడాలని ఆరాట పడుతుందిరా గో టూ హెల్ విత్ యువర్ కాన్ఫరెన్స్ మీ వేగాలూ ఇరవై ఒకటో శతాబ్దాలూ మీ ఉద్యోగాలూ ఏమైపోనీ రెక్కలు కట్టుకు ఎగిరి రండి ఆ కన్న తల్లి హృదయం మీద వాలిపోయి ఒక్కసారి తనివితీరా అమ్మా అని పిలవండి చాలు ఆమె ఇంకేం కోరదు మీరు ఆమె కడుపున పుట్టిన పాపానికైనా సరే ఒక్కసారి కేవలం ఒక్కసారి ఆమెను ' అమ్మా అనండి

గొంతులో నుండి మాటలు పెగిలి రావటం లేదు

రామ్ బాటిల్ అందుకుని గడగడ తాగేశాడు

మరికొద్ది సేపట్లో మంచం మీద మెల్లగా జారిపోయాడు ఎలక్ట్రానిక్ గడియారంలో ముళ్ళు నిరంతరాయంగా కదులు తున్నాయి

* * * * * *

అన్నపూర్ణ రామ్‌కేసి చూసింది

కళ్ళతో నే సైగ చేసింది

ప్రక్కన కూర్చున్నాడు కొద్ది క్షణాలు అక్కడ మౌనం రాజ్యమేలింది

"రవి ఫోన్ చేశాడా? అంది అన్నపూర్ణ

చేశాడు వాడు కలల ప్రపంచంలోకి వెళ్తున్నాడు

అమ్మాయి

వాళ్ళూ అంతే ఎవరి ప్రపంచం వారిది

ఈ ప్రపంచం విశాలమైందని మీరు అనేవారు

అవును పూర్ణా అన్నాను ఈ ప్రపంచం ఎంతో విశాలమైందని నేను అనుకుంటూ వచ్చాను కానీ రోజు రోజుకూ ఇంత ఇరుకుగా మారుతుందని అనుకోలేదు ఎవరి ప్రపంచం వారిది

'నా బాధంతా మీ గురించే మిమ్మల్ని వంటరి వాడ్ని చేసి వెళ్తున్నాను

"పూర్ణా– అలా మాట్లాడొద్దు

'నన్ను మాట్లాడనివ్వండి నేను పోయాక మీరేం చేస్తారు? పిల్లల దగ్గరికి వెళ్ళిపోతారా? వాళ్ళు ఇంటి దగ్గర ఉండరు మీకేం కావాలో కనుక్కునే తీరిక వారికుండదు మీరు వంటరివారై పోతారు మీకు కోపం వచ్చినా, సంతోషం వచ్చినా ఎవరితో పంచుకుంటారు మీ కోసమైనా నాకు బతకాల నుందండి ఆమెలో గూడు కట్టుకున్న దుఃఖం వెల్లువలా పొంగింది

రామ్ చాలా రోజుల తర్వాత ఏడ్చాడు బోరున ఏడ్చాడు

అన్నపూర్ణే తేరుకుంది

' వద్దండీ మీరెప్పుడూ ఏడవ కూడదు నవ్వుతూ బతకాలి నాకు మాటివ్వరూ నేను లేకపోయినా ఎప్పుడూ పిల్లల ముందు కన్నీరు పెట్టనని నాకు మాటివ్వరూ

రామ్ ఉద్వేగంగా అన్నపూర్ణ చేతులు అందుకున్నాడు చాలా సేపు ఇద్దర్లూ ఏం మాట్లాడుకోలేదు ఆ చేతులు అలా కలిసే ఉన్నాయి ఆ స్పర్శ ఇరువురినీ దశాబ్దాల వెనక్కి తీసుకెళ్తూంది

' ఏమండీ మర్చిపోరుగా మన పంటచేల నడుమ నన్ను తిరిగి రామ్‌లో ఉద్వేగం కళ్ళు మసకలు క్రమ్ముతుండగా అన్నపూర్ణ కేసి చూశాడు

"మీరేమనుకోనంటే నేను పోయానని టెలిగ్రాం ఇవ్వండి అప్పుడయినా పిల్లలు వస్తారేమో

రామ్ ఇంక ఉద్వేగాన్ని తట్టుకోలేక పోయాడు

తల పక్కకు తిప్పుకున్నాడు

నేను స్వార్థపరురాలినా?'

"కాదు పూర్ణా నువ్వు కన్న తల్లివి

* * * * * * *

కారు కదలి పోతూంది

అన్నపూర్ణ ప్రశాంతంగా నిద్రపోతున్నట్లే ఉంది

తుది ప్రయాణంలో ఆమె చెంత తనే ఉన్నాడు ఆయన ముఖంలో గంభీరత చోటు చేసుకుంది

రామ్‌కు పదే పదే ఆ మాటలే గుర్తొస్తున్నాయి

"అమ్మ పోయిందా? ఓ అయాం వెరీ సారీ పాపం అమ్మ మాత్రం ఏం చేస్తుంది?? క్యాన్సర్‌కు ఇంకా మందు కనుక్కోని యుగంలో ఆమెకా జబ్బు వచ్చింది అయినా మేం ఇప్పుడు వచ్చి ఏం ప్రయోజనం అంతా అయిపోయింది ఓ పని చెయ్యండి డాడ్ ఆ యాషెస్ మాకు పంపించండి మేం స్వయంగా వెళ్ళి నయగారా జలపాతంలో కలుపుతాం అమ్మ కూడా చూసిందిగా ఏమైనా అక్కడ కృష్ణా రివర్‌లో కలిపితేనే ఆమెకు ఆనందం పూర్ మదర్ ఎనీ హౌ షీ ఈజ్ ఏ గుడ్ మదర్ తర్వాత ఫోన్ చేయండి

పచ్చని పొలాల నడుమ ఖాళీ స్థలంలో చితిమీద అన్నపూర్ణ నిశ్చలంగా నిద్రిస్తోంది

చాలా మంది జనం వింతగా చూస్తున్నారు

'కొరివి పెట్టడానికి పిల్లలు రాలేదు కాబోలు

' అన్నపూర్ణా నువ్వు పూర్ మదర్‌వట మన పిల్లలు నువ్వు చచ్చి పోయావని జాలిపడ్డారు నీకు తెలియదు గానీ నీ మీద జాలిపడ్డారు కొరివి అంటిస్తూ అనుకున్నాడు రామ్

* * * * * * *

రవికీ– దివ్యకూ

అయిపోయింది అమ్మ శాశ్వతంగా మన నడుమ నుండి వెళ్ళి పోయింది ముఖ్యంగా నన్ను వంటరివాడ్ని చేసి వెళ్ళింది ఆమె చివరి కాలంలో మిమ్మల్ని చూడాలని మరీమరీ తపించింది ఆఖరుకు తాను చనిపోయానని తెలిస్తే మీరు రాగలరని భ్రమపడింది కానీ ఒకందుకు ఆమె అదృష్టవంతురాలు తాను మరణించాక మీరు వచ్చి

'ఉత్తరాలు' శీర్షికకి రాసేవారు

తమ పేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

–సంపాదకుడు.

## బల్లుల భక్షకుడు!



బల్లులు విష జంతువులని, తినే ఆహారంలో అవి పడితే అది విషపూరితమై మనిషి చనిపోతాడని అందరికీ తెలిసిన విషయమే కాని బల్లుల్ని ఎంచక్కా ఆరగించేస్తుంటాడట అహ్మదాబాద్‌లోని ఒక వ్యక్తి.

రిజర్వుబ్యాంకులో స్వీపర్‌గా పని చేస్తున్న నారాయణ్‌భాయ్ అనే అతను బల్లులంటే పడి చస్తాడుట. 21 సంవత్సరాల క్రితం అతను అన్నం తింటుండగా కంచంలో బల్లి పడిందట. అది గమనించకుండా ఆ బల్లిని ముద్దలో పెట్టుకొని నమిలి మింగేశాడట. తిని గుర్రుపెట్టి హాయిగా నిద్రపోయాడు, చూసినవాళ్ళు నిద్రలోనే నారాయణ్‌భాయ్ హరీ అంటాడని అనుకున్నారట కాని హాయిగా మర్నాడుదయం లేచి కూర్చున్నాడు ఇక ఆ రోజు నుంచి బల్లులు లేందే అన్నం ముట్టటం లేదట. ఈ 21 సంవత్సరాలలోను కొన్ని వేల బల్లులను భక్షించాడు

ఈ బల్లుల కోసం యితను పెట్టే ఖర్చు చూసి యిల్లాలు మూర్ఛిల్లుతోందట. ఇనక చేసేదిలేక విడాకులు కూడా యిచ్చేసింది భార్యనైనా వదులుకున్నాడు గాని బల్లుల్ని మాత్రం వదలటం లేదన్న విషయం ఫొటో చూస్తే అందరికీ అర్థమై పోతుందికదూ!

చిన్నప్పుడు యితని తల్లి ఉగ్గుపాలకు బదులు విషం పోసి పెంచిందేమో!. లేకపోతే ఎలా తట్టుకుంటాడు!

## తూర్పు-పడమర

తన శవం మీద పడి బోరున ఏడుస్తారనే తృప్తితో చనిపోయింది నాకలాంటి తృప్తి లేదు

నాకు తెలుసు ఇప్పుడు నేనేం పోగొట్టుకున్నదీ మీకు నా డబ్బుతో అవసరం లేదు మీరు రాకెట్ యుగంలో ఉన్నారు నాకు ఆనందంగా ఉంది

ఇప్పుడేమో డాడీ మీరు రండి ఇక్కడ ఓల్డ్ ఏజ్ హోమ్స్ ఉన్నాయి నో ప్రాబ్లమ్ అంటారు నేను మీ అందరూ విదేశాలకు వెళ్ళాలని ఆరాటపడింది ఈ మార్పుకోసం కాదు ఈ ప్రపంచం అన్ని అడ్డు గోడలూ అదిగమించి విశాలవంత మవుతుందను కున్నాను

కానీ తల్లీ బిడ్డల సంబంధాల్ని సైతం అదిగమించే వేగంలో పయనిస్తుందనే విషయం ఆలస్యంగా తెలుసుకున్నాను

మీరు నన్ను పిచ్చివాడిగా భావించినా ఒక్క విషయం మాత్రం చెబుతున్నాను ఈ వేగం మంచిది కాదు ఈ సమాజానికి ప్రేమ కావాలి ప్రేమకు అందనంత దూరానికి మీరు వేగంగా పయనిస్తున్నారు రేపు మీరూ వృద్ధాప్యంలోకి నెట్టబడతారు అప్పుడు మీరు ప్రేమ కోసం ఎదురు చూస్తారు ఇదే వేగం ఇంకా పెరగవచ్చు అప్పుడు మీ పరిస్థితి ఊహించుకుంటే నాకు జాలి కలుగుతోంది అందుకే మీకో సలహా ఇవ్వటానికి నేను ధైర్యం చేస్తున్నాను

మీ పిల్లలకి ప్రేమతత్వాన్ని బోధించండి మీ పిల్లలకి మానవత్వాన్ని నేర్పండి మీ పిల్లలకి దేశభక్తి నేర్పండి

ఇప్పుడు మీ అమ్మ నాకో పాఠం నేర్పింది నేనిప్పుడు నన్ను కన్న దేశాన్నీ నేను పుట్టి పెరిగిన ఊరునూ ప్రేమించటం నేర్చుకుంటున్నాను

మీ అమ్మ అస్థికలు మీకు పంపించటం లేదు ఏమనుకోకండి అవి నాతో నే యిక్కడే మన పొలంలో ఉంటాయి అమ్మ నాతోనే ఉందనే తృప్తి నేను ఒంటరివాణ్ని కాలేదన్న ధైర్యాన్నిస్తుంది

నేనిప్పుడు మన ఊరు వెళుతున్నాను ఈ నాన్నను చూడటానికి రావాలంటే మీ కెప్పుడూ హక్కు ఉంటుంది అదే సమయంలో మరో విషయం చెప్పదలుచుకున్నాను

నేను మరణిస్తాను– ఇంకా ఈ ప్రపంచంలో మరణాన్ని ఎవ్వరూ జయించలేదు కాబట్టి ఇక్కడి జనం చాదస్తం కొద్దో మరో కారణం వల్లనో నా శవాన్ని మీ కోసం ఉంచవచ్చు అప్పుడు నాకో సహాయం చేయండి నా శరీరాన్ని ఏ ఎలక్ట్రికల్ క్రిమిటోరియంలోనో దహనం చేయించటానికి ఆరాట పడకండి మన పొలాల నడుమ అమ్మ తనని తాను ప్రతిష్ఠించు కొంది ఆమె ప్రక్కనే నాకూ చోటు కల్పించండి

నా అస్థికల్ని పంట కాల్వలోనూ కృష్ణా జలాల్లోనూ కలపండి ఈ దేశపు సంస్కృతీ సంపదతో మమేకమౌతూ సముద్రంలో కలుస్తాను

మిమ్మల్ని కన్న తండ్రిగా ఇది నా చివరి కోర్కె
తీర్చటానికి ప్రయత్నించండి
ఇంతకంటే నేనేం రాయదలుచుకోలేదు
మీరు ఎదిగి పోయారు

ఈ జీవన వైరుధ్యాలు ఇప్పుడిప్పుడే వ్రేళ్ళూను కుంటున్నాయి ఇవి ప్రపంచాన్ని ఏ దిశకు మళ్ళిస్తాయో అనే ఆందోళన కలుగుతోంది

నాకు తోచే పరిష్కారం మరోసారి చెప్పనివ్వండి
ఈ ప్రపంచానికి ప్రేమ కావాలి
ప్రతి ఒక్కరూ తమ మాతృభూమిని ప్రేమించాలి,
అది సంకుచిత జాతీయవాదం కానంతవరకూ
మీ అందరూ క్షేమంగా ఉండాలని ఆకాంక్షిస్తూ

మీ
'నాన్న

కొత్త రచయితల "వర్క్ షాప్"
ముగింపు తేది : 31-8-'89

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## కొత్త రకం కథల పోటీ!

కథకో రూ. 100 కథకో రూ. 100 అట్లా వారం వారం లెక్కలేనన్ని "వంద" రూపాయిల బహుమతులు!

★ మీరు కొత్తగా రచయితలవ్వాలనుకుంటే యిదో "వర్క్ షాప్"

★ 'టాపిక్' మేమేయిస్తాం! దాని మీద రెండున్నర అర తావులు మించకుండా విడి విడి పంక్తులలో చిన్న కథలు అల్లి పంపాలి.

★ ఎంపికైన కథలు వీక్లీలో పడతాయి. పడ్డ కథకి 100 రూపాయిలు బహుమతి అందుతుంది!

## వరద లొచ్చాయి!

ఇదండీ టాపిక్! దీని మీద కథ అల్లి యీ దిగువ కూపన్ పూర్తి చేసి పంపాలి! పేరు చిరునామా హామీ వగైరా నింపాలి. జత చేసి కథతో పాటు పంపాలి! రచనలు త్రిప్పి పంపబడవు.

★ కూపన్ నింపడం వల్ల మీకు గల ప్రయోజనం?- ప్రతి 50 కూపన్‌లను "లక్కీ డిప్" తీసి కథ పడ్డా పడకపోయినా- 6 మాసాల చందా బహుమతిగా వారికి 6 మాసాలపాటు వారపత్రిక పంపిస్తాము

★ సంపాదకునిదే తుది నిర్ణయం

-సం

ఆంధ్రసచిత్ర వారపత్రిక "వర్క్ షాప్" కూపన్

టాపిక్ : వరద లొచ్చాయి!

హామీ : రచన నా సొంతం కాపీ కొట్టలేదు.

పేరు :................................................

చిరునామా :................................................

ముగింపు తేదీ : 31-8-89

# ప్రశ్నావళి

## -కె. రామలక్ష్మి

పసుపులేటి శ్రీనివాసులు, అనంతపురం

మీరు తెలుగు సినిమాలు చూస్తారా?

* చూడను

శ్రీ ఎన్. టి. ఆర్. సినిమాల్లో నటించడం ఎంతవరకు సమంజసం?

*ఏం? అనేక అవసరాలకని- నడకలు, పరుగులు యాత్రలు- చేయవచ్చుగాని- ఏదో ధ్యేయం కోసం నటిస్తే కొంపేం మునుగుతుందో నా కర్థంకాలేదు అయినా ప్రజల పాట్లుపట్ల ఏ ప్రభుత్వం తన దృష్టిని కేంద్రీకరించింది కనుక- యీాయనగారు పట్టించుకోలేదనడానికి!?

ఎస్. మహ్మద్ రఫీ, కాశీబుగ్గ

యువత మేలుకోవాలి నవత మేలుకోవాలి [illegible] మారాలి అప్పుడే నవ చరిత్ర వస్తుందంటారు. మీ[illegible] మంటారు?

* ఏ రాయి అయితేనేం పళ్లూడగొట్టుకొందుకు[illegible] ఉద్ధరిస్తుందని నమ్మకం ఏమిటి?

సినిమాలు చూసి ప్రేక్షకులు చెడిపోతున్నారా? [illegible] పడుతున్నారా నా విషయంలో మటుకు చెడి [illegible]

* శుభం అలాగే అనుకొని బాగుపడే ప్రయత్నం చే[illegible] చూడను వినను చెప్పను అని!

ప్రేమికులను విడదీసే తల్లి దండ్రులు బాగుపడ[illegible]

* మొన్ని మధ్య ఓ సినిమా చూస్తూ శంకరగాడు హీరోని చంపి విలన్‌ని బ్రతికించాడు అన్నాడు నా మనవడు విలన్స్ లేక కథ లేదు వారి అడ్డు తొలగించుకోక మీ కద లేదు! ఎలా?!

జి. రాజ్, అయిజ

కె రా. గారూ ప్రేక్షకుడికి, శ్రోతకి, పాఠకుడికి తేడా ఏమిటి?

* ఏం లేదు! మీడియం వేరంతే!

స్త్రీజన ఉద్ధరణకు నేనేం చేయాలో చెప్పండి

* మీరు సహితం ఓ రాయి వేయకుండా వుంటే అదే పదివేలు!

మారుతున్న సామాజిక పరిస్థితుల కనుగుణంగా నేటి స్త్రీ కూడా మారింది అవునా?

* మారింది. మారుతోంది కాని పురుషాధిక్యత గల యీ సమాజం 'మారినట్టు కన్పిస్తోందిగాని మారి చావడంలేదు

ఒకరికిచ్చిన మనస్సు తిరిగి పుచ్చుకోవాలంటే ఏం చెయ్యాలి.

* నాది నాకిచ్చేసే అని ఏడవడమే!

ఇవేం ప్రశ్నలురా బాబూ, తలలేదు. తోకలేదు అనుకుంటున్నారా?

* అనుకోలేదు నాకున్నాయి కద!

చోడవరపు నాగేశ్వరరావు, సికింద్రాబాదు.

మనిషికి దేవుడు బ్రతుకిచ్చినది చంపుకోడానికా [illegible]?

* [illegible] బ్రతుకుతూ రెండో వారిని చంపుకు తినడాని కనిపిస్తుంది!

నేటి [illegible] యువకులు దారి తప్పుతున్నా- [illegible]

*[illegible] 'ఉత్తేజాన్ని' యిస్తూఅమ్మాయిల నెలా ఏడి- [illegible] సినిమాల పాటలు- మాటలు-చేతలు [illegible] ఎలా? సాటి మనిషిగా ఆడదాన్ని గౌరవిం- [illegible] నెగటివ్ మెథడ్ ప్రారంభించారేమో- [illegible] ఆలోచించండి

[illegible] సమాధి అయినప్పుడుసమాజం పురో[illegible] చెందుతుంది. ఏమంటారు?

* అయితే- అంతే సంగతులు? నేడు అవినీతి లంచం- ఒక వే ఆఫ్ లైఫ్ అయిపోయింది అవి చేతకానివాళ్లు చచ్చు దద్దమ్మలనిపించుకోవడం చూడడం లేదా?!

ఎ. శ్రీధరాచారి, అయిజ

సామరస్యం సమంజసం అయిన సమాధానాలిచ్చే మాలతీ చందూర్, కె. వి. కృష్ణకుమారిపై మీ సదభిప్రాయం రెండు ముక్కల్లో చెప్తారా?

* మాలతి నా స్నేహితురాలు

కె వి నాకు పరిచయిస్తురాలు

రోడ్డుపై వెడుతున్న భాయీా బెహన్ ని కూడా ప్యారీ ప్యారాలుగా పరిగణించే ప్రస్తుత గుడ్డి సమాజం కళ్లు తెరిచేదెప్పుడు.

*దానికెలా తెలుస్తుంది? రోడ్డున వెళ్తున్న వారి సంబంధ బాంధవ్యాలు. మీరు మెళ్లో బిళ్ల కట్టి ఎనౌన్స్ చేసినా లోకులు తమకు తోచింది తామనుకుంటారు మీరెందుకు ఉలిక్కిపడాలి?

తొంభయి తొమ్మిది పర్సెంటు సెక్సు మిక్సు చేసిన నవలలు సక్సెస్ అవ్వటానికి అసలు పాయింట్ సెలవిస్తారా మిసెస్ కె.రా.

*మనుషుల ద్వంద్వ నీతి చెప్పేది శ్రీరంగనీతులు- రాసేవి యీ దరిద్రపు రాతలు అంచేత అసహ్యించుకుంటూ చెత్త ఆస్వాదించడం అలవాటైపోయింది మనకి

## "ప్రశ్నావళి" పాఠకులకు

★ మీ ప్రశ్నలు కార్డుమీదే రాసి వాటిని 'ఎడిటర్ ఆం స వా. ప.' గాంధీనగరం, విజయవాడ-3కి పంపాలి -పైన ప్రశ్నావళి అని వ్రాయాలి

★ ఒకరు రెండు ప్రశ్నలకన్నా ఎక్కువ పంపరాదు పూర్తి చిరునామా వుండాలి

★ నలుగురూ సరదాగా చదువుకొనే విధమైన ప్రశ్నలు ఒకటి లేదా రెండు మాత్రం చాలు! మీ పేరు, పూరా పత్రికలో వేస్తామని మరిచిపోకండి మారుపేర్లు తగవుగాక తగవు! ఎడిటర్‌దే తుది నిర్ణయం

-ఎడిటర్

# లింక్

బుడుబాని శంకరరాజు



టీచర్స్ సెలక్షన్ లిస్ట్‌లో తన నెంబరు లేకపోవడం చూసి మోహన్ మనస్సు సెలక్షన్ బోర్డు మెంబర్ల మీద కోపంతో నిండిపోయింది. వయో పరిమితి దాటి పోతున్నా ఇంత వరకు చిన్న ఉద్యోగమైనా లభించనందుకు జీవితం మీద విరక్తి భావం అతని కళ్లలో కదలాడసాగింది.

వేసవిలో అడుగంటిన బావిలో ఎండకు తళుక్కున మెరిసే గుక్కెడు నీరులా, సెలక్షన్ లిస్ట్ చూసేముందు కళ్లలో కనపడిన మెరుపు ఇపుడు అదృశ్యమై పోగా, కళ్లు ఆలోచనలతో "బ్లాక్‌హోల్"లా తయారయిన బుర్ర లోకి కృంగిపోయాయి.

మరుసటిరోజు న్యూస్ పేపర్‌లో "టీచర్ సెలక్షన్స్‌లో అవకతవకలు, లంచాలకు అధికార్ల దాసోహం" అన్న శీర్షిక క్రింద ప్రచురించబడిన వార్త చదివిన మోహన్‌లో మళ్లీ ఉద్యోగం మీద ఆశ చిగురించింది. రెండు రోజులు మిత్రులతో కలిసి చేసిన పరిశోధన వలన, లంచాలు తీసుకొన్నారనడానికి కొన్ని ఆధారాలు లభించడంతో, ఆ. పోస్టులకు సెలక్టు కాని వారందరూ మోహన్ నాయకత్వంలో కోర్టుకు వెళ్లడానికి నిశ్చయించుకొన్నారు.

మోహన్ కోర్టుకెళ్లే ప్రయత్నంలో మునిగితేలుతుండటం వలన సరిగా ఇంటి పట్టున వుండటంలేదు. చదివించడం తప్ప ఉద్యోగం తీసిచ్చే లౌక్యం తెలియని తండ్రి రామనాధం, కొడుకు కోర్టుకెక్కడం ఇష్టం లేక పోయినా, అతన్నాపే ప్రయత్నం చేయలేదు. కొడుకు పట్టుదల ముందు ఆ ప్రయత్నం సఫలం కాదని అతనికి తెలుసు.

అయితే, రామనాథం తన చిన్నకూతురు స్నేహలత విషయంలో మాత్రం చేయగలిగింది చేసాడు. అది స్నేహలతకు పెళ్లి సంబంధం కుదర్చడం, ఎక్కడెక్కడో తిరిగి సాయంత్రం ఇంటికి వచ్చిన మోహన్‌తో ఆ విషయమే చెప్పాడు

పెరట్లో ఈజీ ఛైర్‌లో కూర్చుని ఏదో నావల్ చదవడంలో నిమగ్నమై వున్న చెల్లెల్ని డిస్టర్బ్ చేయడం ఇష్టంలేక, ఆనంద బాష్పాలతో నిండిన కళ్లతో ఆశీర్వదిస్తున్నట్లు చెల్లెల్నే చూస్తూ "మరి పెళ్లెప్పుడు జరిపించాలని నిర్ణయించారు నాన్నగారు ?"

"అది నిర్ణయించవలసింది నీవే బాబూ !" గోడకు కొట్టిన బంతి, తిరిగి విసరిన వాడికే వచ్చి తగిలినట్లుగా, తను వేసిన ప్రశ్నను తిరిగి తన మీదకే తండ్రి ప్రయోగించడంతో మోహన్ అయోమయస్థితిలో పడ్డాడు

"అంటే! అర్థమయ్యేలా చెప్పండి నాన్నా!"ఆత్రంగా అడిగాడు మోహన్

"ఏముంది బాబూ ! నీ చెల్లెలికి కాబోయే భర్త ఈ మధ్యనే టీచర్‌గా సెలెక్ట్ అయ్యాడు నీ చెల్లెలి వివాహ జీవితం హాయిగా గడచిపోవాలంటే, ఆ అబ్బాయి ఆ ఉద్యోగంలో కొనసాగాలి కాని. " అని, కొడుకు కళ్లలోకి సూటిగా చూస్తూ పెదవులు దాటిరాని ఓ నిగూఢమైన నవ్వు నవ్వి "అలా జరగాలంటే నీవు, మీ మిత్ర బృందం కోర్టుకెళ్లి "స్టే" తేవడం మానుకోవాలి" అన్న తండ్రి మాటలు విన్న మోహన్‌కు కళ్లుబైర్లు క్రమ్మినంతపనైంది

"నీకు ఉద్యోగం వచ్చినా రాకపోయినా, చదువుకున్న వాడివి నీవు ఎలాగోలాగ బ్రతికేయగలవని నాకు నమ్మకముందిరా అబ్బాయి కాని నీ చెల్లెలు బంగారు భవిష్యత్తుకు వచ్చిన ఈ అవకాశం పోగొట్టుకుంటే ...? మళ్లీరాదు బాబూ! కట్నం కూడా పెద్దగా మనశక్తికి మించి వారేమీ అడగలేదు బాబూ మనముండే ఈ ఇల్లు అమ్మేస్తే సరిపోతుంది మరి తుది నిర్ణయం నీదే బాబూ! ఆలోచించుకో!" అర్థింపు , హెచ్చరిక మిళితమైన స్వరంతో చెప్పి వాహ్యాళికి బయలుదేరి వెళ్లిపోయాడు రామనాథం

పడకగదిలో తిరుగుతున్న ఫ్యాన్ క్రింద వెల్లకిలా పడుకొని వున్న మోహన్ ఆలోచనలు, ఆ ఫ్యాన్‌లాగే, బుర్రలో వేగంగా తిరగసాగాయి. ఒక వైపు లంచగొండితనానికి బలైపోతున్న సాటి నిరుద్యోగులు, మరో వైపు తను అమితంగా ప్రేమించే చెల్లెలి బంగారు భవిష్యత్తు ఒకరేమో రక్తం పంచుకొని పుట్టినవారు, మరి ఒకరేమో బాధలు పంచుకొని తననేనమ్ముకుని వున్నారు. తనేం చెయ్యాలి ? ఎవరి పక్షం నిలబడాలి? వ్యక్తి ప్రయోజనానికి, సామూహిక ప్రయోజనానికి మధ్య నలిగిపోతున్న మోహన్ మనస్సు బాధగా మూలిగింది

"అన్నయ్యా"! అన్న చెల్లెలు పిలుపుతో ఆలోచనల నుంచి బయటపడి ప్రశ్నార్థకంగా చూసాడు మోహన్.

"ఇందాకా నాన్నా, నీ మధ్యా జరిగిన సంభాషణంతా విన్నాను, నాకీ పెళ్లి చేసుకోడానికి ఇష్టం లేదన్నయ్యా" గొంతులో జీరవున్నా, స్పష్టంగానే చెబుతున్నట్లుంది

"ఏమిటమ్మా ఆ మాటలు ఇప్పడేమయిందని" సౌమ్యంగానే అన్నాననుకొన్నాడు కాని ఆ మాటలు అంటున్నప్పుడు చిరాకు ధ్వనించింది

"ఎవరికో! ఏమో ` అవుతుందని నేనా నిర్ణయం తీసుకోలేదన్నయ్యా పెళ్లికొడుకు వ్యక్తిగత చరిత్ర తెలుసుకున్న తరువాతే ఈనిర్ణయానికొచ్చాను నాకు నాన్న కుదిర్చిన వరుడు ఇంటర్మీడియట్‌నాతోనే కలిసి చదివాడు వాడు ఒక వ్యసనాల పుట్ట, ఈవ్ టీజర్ నన్ను కూడా ఒకసారి ఏడిపించాడు. రభసవుతుందని మీతో చెప్పకుండా ఓర్చుకున్నాను అటువంటి వాడిని కట్టుకొని నేను సుఖపడగలనంటావా చెప్పన్నయ్యా?" కళ్లలో నీళ్లు తిరుగుతుండగా, ఆవేశంతో చెప్పినా ఆలోచించే చెబుతున్నట్లనిపించింది మోహన్‌కి

చెల్లెల్ని దగ్గరకి తీసుకొని "నీ కిష్టం లేనిదేదీ ఈ అన్న బ్రతికుండగా జరగదమ్మా ! నాన్నకు నే చెబుతాను కాని, వెళ్లి పడుకోమ్మా!" ఆప్యాయంగా తల నిమురుతూ చెప్పాడు మోహన్

తన సమస్యకు ఇంత తేలిగ్గా పరిష్కారమార్గం లభిస్తుందని ఊహించని మోహన్‌కు ఆ రాత్రి తొందరగా నిద్ర పట్టేసింది

కాని చెల్లెలు స్నేహలత చెప్పిందంతా అబద్ధమని, అసలా పెళ్లికొడుకు ఎవరో తనకు తెలియకున్నా, అన్ని అర్హతలూ వుండి ఎన్నో ఏళ్లుగా ఉద్యోగాల కోసం ఎదురుచూస్తున్న తన అన్నలాంటి వారెందరో తమ భవిష్యత్తును మరోసారి పరీక్షించుకొనే అవకాశం తన పెళ్లి వలన ఆగిపోవడం ఇష్టంలేక అలా చెప్పిందని మోహన్‌కు తెలియదు ●



విజయవాడ - హైదరాబాదుల మధ్య బస్సుల రాకపోకలను స్తంభింపచేస్తూ కంచికచర్ల సమీపంలోని సత్యనారాయణపురం వద్ద రోడ్డుకు పడిన గండిని చిత్రంలో చూడవచ్చు వాన వస్తే వరదవస్తే ఆ వూరికి యీవూరికీ రాకపోకలు బంద్ అది మన దుస్థితి




హాస్య నవలికల పోటీలో ద్వితీయ బహుమతి నవల!

(గత సంచిక తరువాయి)

చిట్టిబాబుకి హుందాగా ఎలా నడవాలో నేర్పిస్తున్నాడు సాయి అతి గంభీరంగా ముఖం పెట్టి, ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తూ, అందరివంకా గర్వంగా చూసాడు చిట్టిబాబు

అంతా చప్పట్లు కొట్టి ఓ కే చేశారు

'ఎక్స్‌క్యూజ్‌మీ-" అనే శ్రావ్యమైన గొంతు విని అంతా వెనక్కు తిరిగారు

రాబిన్ బ్లూ ట్వింక్లింగ్ శారీ, పొడవు చేతులు మ్యాచింగ్ జాకెట్, రాళ్ల నెక్లెస్, గాజులు ధరించి ముద్ద మందారం లాంటి ముగ్ధ- వీణ, గుమ్మం దగ్గర నిల్చుంది అందరూ గుడ్లప్పగించి వుండిపోయారు .

"ఏంకావాలి, చెల్లాయీ?" అన్నాడు చిట్టిబాబు

"నా ఫ్రెండ్ సూట్‌కేస్ యీ గదిలో వుండి పోయిందట- అందుకనీ-" అంది

"రంగు ఎలా వుంటుంది?" అన్నాడు చిట్టిబాబు

"బిస్కట్ కలర్- పైన పేరు కూడ వుంది " అంది వీణ.

సుబ్బారావు, సారధి, సాయి హడావిడిగా వెదకడం ప్రారంభించారు ఆ గదిలో చాలా సామాన్లున్నాయి

"రండి కూర్చోండి " చిరునవ్వుతోనే ఆహ్వానించాడు శ్రీరాం

"థ్యాంక్స్ నేను వెళ్ళాలి మా ఫ్రెండ్స్ చూస్తుంటారు " నవ్వుతూనే అంది వీణ

"దొరికిందీ, దొరికిందీ" అంటూ ఆనందంతో అరిచారందరూ

"అసలు పోతే కదా- దొరకడానికి? త్వరగా యివ్వండి పాపం, ఆమె నిలబడే వుంది " అన్నాడు శ్రీరామ్ సూట్‌కేసు తీసుకుని వీణ నవ్వుకుంటూ వెళ్లిపోయింది

"చిట్టీ, వచ్చే ఏడు మీ చెల్లాయి పెళ్లి చేస్తారా?" అడిగాడు సాయి

"ఈ ఏడే చేసేవారు కాని, నా కట్నం డబ్బు తీసుకుని, దాని మీద వ్యాపారం చేసి, వచ్చే ఏటికి కట్నం సమకూర్చాలి నాన్న ప్లాన్" అన్నాడు

"పాపం, డబ్బుకు బాగా యిబ్బందిగా వుంది కాబోలు" అన్నాడు సారధి

అలవాటుగా కిచకిచ నవ్వేడు చిట్టిబాబు

"ఉత్తినే- నాన్న దగ్గర చచ్చేంత డబ్బుంది ఆ పీనాసి పానకాలుగాడి సలహాలు వింటూంటాడుగా వడ్డీ మీద వచ్చే వడ్డీని మాత్రం ఖర్చు చెయ్యాలని చూస్తుంటాడు నా కట్నం డబ్బు పది రూపాయల వడ్డీకి త్రిప్పి, వచ్చే ఏటికి బోల్డు సంపాదించాలని ఆశ" అన్నాడు

"ఈ గొడవలు మాకెందుకూ- సరేగాని, ఏమిటా నవ్వు? ధర్మేంద్రలా నవ్వమంటే జానీవాకర్‌లా నవ్వేవు " అన్నాడు సుబ్బారావు

చిట్టిబాబు సీరియస్‌గా మారిపోయాడు

"ఎవర్నైనా కట్నం లేకుండా పెళ్ళి చేసుకోవాలని నా కోరిక." అన్నాడు సాయి

"ఏం, మీ నాన్న బొత్తిగా చవట వాజమ్మా-" అన్నాడు చిట్టి

"రేయ్, చంపేస్తా ఏమిటా వాగుడు " అన్నాడు సాయి కోపంగా

"అది కాదు నువ్విలా పిచ్చోడ్లా పేల్తూంటే, నోర్మూసుకొంటే, అలాగే అనుకోవాలి మరి " అన్నాడు చిట్టిబాబు

"మా నాన్న చాలా కోపిష్టి కట్నం కావాలనే అంటాడు కాని, నేనే ఆదర్శంగా పెళ్లి చేసుకోవాలనీ-" నవ్వుతూ అన్నాడు సాయి

"నువ్వేమిటి? నేనూ అంతే! అందమైన పిల్ల దొరికితే నాకూ కట్నం వద్దు" అన్నాడు సుబ్బారావు, నిజానికి వాళ్ల నాన్నంటే చచ్చే భయం వున్నా!

"మూస్కోండి, మీలాంటి కోన్‌కిస్కోగాళ్లే అలా చెబితే, నేను చెప్పలేనా! పెళ్లి ఖర్చులు కూడా నేనే యిచ్చి, కట్నం నయాపైసా అడక్కుండా పెళ్లి చేసుకుంటాను" అన్నాడు సారధి

శ్రీరామ్ వారి మాటలు విని, చెవులు మూసుకున్నాడు

"శుభమా అంటూ చిట్టిగాడి పెళ్లికెళ్తూ, ఏమిటీ పాడు మాటలు?" అన్నాడు

"పాడు మాటలా?! " అందరూ ఆశ్చర్యంగా చూశారు

"అంతేగా మరి- మీ అందరూ మెడిసిన్ చదువుతున్నారంటే కట్నం కోసం గాక, ఆదర్శం కోసమా? చిట్టిబాబు మనకన్నా సీనియర్ అయినా, మనతోనే చదువుతూ డాక్టరీ కోర్సునే పావనం చేస్తున్నాడు, ఏడేళ్లనుండీ-" అన్నాడు శ్రీరామ్

"ఎన్నేళ్లు చదివినా అర్థమై ఛస్తేగా డబ్బు పోసి మా నాన్న సీటు కొని, చదవమన్నాడు చదివీ చదివీ విసుగేస్తోంది" అన్నాడు చిట్టిబాబు

"చదువు నాయనా చదువు- మామగారి సంపాదనలో కొంతైనా ప్రభుత్వ కళాశాలలకు చెంది, ధన్యమవుతుంది " అన్నాడు సారధి

మెలికలు తిరిగిపోయాడు చిట్టిబాబు

మరో గదిలో వీణ, తన నేస్తాలతో ముచ్చటలాడుతూ ఆనందిస్తోంది అంతా పెళ్లి ముస్తాబులయ్యారు

"వీణా! మరి నీ పెళ్లెప్పుడే?" అంది వారుణి

"ఛీపో- ఎప్పుడూ యిదే గోల ముందు బియ్యేస్సీ పూర్తి చెయ్యాలి ర్యాంక్ తెచ్చుకోవాలి " అంది వీణ

"నువ్వు తొందరపడ్డా మీ నాన్న చెయ్యడు లేకపోతే, ఆడపిల్లని యింట్లో పెట్టుకుని మీ అన్నయ్యకు పెళ్లెందుకే- ఇంకా చదువే పూర్తికాలేదు కట్నం కోసమేగా?" అంది వాహిని ఆమె ఏదైనా ఖచ్చితంగా అంటుంది

"ఏం చేస్తాం- ఎవరి పద్ధతి వాళ్లది " అంది వీణ

"ఒక పనిచెయ్యి మీ నాన్న నీ పెళ్లి చేసేసరికి ముసల్దానివై పోతావు గానీ- మంచి కుర్రాణ్ణి చూసి, ప్రేమించు ఆదర్శంగా పెళ్లి చేసుకో " అంది వారుణి

"అదే కరెక్ట్ మీ నాన్న కూడా ఏమీ అనడు కట్నం యిచ్చే బాధ తప్పిపోయిందని ఆనందిస్తాడు "

"మీరిద్దరూ అమాయకులే అనుకోవాలి

ఈ రోజుల్లో కట్నం లేకుండా పెళ్లిచేసుకోవడానికి ముందుకొచ్చే మొగాడెవరే? అడుక్కునే వాడు కూడా ఆరువేలు కావాలంటాడు" అంది వీణ

వేరే గదిలో పెళ్లికొడుకు తల్లి వీరమ్మ చుట్టూ ఎందరో స్త్రీలు కూర్చుని దీర్ఘంగా చర్చలు చేస్తున్నారు వారిలో ఒక స్త్రీ- దాదాపు ఏభై ఏళ్లుంటాయి- పాతికేళ్ల అమ్మాయిలా అలంకరించుకొని సొద పెడుతోంది.

"ఏమిటోనమ్మా! నా కష్టాలు నావే మీ బాబాయిగారికేం పట్టవు పిల్ల చూస్తే ఎదిగొచ్చింది పెళ్లి చెయ్యమంటే చూదాం చూదాం అని వాయిదాలేస్తారు రాజమండ్రీ బావయ్యే వుంటే నాకీ కష్టాలే వుండేవు కావు" అంటూ బుడి బుడి దీర్ఘాలు తీసింది

"ఆయనెవరు పిన్నిగారూ?" ఆసక్తిగా అడిగింది ఒక యువతి పిన్నిగారు పేరు సుందరమ్మ చాలామంది 'మందరమ్మ' అని పిలుస్తూంటారు స్నేహంగా వుండే యిద్దరు స్త్రీల మధ్య, క్షణంలో విరోధం సృష్టించి, వారిద్దరూ ఆగర్భ శత్రువుల్లా పోట్లాడుకొనేలా చేయగల నేర్పరి

"రాజమండ్రి బావయ్యెవరంటావేమిటి,



## బాలానందం




"స్వతంత్ర భారతి"
రేఖా చిత్రం: వి వాసవి, ఏలూరు

# మనజెండా!

మురిసిందీ మురిసిందీ
మువ్వన్నెల జెండా!
ఎగసిందీ ఎగసిందీ
అంబరాన మన జెండా!

జానిసత్వ బ్రతుకులకు
తేజస్సు తెచ్చినది
ఆంగ్లేయుల ఆగడాలకు
అడ్డుగోడ వేసినది!

మహామహుల త్యాగాలకు
మంచిబాట చూపినది
స్వాతంత్ర్య సాధనకు
సదా సాయపడినది!

కలకాలం కాంతులతో
కాంతివంత మవ్వాలి!
ఆ ఫలమే మనకు [illegible]
ఈ జాతికి లేదు భయం!

మురిసిందీ మురిసిందీ
మువ్వన్నెల జెండా!
ఎగసిందీ ఎగసిందీ
అంబరాన మన జెండా!

– వెంపలి రామకృష్ణ

అమ్మాయ్!" అంటూ తనలో తనే పదహారేళ్ల పిల్లలా సిగ్గుపడుతూ, కులుక్కుంది

"గోదావరి గట్ల మీద చెట్టా పట్టాలేసుకొని ఆడుకున్నాం పాడుకొన్నాం చూసేవారంతా సావిత్రీ, నాగేస్సర్రావూ అనేవారు ఏం చెప్పనమ్మా. అన్నీ అనుకున్నట్లే జరుగుతాయా! డబ్బు కోసం చూసి, వేరే పిల్లనిచ్చి పెళ్లి చేశాడు మామయ్య" అంటూ ముక్కు చీదింది.

"పోన్లెండి పిన్నిగారూ- అయిపోయిందిగా" అంది మరో యువతి

"అయితేనేమే అమ్మాయ్- బావయ్యకు నేనంటే ఎప్పుడూ గుర్తే మనూ రాస్తే నన్ను చూసే వెళ్తాడు పిల్ల పెళ్లి గురించి బాధపడుతూనే వుంటాడు ఎటొచ్చి ఆయనగారికే ఏం పట్టదు ఎప్పుడూ తన వ్యాపారం, తన గొడవా తప్ప -" అంది సుందరమ్మ

"అక్కయ్యా! అవన్నీ దేనికి? ప్రస్తుతం విషయానికి రా" అంది వీరమ్మ

వియ్యాలవారిని ఎలా ఏడిపించాలో, ఎలాటి విసుర్లు విసిరి ఆనందించాలో 'ఏక్షన్' చేస్తూ చెప్పుకుపోయింది సుందరమ్మ

వేరే గదిలో నేల మీద కూర్చుని చిట్టా తిరగేస్తూ దీర్ఘంగా లెక్కలేస్తున్నాడు పానకాలు ఇంతలో ఆచారి వచ్చాడు

"ఏమిటయ్యా! మళ్లీ ఈ చిట్టా తెరిచావు?" అన్నాడు నవ్వుతూ

"కొందరు కళాకారుల్ని రమ్మన్నాను ఈలోగా కాస్తంత పని-" అన్నాడు పానకాలు ఆచారి ఆశ్చర్యంగా చూశాడు

"కళాకారులా? వారితో నీకేం పని?" అన్నాడు

"అదేనయ్యా బాకీదారులూ- నోట్లు తిరగరాసుకోవాలి కొన్ని మొండి ఖాతాలకు ముందే వుత్తరం వ్రాశాను ఎటూ పెళ్లివారి ఖర్చుతో యీ వూరు వస్తున్నాంగా మర్యాదగా నన్ను కలుసుకొని, కొంత జమ వేసి, నోట్లు తిరగ వ్రాయకపోతే కోర్టుకు వెళ్తానని బెదిరించా చూస్తుండు వచ్చేస్తూనే ఉంటారు" అన్నాడు పానకాలు.

నిజంగానే వచ్చేశారు కళాకారులు!

వారంతా పానకాలుకు దగ్గర బంధువులే మొక్కుబడిగా ఆ పనిని పూర్తి చేసుకున్నారు. పానకాలు చేతుల్లో యిరుక్కొని, వడ్డీలు కడుతూ అలసి పోయే సామాన్య జీవులు వారంతా అసలు తీర్చలేని అసహాయులు! నిజానికి కాలం కలిసి వస్తే ముందు బాకీ తీర్చేది వారే!

వారిని పంపించి తిరిగ్గా పుస్తకం మూశాడు పానకాలు

"అన్నీ పూర్తి అయినట్లేనా?" అడిగాడు ఆచారి

"ఒక్కటే మిగిలింది- అక్కడే నాకు ఎదురొస్తూంది! అయినా ప్రయత్నం చేస్తాను ఇక స్నానం ముగించి, పెళ్లివారింటికి పోదాం" అంటూ లేచి బాత్‌రూంకేసి నడిచాడు లిటిగేషన్ ఆచారికి మతిపోయింది

కాసేపు పేపరు చదువుతూ ఆ గదిలో కూర్చున్నాడు

పానకాలు స్నానం ముగించి, బట్ట లేసుకున్నాడు తలెత్తి చూసిన ఆచారి నోరు వెళ్లబెట్టాడు బాగా మాసిపోయి, అక్కడక్కడ చిరిగిన దుస్తులు వేసుకున్నాడు పానకాలు

"ఏమిటయ్యా ఇది, మనం వెళ్లేది పెళ్లికి- అడుక్కోవడానికి కాదు" అన్నాడు

"తెల్సు లేవయ్యా! పెళ్లిలో నాకో దూరపు చుట్టం ఒకామె ఉంది ఆమె కూడా ఖచ్చితంగా వస్తుంది అన్ని బాకీలూ వసూలైనా ఆమె బాకీ మాత్రం రావడం లేదు ఏళ్లు గతించినా, నోటు మాత్రం నా దగ్గర నుండి పోనంటూంది ఆమెను గట్టిగా అడగలేను అలాగని మానలేను-" అన్నాడు పానకాలు

"నోటు ఉందిగా- మరి భయం దేనికి?" అన్నాడు ఆచారి

"వడ్డీ రూపంలో అసలు కన్నా మూడు రెట్లు ఎక్కువ తీసుకున్నాను ఏం చేస్తాం బంధుత్వం ఏడ్చింది నోట్లు కూడా తిరగ రాస్తూనే వుంది బాకీ మాత్రం అసలు అలాగే వుంది" అన్నాడు పానకాలు

"మరి నష్టం ఏముంది?" అడిగాడు ఆచారి

"నీకు అన్నీ లిటిగేషన్లే తెలుసు- వ్యవహారం తెలియదు ముఖ్యంగా బంధువులతో వ్యవహారం జాగ్రత్తగా ఉండాలి నేనింత వడ్డీ తీసుకుంటుంటే, కనీసం మాట కూడా అనకుండా కట్టేస్తుంది మనసులో నాకూ బాధగానే వుంటుంది మరి! కాని, బాకీ బాకీయేగా, మన కష్టాలు చెప్పుకుంటూ అడుక్కోవాలి

ఏ మాటకామాటే చెప్పాలి. ఆమె నిక్కచ్చి మనిషి డబ్బు వుంటే యిచ్చేస్తుంది మాట జారితే, పళ్లూడగొడుతుంది అటువంటి వారి కోసమే యీ వేషం అడుక్కునే వేషం" అన్నాడు.

"బాగుంది. నీ గోల నీదే గాని - పెళ్లివారింట్లో నీ చిరుగుల చొక్కా చూసి నవ్వుకుంటారనే జ్ఞానంలేదు," అన్నాడు ఆచారి

పానకాలు చివాల్న లేచాడు

"ఆ నష్టే వాళ్లు నాకేం తిండి పెడ తారా, పోషిస్తారా!" అంటూ అరిచాడు

★ ★ ★

శ్రీముఖ' హోటల్ ముందు అనేక కార్లు నిలిచాయి మగపెళ్లివారు దర్జా ఒలకబోస్తూ కారెక్కి సీరియస్‌గా పోజు పెట్టి తమ ప్రత్యేకతను చాటుకొంటున్నారు కాసేపట్లో ముఖ్యులు తప్ప బంధువర్గమంతా కార్లలో తరలివెళ్ళిపోయింది

'అబ్బాయిలూ, మీరు కూడా బయల్దేరండి అంటూ వచ్చాడు లింగోజీ

పెళ్లికొడుకుతో కలిసే వస్తాంలెండి అన్నాడు శ్రీరామ్ నవ్వుతూ

అబ్బే- పెళ్లికొడుకు యిప్పుడేరాడు సరిగ్గా పీటల మీద కూర్చోబోయే ముందు వస్తాడు ముందుగా మీరు వెళ్లి మన బలగాన్ని చూపించి హంగు ప్రదర్శించాలి వియ్యంకుడు బాగానే ఖర్చుచేసి, ఏర్పాట్లూ గట్రా చేస్తున్నాడు అయినా మీరు వాళ్లను పొగడకూడదు ? ఎటువంటి మర్యాదలు చేసినా ముఖం మాడ్చుకొనే వుండాలి అన్నాడు

ఎందుకండీ- పాపం వాళ్లేం చేశారూ అడిగాడు సాయి

మనమే అంతా చేస్తాం ఊరికే ఉబ్బిపోయి వెర్రి ముఖాలేసుకొని వారికి 'తానా తందానా అంటే మగపెళ్లివారి బెట్టు చూపించడం ఎలా కుదురుతుందీ? ఇది యీనాటి ఆచారమా? మా తాతల నుండీ వచ్చే సాంప్రదాయం ఆడపెళ్లివారెంతటి వాళ్ళుగానీ- వారిని బాగా ఏడ్పించి ముప్పతిప్పలూ పెట్టాలి మనం అన్నాడు లింగోజీ

నాన్నా! అసలే వాళ్ళు రౌడీస్ అని విన్నాను మనం వెధవ్వేషాలేస్తే కుళ్ల బొడుస్తారేమో- సందేహం వెలిబుచ్చాడు చిట్టిబాబు

ఖర్మరా ఖర్మ- నీతో చావొచ్చింది చేసేవన్నీ డైరెక్టుగా చేస్తామా మన చుట్టాలూ బంధువులతో చేయిస్తాం మనం మాత్రం నవ్వుతూ చూస్తుంటాము అన్నాడు లింగోజీ

మా స్నేహితుల్ని కూడా పాపం నవ్వుతూనే చూడమందాం! అన్నాడు చిట్టి

నోర్ముయ్ వాజమ్మా- ఏది ఎలా చెయ్యాలో నాకు తెలుసు అబ్బాయిలూ మీరంతా రండి అంటూ వారిని వెంట బెట్టుకొని వెళ్లి, దగ్గరుండి కారెక్కించాడు లింగోజీ తిరిగి తన గదికి వచ్చాడు

ఏమేవ్ నేను కూడా వెళ్తున్నా జాగ్రత్తగా చూసి తలుపులు తాళాలు వేసిరా! గుర్తుందా మనతాళం కప్పలు వెయ్ హోటల్ వాళ్ళు తెరిచి చూసే అవకాశం వుండదు మన జాగ్రత్తలో మనముండాలి అన్నాడు లింగోజీ

నేనున్నాగా మరిదిగారూ అన్నీ చూసుకొంటాను " అంది సుందరమ్మ

చాలావరకూ అన్ని గదులూ తాళం వేశారు ఒకటీ అరా ప్రయాణమవుతూనే వున్నారు

వీరమ్మ పట్టుచీరకట్టి, ఒంటి నిండా నగలు ధరించింది సూట్‌కేసులో కావలసిన వస్తువులు సర్దుకొని, సుందరమ్మతో సహా బైటికొచ్చి తాళం బిగించింది

అమ్మాయ్, చిట్టిబాబుని పెళ్లి వారింటికి తీసుకు పోయారా అంది సుందరమ్మ

స్నేహితులతో కలసి వెళ్లే వుంటాడుఅక్కయ్యా అయినా ఒకసారి చూసి పోదాం!' అంటూ చిట్టిబాబు గదిలోకి తొంగి చూసింది

'చిట్టీ- నాయనా చిట్టీ!' అంటూ అరిచింది కాని సమాదానం రాలేదు

చూశావా అక్కయ్యా వీడికెంత అశ్రద్ధ పెరిగి

ముణ్సిపాలిటీలో పనెప్పుడొచ్చిందొదినా

కళ్ళు పోయినయ్యా ఏమిటది? నా ఇంటి ముందు నే ఊడ్చుకుంటున్నా!

పోయిందో" ఎక్కడి సామాన్లు అక్కడే వదిలేసి చక్కా పోయాడు స్నేహితులంతా కలిస్తే చాలు- ఒళ్ళూ పై ఎరగరు' అంటూ గది తలుపులు వేసి బైట పెద్ద తాళం కప్ప పెట్టింది తాళం చెవి బొడ్లో దోపుకొని హడావిడిగా క్రిందకు దిగింది

"పిన్నిగారూ మీకోసమే చూస్తున్నాం రండి అంటూ కేకేసింది స్త్రీ

దిక్కులు చూస్తున్న సుందరమ్మ హఠాత్తుగా ఆగిపోయి, రిసెప్షన్ కౌంటర్లో వెనక్కు తిరిగి వున్న వ్యక్తిని చూస్తూ నిలబడిపోయింది

వీరమ్మతో సహా అందరూ కారెక్కి సుందరమ్మ కోసం ఎదురు చూడసాగేరు కాని ఆమె దృష్టి కౌంటర్‌వైపే వుంది

అంతవరకూ అటు తిరిగి నిల్చున్న వ్యక్తి ముఖం త్రిప్పాడు

పదహారేళ్ల అమ్మాయిల్లా మెలికలు తిరిగిపోతూ, సిగ్గుపడబోయిన సుందరమ్మ ఆ వ్యక్తిని చూసి ముఖం మాడ్చుకొంది అంతే! గిరుక్కున తిరిగి కారు దగ్గరకొచ్చింది

ఏమిటక్కయ్యా ఇప్పటికే ఆలస్యమయ్యింది ' అంది వీరమ్మ

'ఏం చెప్పనమ్మా దూరంగా నిలబడ్డ మనిషిని చూసి రాజమండ్రీ బావయ్యేమోనని ఆశతో వెళ్లాను అయినా, నా వెర్రిగానీ- బావయ్య యిక్కడికెందుకొస్తాడూ పీత కష్టాలు పీతవీ అనీ అంతా ఎవరి స్వార్థం వారు చూసుకొనే వారే గానీ యీ పిన్నిగార్ని పట్టించుకొన్నదెవరు? అందరికీ పిన్నిగారు కావాలి- కాని ఆమె అవసరానికి ఎవరూ రారు ఏం చేస్తాం తల్లీ' అంటూ కొంగుతో కళ్లు తుడుచుకొంది

అరె ఎందుకలా బాదపడతారు ఊరుకోండి పిన్నిగారూ ఇప్పుడు ఏమయిందనీ అంది పరో అమ్మాయి

అంతేలె అమ్మా- ఆ రాత్రి ముఖం[illegible] లావణ్య- నాతో చెప్పా చెయ్యకుండా రాజమండ్రీ పోయింది దాని అక్క కూతురు పెళ్లిట ఏం ఒక మాట చెబితే నేనూ వెళ్లేదాన్నిగా!' అంది మూల్గుతూ

పోనీలెండి పిన్నిగారూ మీరూ బాబాయిగారూ కలసి వెళ్లొచ్చు అని సానుభూతి చూపిందో యిల్లాలు

ఆ చోద్యం కూడానా- నా రాత! ఆయనతో వెళ్తే యిక అయినట్టే

ఇక మాటలు చాలుగానీ కారెక్కు అక్కయ్యా అంది వీరమ్మ

కారు ముందుకు కదిలింది

అదే సమయంలో కరీం తూలుకొంటూ హోటల్ ముందుకు వచ్చాడు అతనికెంతో ఆనందంగా వుంది

సారా సాంబయ్యగారికీ- అని అరిచాడు

## శ్రీదేవి పెళ్ళి?

హిందీ చలన చిత్ర రంగంలో నెంబర్ వన్ స్టార్‌గా వెలుగొందుతున్న అందాలరాశి శ్రీదేవి త్వరలో శ్రీమతి కాబోతున్నది

వరుడు ఎవరోకాదు ప్రముఖ హాలీవుడ్ నిర్మాత అశోక్ అమృతరాజ్‌ట టెన్నిస్ రంగంలో అనేక పేరు ప్రఖ్యాతులు సంపాదించిన ఆనంద్ విజయ్ అమృతరాజ్‌ల సోదరుడే ఈ అశోక్

మిథున్ చక్రవర్తితో వ్యవహారం బెడిసికొట్టడంతో శ్రీ దేవికి పెళ్ళి చేసుకోవాలన్న తలంపు కలిగిందట మా అమ్మ ఏ అబ్బాయిని పెళ్ళి చేసుకోమంటే ఆ అబ్బాయినే చేసుకుంటానంటోంది బుద్ధిగా శ్రీదేవి

తల్లి మాట జవదాటని అశోక్ అమృతరాజ్ అభిప్రాయాలకు-శ్రీదేవి అభిప్రాయాలకు దగ్గర సంబంధం వుందట అందుకేనేమో శ్రీదేవి తల్లి వీరి మనువు విషయమై అమృతరాజ్ యింటికి కబురు పంపి గ్రీన్ సిగ్నల్ కోసం ఎదురు చూస్తున్నదట



జై! అంటూ విన్పించింది ప్రక్కకు తిరిగి చూశాడు ఎవరో కుర్రవాడు నవ్వుతూ నిల్చున్నాడు కరీంవాడి భుజం మీద చరిచాడు

సారా సాంబయ్యగారికీ-

"జై! మళ్ళీ అన్నాడా కుర్రాడు కరీం వాడికో అర్థ రూపాయి తీసి యిచ్చాడు హుషారుగా వెళ్ళిపోయాడా కుర్రాడు

తూలుకొంటూ రిసెప్షన్ దగ్గరకు వెళ్ళాడు కరీం

నమస్కారంసార్- పెళ్ళివారి బస్ డ్రైవర్ని- కాస్త మర్యాద ఎక్కువైంది పడుకోవాలి- ఎక్కడ? అని అడిగాడు

రిసెప్షనిస్ట్ నవ్వుకొని బేరర్‌ని పిలిచి అతనికో మడత మంచం యివ్వమని చెప్పాడు కరీం

థాంక్సండీ బాబూ అని తూలుతూ బేరర్ వెంట వెళ్ళిపోయాడు

అయితే అప్పుడే ఎవరూ ఊహించని వింత జరిగింది అది జరిగినట్లు ఎవరికీ తెలియదు

చిట్టిబాబు తన గదిలో విపరీతంగా స్వీట్స్ తినడంవల్ల కడుపు ఉబ్బరం చేసి బాత్‌రూమ్‌లో దూరేడు అదే సమయంలో వీరమ్మ అతని ఉనికిని గుర్తించకుండా బైట తాళం పెట్టి వెళ్ళింది తీరా బైటకు వచ్చి చూసిన చిట్టిబాబు తలుపు గడేసి వుండటంతో బేజారెత్తి పోయాడు ఒక్క క్షణం అతని బుర్ర పని చెయ్యలేదు

చేతికున్న గడియారం చూసుకొన్నాడు

దాదాపు తొమ్మిది గంటలు కావస్తోంది

బాబోయ్ యిప్పుడెలా! అని ఖంగారుపడ్డాడు

అయినా పెళ్ళికొడుకుని గదిలో పెట్టి ఏ మాత్రం జ్ఞానం లేక వెళ్ళిపోయిన వారందరిమీదా పీకల వరకూ కోపం వచ్చింది ఏం చెయ్యాలి? ఎలా బైటపడాలి రిసెప్షన్‌కి ఫోన్ చేసి చూస్తే-!

వెంటనే తన ఆలోచనకు సిగ్గుపడ్డాడు ఈ విషయం తెలిసిన వారు తనని చూసి నవ్వుకొంటే అస్సలు భరించలేడు

చిట్టిబాబుకి ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ వుంది తన ఆకారం చూడగానే అందరూ నవ్వుతారు అది బాధాకరంగా వుంటుంది ఇప్పుడెలా? తనను వదిలేసి పెళ్ళి వారంతా వెళ్ళిపోయారని తెలిస్తే, పైగా గదికి తాళం కప్ప కూడా వేసి పోయినట్లు చూస్తే, అందరి దృష్టిలో తనెంత చులకనవుతాడు హోటల్ సిబ్బంది నవ్వుకొంటూంటే ఎంత అవమానం?

తిరిగి ఆకలి ప్రారంభించింది కోపం పెరిగిపోయింది అక్కడున్న ఫలహారాలమీద దాడి చేశాడు పీకల మొయ్యా తినేశాడు ఆకలి శాంతించగానే ఆవలింతలు వచ్చాయి

అదే సమయంలో మెరుపులాంటి ఆలోచన వచ్చింది

అసలు తనెందుకు ఖంగారు పడాలి? ఈ పెళ్ళి తనది- తను లేకపోతే అక్కడ జరిగేదేమీ లేదు కనుక కాసేపట్లో తనను వెదుక్కొంటూ వాళ్ళే వస్తారు ఈలోగా హాయిగా ఒక నిద్ర తీస్తే చాలు అనుకొన్నాడు చిట్టిబాబు మనసు శాంతించింది

ప్రశాంతంగా మంచం మీద వాలి నిద్రకుపక్రమించాడు మరుక్షణంలో గురకలు పెట్టి నిద్రపోయాడు

★ ★ ★

మ్రోగింది వీణ- పదేపదే

హృదయాలలో నా- అనే పాట శ్రావ్యంగా స్పీకర్లో నుండి వినిపిస్తోంది వెంకటేశ్వర కళ్యాణ మండపం ఆవరణలో రంగు రంగుల దీపాల మధ్య క్రిక్కిరిసిన జనంతో సందడిగా వుంది ఎన్నో రకాల వాహనాలు వస్తూ మరి కొందర్ని దించి వెళ్తూ అక్కడున్న వారి సంఖ్యను క్రమ క్రమంగా పెంచుతున్నాయి

వేరొక ప్రక్క భోజనాలు జరుగుతున్నాయి ఒక

### భలే పెళ్ళి

వరుసలో అందరూ మగవారు- ఎదురు వరసలో ఆడవారూ కూర్చుని భోజనాలు చేస్తున్నారు చలోక్తుల మధ్య హుషారుగా వుంది

వీడియో ఫోటోగ్రాఫర్ భోజనాల దగ్గర కూర్చున్న ప్రతి వ్యక్తినీ కెమెరాతో బంధిస్తూ ముందుకు పోతున్నాడు

మ్రోగింది వీణ- పదేపదే-' అన్నాడు సాయి నవ్వుతూ

ఆ తర్వాత పాట నే చెబుతా- వాచింది దవడా మరే మరే!" అని శ్రీరామ్ హెచ్చరించాడు సాయి ఎవర్ని ఉద్దేశించి అన్నాడో అతనికి తెలుసు ఎదురు బంతిలో వీణ ఆమె స్నేహితురాళ్ళూ వున్నారు వారివంక చూస్తూ చచ్చు జోకులు వేస్తూ సాయి సారదీ సుబ్బారావు చాలాసేపు నుండి గొడవ చేస్తూనే వున్నారు

శ్రీరామ్‌కి వాళ్ళ మీద బాగా కోపంగా వుంది

మీరు చాలా సిల్లీగా బిహేవ్ చేస్తున్నారు ఎంత మంది మిమ్మల్ని అబ్జర్వ్ చేస్తున్నారో గ్రహించారా? అన్నాడు నెమ్మదిగా

బ్రదర్, కాసేపు మమ్మల్ని స్వేచ్ఛగా గడపనీ- లేకపోతే డల్‌గా వుంటుంది ఏదో మా కృషి మేం చేసుకొంటున్నాం రెస్పాన్స్ బాగానే వుంది అడ్డురాకు బ్రదర్ అన్నాడు సాయి

"లాడూ, లాడూ లాడూ అంటూ వచ్చాడో వ్యక్తి వడ్డన చేస్తూ

ఇదిగో లాడూ- యిక్కడ యిక్కడ అరిచాడు సారది

ఆ వ్యక్తి పరుగు తీసుకొచ్చాడు

ఇక్కడ కాదోయ్ అక్కడ అక్కడ అంటూ వీణవైపు చూపించాడు సాయి కాని అది వారు గమనించలేదు

ఇక్కడ అయ్యాకే అక్కడ అన్నాడా వ్యక్తి

మిస్టర్ సినిమా ఏక్టర్ నాగార్జున నీ చుట్టమా? అడిగాడు సాయి

లాడూ వడ్డన మానేసి నిటారుగా బిగిసిపోయి పోజ్ యిచ్చాడా వ్యక్తి చుట్టమేమిటి సాయీ వరసకు అన్నో తమ్ముడో అయి వుంటాడు బ్రదర్ మనదీ హైద్రాబాదేగా అన్నాడు సారది

ఆ వ్యక్తి ఆనందంతో కులుక్కుంటూ లాడూలు గుమ్మరించాడు

చంపావుపో- ఇక్కడకాదు ఎదురుగా కన్పించే రెండు జడలమ్మాయి విజయశాంతికి చెల్లెలవుతుందిలే- అన్నాడు సుబ్బారావు

వడ్డన చేసే వ్యక్తి అమాంతంగా ఉద్రేకపడిపోయాడు

నాగార్జున- విజయశాంతి అనుకొని పరుగు తీసుకొని వెళ్ళి వీణ తినే విస్తర్లో అరడజను లాడూలు వేశాడు

ఏయ్ మిస్టర్? ఇదేమిటి? అంటూ కెవ్వుమని అరిచింది వీణ



మిస్ విజయశాంతిని అడిగానని చెప్పండి అంటూ నవ్వుకొంటూ వెళ్ళిపోయాడు అదేమిటో అర్థం కాక స్నేహితురాళ్ళవంక చూసింది

పాపం మెదడు చెడిపోయింది " అంది వారుణి

కాదే, స్ట్రూ లూజ్ . ఏం చేస్తాం మాక్కూడా చెరో రెండు యిచ్చి లాడూలు తింటూ జాలిపడు అంది వాహిని

వీణ కిలకిలా నవ్వింది

ఆ నవ్వుకు ఎదురు బంతిలో కూర్చున్న సాయి సారధి, సుబ్బారావు గిల గిలా తన్నుకొని తిన్నదంతా కక్కుకునేంత పని చేశారు

బోజన సమయమందూ బగవన్నామస్మరణా గోవిందా గోవిందా' అంటూ ఎవరో అరిచారు

కాని రెస్పాన్స్ రాలేదు

గోవిందనామ స్మరణ పూర్తి చేసిగాని పంక్తి నుండి లేచేవాళ్ళుంకాదు ఇప్పుడో, అర్థమైన కూతలూ కూస్తూ కోడి కెలికినట్టు బోజనం చేసి ఎవరి దారిన వారు లేచిపోవడమే" అంటూ గొణుక్కున్నాడా వ్యక్తి

మాస్టారూ ఇప్పుడూ ఆకుల్లోనేగా తినేది?' అన్నాడో కుర్రాడు

'కుర్చీలు టేబిళ్ళూ కావాల్సివచ్చాయిగా ఆ రోజుల్లో చక్కటి పులిహోర బూరెలూ చేస్తే – బిర్యానీలూ బిస్కట్లూ వచ్చాయిప్పుడు మీ తరం వేరు నాయనా – వక్రతరం – మార్చడం కష్టతరం అన్నాడు

మొత్తానికి బోజనాలు ముగిశాయి

'కిళ్ళీ కిళ్ళీబాబూ కిళ్ళీ నాయనా కిళ్ళీ మావయ్యా కిళ్ళీ బావయ్యా కిళ్ళీ అంటూ మరో బట్టతలాయన కిళ్ళీల బుట్ట అందుకొని జనం చుట్టూ తిరుగుతున్నాడు

ఎందుకలా అరుస్తాడూ అతనికేమైనాపిచ్చా? అన్నాడో ఎల్కేజీ స్టూడెంట్

కాదు కిళ్ళీ లమ్ముకొనేవాడు' అన్నాడు యూకేజీ స్టూడెంట్

## ఉస్తాద్ అలీఖాన్ కన్నుమూత

ప్రముఖ సితార్ విద్వాంసుడు ఉస్తాద్ ముస్తాఖ్ అలీఖాన్ .యిటీవల కన్ను మూశారు. ఆయన వయసు 79 సంవత్సరాలు. ఈయన ప్రముఖ సితార్ విద్వాంసుడు అహీఖ్ అలీఖాన్ కుమారుడు.

కలకత్తాలోని క్యాన్సరు ఆసుపత్రిలో ఈయన తుది శ్వాస విడిచారు. వైద్య సహాయం క్రింద ప్రధాని సహాయనిధి నుంచి కొంత డబ్బు కూడా వీరికి అందజేయబడింది.

1968 లో సంగీత నాటక అకాడమీ అవార్డును కూడా శ్రీ ఉస్తాద్ సంపాదించారు.

1972 లో రవీంద్ర భారతి విశ్వవిద్యాలయం డి. లిట్. యిచ్చి ఈయనను సత్కరించింది.

ఐసీ – పూర్ పెలో అంటూ జాలిపడ్డాడు ఎల్కేజీ కుర్రాడు

కళ్యాణమంటపం దగ్గర అలంకరణ చేస్తున్నారు

వీణ వాహిని వారుణి కలసి పెళ్ళికూతురు దగ్గరకు చేరారు వీణ ఆడపడుచు కనుక ఆప్యాయంగా పిలిచి ఆమెను దగ్గర కూర్చోబెట్టుకొంది

పెళ్ళికూతురు పేరు గిరిజ!

మనిషి నాజూకుగా వుంటుంది సుమారు అందగత్తె క్రింద లెఖ్ఖే! పి యూసి చదివింది ఎప్పుడూ నవ్వుతూనే వుంటుంది

మీరు ఏం చదివారు? అంది వీణను చూసి

బియ్యేస్సీ చదువుతున్నాను' చెప్పింది వీణ

'మీరు చాలా బావుంటారు – మీ పేరులాగే' అంది గిరిజ

వీణ నవ్వి ఊరుకొంది వాహిని, వారుణి కూడా గిరిజతో సరదాగా మాట్లాడారు ఆమె కూడా తగినవిదంగా సమాదానాలు చెప్పింది



ఇంతలో తల్లి కేకేస్తే వీణతో సహా అందరూ లేచి వెళ్ళారు

దుర్భిణీవేసి గాలిస్తున్న పానకాలు తనకు కావలసిన వ్యక్తిని ఎలాగో పట్టేశాడు ఆ యువతి పేరు రాగిణి విజయవాడలోనే ప్రైవేట్ కంపెనీలో పనిచేస్తోంది ఆమెమీద ఆదారపడిన చెల్లెళ్ళు తమ్ముళ్ళు వున్నారు పానకాలుకి దూరపు బంధువు

'అమ్మాయ్ వచ్చావా' నువ్వు కూడా వస్తావనే అనుకొన్నాను పిల్లలు బాగా చదువుతున్నారా? ఎంతో ఆప్యాయంగా ప్రశ్నించాడు

పానకాలుని చూడగానే రాగిణి మనసు ఒక్కక్షణం బాదతో విలవిల్లాడింది

పెళ్ళిళ్ళూ శుభకార్యాలూ వుంటే రాకతప్పుతుందా బాబాయ్?' అంది

అంతేనమ్మా! ఒకరినొకరు కలుసుకోవాలంటే వీలుకుదురుతుందా? నేనూ అందుకేవచ్చాను పెళ్ళి మానినట్టూ వుంటుంది – నీతో మాట్లాడి నట్టూ వుంటుందనీ – ఆగిపోయాడు

ఉంటావుగా – మళ్ళీ మాట్లాడుకొందాం అంది అక్కడనుండి వెళ్ళబోతూ

'అమ్మా తల్లీ – ఒక్కక్షణం అన్నాడు ఆందోళనగా

రాగిణి ఆగిపోయింది

బొత్తిగా గుడ్డలు చిరిగిపోయాయి చేతిలో కాణీలేదు నీకు తెలిసే వుంటుంది పెంకుటిల్లు ఖాళీచేసేను ఊరి చివర పాకల్లో ఒక గది తీసుకొని వుంటున్నాను పరిస్థితి ఏం బాగులేదు అన్నాడు బాదగా

నీకు బాద లేమిటి బాబాయ్? లక్షాదికారివి అంది రాగిణి నవ్వి

అదేనమ్మా అందరూ అలాగే అనుకొంటారు డబ్బు మొత్తం జనంమీద పెట్టేశాను ఏదైనా బాకీ వచ్చినా మరొకరు ఎగరేసుకు పోతారు నిజం చెప్పాలంటే, నా లాటి దరిద్రం ఎవరూ అనుభవించరు

ఏం మాటలవి బాబాయ్! నీకేం కష్టం చెప్పు ఒంటరిగాడివి బరువూ బాధ్యతలూ లేవు



'అదేనమ్మా – జనం దృష్టిలో అంతే! కడుపుకు తిందామంటే కాసిని బియ్యం కూడా దొరకని జన్మ అయిపోయింది ఈసారి నువ్వే నన్ను గట్టెక్కించాలి ఎంతో కొంత జమచేస్తే – అంటూ జేబులోనుండి ప్రోనోటు తీసుకు చుట్టూ ఆడవాళ్ళు తిరుగుతూనేవున్నారు.

రాగిణికి చాలా అవమానంగా వుంది.

బాబాయ్! దేనికైనా సమయం సందర్భం వుంటుంది చేతికి డబ్బువచ్చినప్పుడల్లా ఎంతో కొంత యిస్తూనేవున్నాను కాని నా దురదృష్టం బాకీ రద్దుకావడంలేదు అసలు అలాగే వుండిపోతూంది

అయినా ఒకమాట అడుగుతాను నిజంచెప్పు! "కనిపించిన ప్రతివారికీ, పదేళ్ళనుండీ బాకీ తీర్చలేకపోతున్నానని చెప్పి ఏవేవో అంటున్నావట ఇది బాగుందా? అడిగింది రాగిణి

అయ్యో అందులో తప్పేముందమ్మా! నేను డబ్బిచ్చి ఏదేళ్ళు కావస్తూందిగా? అందుకే అన్నాను అన్నాడు పానకాలు

ప్రోనోటు బాకీ మూడేళ్ళు దాటితే చెల్లదు కాని ప్రతి రెండేళ్ళకే అసలూ వడ్డీ కలిపి తిరగరాస్తున్నావు ఈ వడ్డీలుకట్టీ కట్టీ నేనే అలసిపోయాను లెక్కచూస్తే నువ్విచ్చిన రెండువేలు – నేను కట్టిన వడ్డీ ఆరువేలు అయినా బాకీ మామూలే! ' అంది రాగిణి రోషంగా

అయ్యో నేనేం అన్నానమ్మా! తినడానికి తిండిలేదు కట్టడానికి గుడ్డలేదు చూస్తే తెలియడంలా – అడుక్కొనేవాడి ఆకారం నేనూ ఈ క్షోభ నా కెందుకు కల్గించావురా దేవుడా కాటికి పోదామన్నా కాసుకూడా లేదురా దేవుడా అంటూ గొంతు పెంచి ఏడవసాగేడు

చుట్టూవుండే జనం పోగవుతున్నారు రాగిణికి ముచ్చెమటలుపోశాయి ఏం చెయ్యాలి?

"ఏమిటమ్మా యీ గొడవ?" ఎవరో అడిగారు

"ఏంలేదు చచ్చిపోయిన తల్లి జ్ఞాపకంవచ్చి ఏడుస్తున్నాడు మీ పని మీరు చూసుకోండి" అంది రాగిణి

పానకాలు స్వరం పెంచాడు

అందరూ వెళ్ళాక – దేవుడా, ఏడ్చినా లాభంలేదు దేవుడా, కాసేపు ఆగండి దేవుడా కథంతా చెబుతాను దేవుడా!" అంటూ ఉత్తరీయంతో కళ్ళు తుడుచుకొని ఏడుపు కొనసాగించాడు అతని మాటలు జనాన్ని ఆకర్షిస్తున్నాయి

రాగిణి వెంటనే ఒక నిర్ణయానికి వచ్చింది పెళ్ళికుమార్తెకు చదివించాలని తెచ్చిన వందరూపాయల కాగితంతీసి అతనిచేతిలో పెట్టింది ఏడుపు తక్కున ఆపేశాడు పానకాలు

ఒక్కనిముషం ఆగుతల్లీ – నోటు వెనక సంతకంచేసిపోదుగాని" అని ప్రోనోటు కలం తీశాడు నిజంగా రాగిణి నరకాన్నే చూస్తోంది

ఆ తతంగం ముగిస్తేకాని మనశ్శాంతి లేదు

నోటు వెనుక వందరూపాయలూ జమవేసినట్లు సంతకంచేసింది

'అమ్మాయ్ వీలుచూసుకొని ఒకసారి మళ్ళీ వస్తాను పిల్లల్ని చూసి కూడా చాలా రోజులయ్యింది అందరినీ చూసినట్లూవుంటుంది రెండు రోజులు మీ యింట్లో గడిపినట్లూ వుంటుంది ' అన్నాడు పానకాలు

రాగిణి సమాదానం చెప్పలేదు

విసవిసా నడిచి వెళ్ళిపోయింది

కొందరు పెద్దలు కూర్చుని చర్చించుకొంటున్నారు ఆచారి నెమ్మదిగా అక్కడకు చేరాడు వారి ప్రక్కనే చతికిలబడ్డాడు

విందు బ్రహ్మాండంగావుంది భక్ష్యాలు అద్భుతంగా చేశారు అన్నారెవరో

వెజిటబుల్ బిరియానీ వుంది చూశారూ – ఒకసారి కాందారీ హోటల్లో తిన్నాను దానిని తలదన్నేలావుంది' మరొకరి ప్రశంస

ఆంధ్రమాతగోంగూర ఏం రుచి వెన్నకాచిన నెయ్యి ఓహో!'

ఆచారికి ఒంటిమీద కారం రాసుకొన్నట్లుంది

ఏమిటో తెగ పొగిడేస్తున్నారు ఇదీ ఒక విందేనటండీ? మా బాబు పుట్టినరోజునాడు లింగోజిగారు యిచ్చిన డిన్నర్ మీరు కాని రుచి చూస్తే అబ్బో! మళ్ళీ జన్మలో యిక ఏ విందు భోజనాన్నీ మెచ్చుకోరు" అన్నాడు

'ఇంతకీ మీ రెవరు? అడిగారొకరు

మగపెళ్ళివారం – లింగోజీగారికి బాగా కావల్సినవాడ్ని అన్నాడు

అలాగా – మీ రిందాక భోజనం చేసేటప్పుడు పదార్ధాలన్నీ కూడా లొట్టలువేసుకొంటూ తిన్నట్లున్నారే ఇదేంమాట మరి?"

'చంపారు పోండి కొన్ని సందర్భాలలో యిష్టం లేకపోయినా ఎదుటి వారి కోసం నటించాలి ఏమిటీ బిరియానీ రుచిగా వుందా – ఛీఛీ – అంతకన్నా బస్స్టాండ్ దగ్గర హోటల్లో ప్లేట్ భోజనం చేస్తే తృప్తిగా వుండేది ఇక గోంగూర! అసలు గోంగూర పచ్చడి ఎలా చెయ్యాలో మీ కేం తెలుసు – గుంటూరుజిల్లావాళం మాకు తెలుసు' అన్నాడు

లాడూలు అరడజన్ తిన్నారో '

ఒట్టి డాల్డా వాసన – వాంతి రాబోయి ఆగింది

'సేమ్యాపాయసం జుర్రుకున్నారో"

ఖర్మ – దానిని సేమ్యా పాయసం అంటారా? మీరు చెప్పేవరకూ తెలీదు "

వెన్నకాచిన నెయ్యికి కూడా ఒంకలా!

చెప్పకండి బాబోయ్ – ఆ వాసన భరించడం కష్టం

ఆచారి దోరణికి వారంతా ఆగ్రహంతో చూశారు

మాస్టారూ మీ కో రహస్యం చెప్పాలి ఇలా రండి అంటూ ఎవరో ఆచారిని పిలిచారు నవ్వుకొంటూ లేచివెళ్ళాడు

ఆ వ్యక్తి ఆప్యాయంగా ఆచారి భుజం మీద చెయ్యివేసి ఏవేవో చెబుతూ చెట్ల చాటుకు తీసుకుపోయాడు

అక్కడ యిద్దరు యమకింకరులున్నారు

ఏంటిబే – కూస్తున్నావ్?" అంటూ ఒకడు ఆచారి చెంపలు చెటాపటా వాయించేశాడు మరొకడు నెత్తిమీద మూడు పుంజీల మొట్టికాయలు బాగా స్ట్రాంగ్‌గా యిచ్చాడు

పూరీలా ఉబ్బిపోయిన బుగ్గలు నెత్తి మీద బొడిపెలతో ఆచారి స్పృహతప్పపడిపోయాడు వారంతా పరారీ అయ్యారు

(ఇంకా వుంది)

## ఆంధ్ర సచిత్ర వార పత్రిక మాటకారుల పేజీ

మూడక్షరాల మాట లున్నాయి ముచ్చటగా. ఇవి మనల్ని పీడిస్తాయి ఉదాహరణకి 'ఆకలి' - ఇలాంటి మాట ఒక్కటి కార్డుమీద రాసి మీ పేరు, చిరునామా రాసి పంపండి. ఎడిటర్‌కి నచ్చిన మాటలు మీ పేరూ, వూరుతో వేస్తాము! దీంతో పాటే అదే కార్డుమీద "వీక్లీ"ని మీరు కొనా? ప్రక్కింటగైకొనా? అద్దెకు తీసుకొనా? లైబ్రరీలోనా? ఎట్లా సంపాదించెదరు? అన్న ప్రశ్నకి 'వారం'లోగా జవాబు రాయాలి సుమా!

- మీ ఎడిటర్





# ప్రియంవద




అర్ధరాత్రి దాటింది

కిటికీలోంచి చల్లటి గాలి వీస్తోంది

సుబాష్‌కి నిద్ర పట్టటల్లేదు అటూ ఇటూ మంచం మీద దొర్లుతున్నాడు

గది తలుపులు వేసే ఉన్నాయి లేచి వెళ్లి గడియ పెడదామనుకున్నాడు

పెట్టక పోతే ఏం ఆ ప్రశ్నకి సమాధానాలు చాలా ఉన్నాయి

ఆ సమాధానాలు అతని గుండెను దొలిచేస్తున్నాయి

ఆలోచించిన కొద్దీ అతనికి వెన్ను జలదరిస్తోంది

ఆలోచించ కూడదనుకున్నాడు కానీ మనసు ఆగటల్లేదు తన చెప్పుచేతల్లో లేదు

ఏదో చప్పుడైతే ఉలికిపడి తలుపుకేసి చూశాడు

ఆ తలుపులు అలానే వేసి ఉన్నాయి

లోపల ఇంట్లో ఏవో చప్పుళ్లు

అతని గుండె వేగంగా కొట్టుకుంటోంది

ఆ రాత్రి ఏదో జరిగి పోతుందని అతని మనస్సు శంకిస్తోంది

లేచి తలుపు గడియపెట్టి వచ్చి మళ్లీ మంచం మీద వాలాడు

ఇప్పుడతనికేదో కొంత రిలీఫ్‌గా అనిపించింది

కానీ ఆలోచనలు మాత్రం అతన్ని వదలటల్లేదు

అందుక్కారణం ప్రియంవద

కొనదేలిన ముక్కు ఇంతింత కన్నులు అందమైన జడ తీర్చిదిద్దిన కనుబొమలు వాటన్నిటికీ తగ్గట్టుగా శరీర సౌష్ఠవం దబ్బ పండు చాయ వెరసివచ్చే ముగ్ధ మనోహర రూపమే ప్రియంవద

ఆ సాయంత్రం పారిజాతం చెట్టు క్రింద చల్లగాలిలో ఎదురెదురుగా కుర్చీల్లో కూర్చున్నారు ప్రియంవదా- సుబాష్

తనకి చాలా సన్నిహిత మిత్రుడయిన ఆచారి ఇంటికి వచ్చి రెండు రోజులయ్యింది సుబాష్

ఆచారి భార్యే ప్రియంవద

ఆ రోజు వెళ్లి పోతానంటే కాదూ కూడదన్నాడు ఆచారి మరో రెండు రోజులు తనతో గడిపి తీరాల్సిందేనన్నాడు ఆచారి

సుబాష్ కాదనలేక పోయాడు

రెండు రోజులు- సెలవు పెట్టాడు ఆచారి అయినా ఆఫీసు పనులు అతన్ని వదల్లేదు ఆ మధ్యాహ్నం ఆచారి ఆఫీసుకెళ్లకా తప్పలేదు

అలా మిత్రుడు లేని సమయంలో అతని భార్య ఒంటరిగా ఉన్న వేళ తను ఉండటం సంకోచంగానే ఫీలయ్యాడు సుబాష్

నిజానికి ప్రియంవద చాలా కలుపుగోలు మనిషి ఏ మాత్రం అరమరికలు లేకుండా మాట్లాడుతుంది

చామనచాయ రంగులో ఉండే తన మిత్రుడు ఆచారికి అంత హుషారైన అందమైన భార్య దొరికినందుకు ఆనందించాడు సుబాష్ అదృష్టవంతుడివిరా అని మిత్రుణ్ని మనసారా అభినందించాడు కూడా

దానికి తోడు ఏదో చూసి పోదామని వచ్చినందుకు గడిపిన రెండు రోజులూ అతనికి ఎంతో తృప్తినిచ్చాయి

మరో రెండు రోజులుండరా అని ఆచారి అన్నప్పుడు సుబాష్ ఉండాలనుకోవడానికి కూడా కారణం ఆ తృప్తే

తననో పరాయివాడుగా చూడటల్లేదు వాళ్ళు

తన ముందే ప్రియంవద భర్తని ఆటపట్టించటం, బుంగమూతి పెట్టి అప్పుడప్పుడు వయ్యారంగా భర్త ఆచారి వడిలో పడుకోనడం

నిజంగా ఇలాంటివన్నీ సుబాష్‌కి ఓ థ్రిల్లింగ్‌గా అనిపించాయి

సరైన జోడీ అంటే ఇలా ఉండాలని పదేపదే అనుకున్నాడు

కానీ

ఆ సాయంత్రం పారిజాతం చెట్టుక్రింద కూర్చున్నప్పుడు.

'మీ పెళ్ళికి నేను రాలేక పోయాను' అన్నాడు సుబాష్ సాలోచనగా

అవౌ

ఒక్కక్షణం సూటిగా చూసి

ప్రియంవద అన్న మాటలు అతనికి షాక్ ఇచ్చాయి

తింటున్న పకోడి గొంతులో అడ్డంపడి పలక మారింది

ఆమెనే తదేకంగా చూశాడు

అప్పుడు కానీ తట్టలేదు సుబాష్‌కి

వాళ్ళిద్దరికీ పెళ్ళయి ఆరేళ్ళు దాటాయని

ఆమె చెప్పిన తీరూ, ఆ చూపుల్లోని భావమూ అతనికి అంతుబట్టలేదు

పిల్లల్ని ఇవ్వగలరా?'

పది క్షణాలు పోయాక మళ్ళీ ఆమే అన్నది తలవంచుకునే

సుబాష్‌కి ఏం చెప్పాలో తెలీలేదు

ఈలోగా ఆచారి వచ్చాడు హడావుడిగా అరగంటలో బట్టలు మార్చుకుని అంత హడావుడిగానూ వెళ్ళి పోయాడు అక్కడెక్కడో




సరిగ్గా అప్పుడే నేను ఉద్యోగానికి ఇంటర్వ్యూ వెళ్ళాల్సి వచ్చింది స్నేహితుడి పెళ్ళికన్నా దొరకబోయే భుక్తి కే విలువిచ్చాను

తప్పదు కదా!'

అందుకే మీకో ప్రెజెంటేషన్ ఇద్దామని ప్రెజెంటేషనంటే అన్యోన్యమైన మీ దాంపత్యం చూశాక సంతృప్తితో ఆనందంతో ఇద్దామని ఉంది మనస్ఫూర్తిగా చెప్పండి మీకేం కావాలో వాడి నడిగితే నీ మొహం లేరా అంటాడు'

'ఊ ఏమిస్తారు' ఆలోచించింది

ఆలోచిస్తూనే ఆమె ముఖంలో మార్పొచ్చింది

క్షణంలో గంభీరంగా అయిపోయిందామె

ఒక డాల్‌ని కొనిస్తారా బొమ్మని బొమ్మతో ఆడుకుంటాను పిల్లలు లేరుగా పిల్లల్నివ్వలేరుగా మరి కానీ నాకు పిల్లలు కావాలి ఇవ్వగలరా '

ఆమె కను కొలకుల్లో నీరుబికింది

తలదించుకున్నదామె అతని ముఖంలోకి

లాకులకి గండిపడిందంటూ

ఇంజనీరుగా తన విద్యుక్తధర్మాన్ని నిర్వర్తించడంలో ఆచారి వెనుతీసే వాడు కాదు

ఇక ఈయన ప్రొద్దున్నే వచ్చేది " విసుక్కుంటూ అన్నది ప్రియంవద

ఇంక ఆ ఇంట్లో మిగిలింది సుబాష్-ప్రియంవదలే

ఊరికి దూరంగా విసిరేసినట్టు కట్టబడిన క్వార్టర్స్‌లో నే ఆచారి కాపురం

రాత్రి చాలాసేపు టి వి చూస్తూ కూర్చున్నాడు సుబాష్

అతని మనస్సు అదోలా ఉంది సాయంత్రం ప్రియంవద అన్న మాటలే అతని బుర్రలో గింగుర్లాడుతున్నాయి

'నాకు పిల్లలు కావాలి. కావాలి'

'అంటే

ఆచారి అసమర్థుడనా ప్రియంవద ఉద్దేశ్యం!

అతనివల్ల తనకి సంతానం కలగటల్లేదనా?

పిల్లలు కావాలంటే తను ఇవ్వగలడా? తన దగ్గర ఆమె అలా ఎందుకన్నట్టు?

ఆ ప్రశ్నకి సమాధానం ఊహించడానికే అతనికి భయంకరంగా అనిపించింది

'ఇక ఈయనొచ్చేది రేప్రొద్దున్నే' అని ఆమె అనడంలో అంతర్యం ఏమిటా అని బుర్ర బద్దలయ్యేలా ఆలోచించాడు సుబాష్

టి వి చూస్తూనే కళ్ళు మూతలుపడ్డ అతన్ని చెవిదగ్గర చప్పట్లుకొట్టి లేపింది ప్రియంవద

'వెళ్ళి పడుకోండి" అంటూ టి వి కట్టేసింది

హడావుడిగా తనకి కేటాయించిన గదిలోకి వచ్చి తలుపులు వేసి పక్క మీద వాలాడు సుబాష్

'ప్రియంవద తనను కవ్విస్తోందా !?'

గుండె మూలలలోంచి ఓ ప్రశ్న పుట్టుకొచ్చింది

లోపల తలుపులు తీస్తున్నట్టు, ప్రియంవద అటూ ఇటూ తిరుగుతూన్నట్టు, వంటింట్లో గిన్నెల చప్పుడూ తను పడుకున్న గది తలుపులు చిన్నగా కొట్టినట్టు ఏమిటోగా అతను అవస్థపడుతున్నాడు

ప్రియంవద చిరునవ్వులు, భర్తతో ఆమె చిలిపిచేష్టలు అతని కళ్ళలో మెదులుతున్నాయి

'ఇక్కడికి రాకుండా ఉంటే బాగుండేది' అనుకున్నాడు

అతని బుర్ర వేడెక్కిపోతోంది

తలుపు గడియ వేసిన తరువాత కొంత రిలీఫ్‌గా అనిపించినా ఏ క్షణాన్నయినా ఆ తలుపు చప్పుడు కావచ్చునని అతని చెవులు నిక్క బొడుచుకుని వింటున్నాయి

ప్రియంవదని తను తప్పు పడుతున్నాడా? అంతలోనే ఛెళ్ళుమనిపించిందో ప్రశ్న

ఆ రాత్రి అప్రమత్తంగా టెన్షన్‌ని అపుకొని గడిపాడు సుబాష్

నిద్రపట్టేసింది

తెల్లవారి ఎంతసేపయ్యిందో తెలీదు

దబదబా తలుపు చప్పుడైతే ఉలికిపడి లేచాడు సుబాష

తలుపు తీశాడు

"ఏమిట్రా ఆ నిద్ర రాత్రి సరిగా నిద్రపోలేదా ఆ కళ్ళేమిటి అలా ఉన్నాయ్" అంటూ ఆచారి సుభాష్ రెక్క పుచ్చుకుని హాల్లోకి లాక్కెళ్ళాడు

సుబాష్ ఏమీ మాట్లాడలేదు నవ్వేసి బాత్‌రూమ్‌లో కెళ్ళాడు

టిఫిన్ పెడుతూ ప్రియంవద, తింటూ ఆచారీ ఎప్పటిలానే సరదాలతో, సరసాలతో ఉన్నారు

ఇంతకు ముందులా సుబాష్ ఆ సరదాల్లో కలవలేకపోయాడు

'ప్రియంవద ప్రతి కదలికా తనకిప్పుడు ఎబ్బెట్టుగానే అనిపిస్తోందా అనుకున్నాడు

పది గంటలకి మిత్రులిద్దరూ ఊళ్ళోకి

బయలుదేరారు కాలక్షేపానికి

ఏదో ఆచారికి చెప్పాలని సుబాష్ తెగగింజుకుంటున్నాడు కానీ అతనికి నోరు పెగల్లేదు

ఆచారి మాత్రం ఏదో గలగలా వాగేస్తున్నాడు

ఒరేయ్ ఆచారీ అమ్మాయి నీకు సరైన జోడీయేరా అన్నాడు సుబాష్ అర్థాంతరంగా

ఈ మాట నూట ఏభైయ్యో సారన్నావ్

అవును మరో వందసార్లయినా అనడానికి నా కభ్యంతరం లేదనుకో

మరి!

నీ ముద్దూ ముచ్చటలకి సరదాలకీ లోటు లేదు కానీ పిల్లలు లేకపోవడం అనేది మగవాడికన్నా ఆడదానికే ఎక్కువ వ్యధ కలిగించేది

అవునన్నట్టు ఆచారి తలూపాడు

మరీ ఢ్యూటీ మైండెడ్‌గా ఆమెను ఒంటరిగా వదిలేసి ఊళ్ళు పట్టుకు తిరక్కు తరచుగా ఆమెను ఎక్కడికేనా తీసికెడుతూండు

మౌనంగా విన్నాడు ఆచారి

ఇలా చెప్పానని మరోలా అనుకోకురా ఆమె ప్రవర్తనలో ఏదో చూసి ఇలా చెబుతున్నాననుకోకు సుమా

చచ అసలు నువ్వన్నదీ నిజమే ఈ విషయంలో కొంచెం శ్రద్ధ తీసుకుంటాను మిత్రుడ భుజంమీద చేయి వేసి ఆచారి అన్నాడు

మిత్రుడు అలాంటి సలహా ఇచ్చినందుకు నిజానికి ఆచారికి చాలా సంతృప్తిగానే అనిపించింది

మర్నాడు ఉదయమే ప్రయాణమయ్యాడు సుబాష్

వెళ్ళాల్సిందేనా మీరు ప్రియంవద అడిగింది సుబాష్‌ని

ఆ సమయంలో ఆచారి ప్రక్క గదిలో బట్టలు మార్చుకుంటున్నాడు

నవ్వుతూ నిల్చున్నదామె

వెళ్ళాలన్నట్టు తలూపాడు

మీ ఇద్దరికి అన్యాయం చేస్తాననుకున్నారా బెదిరి పోయారు అన్న ప్రియంవద మాటలకు చటుక్కున ఆమె ముఖంలోకి చూశాడు

ఆమె ముఖంలో అదే నవ్వు అదే ప్రసన్నత

మరోసారి షాక్ తిన్నట్టయ్యింది సుబాష్ పని

ఎంత వక్రంగా ఆలోచించాడు తను!

అసలు ఏం జరిగిందని తను అంతగా భ్రమలో భ్రాంతిలో పడిపోయాడు

"ఒక మామూలు మగవాడి బుద్ధి ఇంతే ఇంతకు మించి ఉన్నతంగా ఆలోచించే సంస్కారం ఎక్కడిది [illegible] అనుకున్నాడు

[illegible] తరువాత ప్రియంవద ముఖం చూసే ధైర్యం [illegible]పోయిందతనికి

తల దించుకున్నాడు. ●

---

33

పాఠకులకో సవాల్!

# టిట్ ఫర్ టాట్

**అయ్యో రామా! మీరా? మీసం తీసేస్తే బృహన్నలనుకున్నా!**

ఇది ఓ వాగ్బాణం అనుకోండి దీన్ని మరో వాగ్బాణంతో మీరు ఉపసంహరించాలి– ఆ "రిపార్టీ గుచ్చుకోవాలేగాని బాధించకూడదు రసభరితంగా వుండాలేగాని అశ్లీలం కొట్ట వచ్చినట్లుండరాదు కార్డు మీద మాత్రం రాయాలి ఈ వాక్యం పైన రాసి మీ ప్రతి వాక్యం దాని క్రింద రాయండి మీ పూర్తి చిరునామా ముఖ్యం ప్రచురించిన రెంటికి రు 25, రు 15 చొప్పున బహుమతి వుంటుంది'– ఈ విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం

**25-8-'89 లోగా అందేలాగా రిపార్టీలు పంపించాలి!**

చాలా మంది వెంటనే 'రిపార్టీల వర్షం కురిపించారు కొన్ని మాత్రం ఎంపిక చేసి వేస్తున్నాం బహుమతులు పొందిన రెండూకాక– మరికొన్ని యిక్కడ వేశాము తతిమ్మా వారి వాగ్బాణాలు స్థలాభావం చేత వేయలేకపోయాం లాటరీ తీసి కొందరి పేర్లు మాత్రం వేస్తున్నాం' ఒకసారి బహుమతి రాలేదని నిరుత్సాహ పడక మళ్ళీ ప్రయత్నించండి'

–ఎడిటర్

**"లేచిరమ్మంటే ఉత్త చేతుల్తో రావడమేనా ?"**

*రు. 25 బహుమతి పొందిన రిపార్టీ :

## "చేతులుత్తవే కాని... మనిషిని 'ఉత్త'మనిషిని కాను"

- పి. జగన్నాధరావు (విశాఖపట్టణం)

* రు. 15 బహుమతి పొందిన రిపార్టీ :

## "నా నగలన్నీ వరదలపాలైనాయి డియర్ !"

- టి. బలరామ్ (మచిలీపట్నం)

**మరికొన్ని వాగ్బాణాలు**

**"మా ఇంటికి నేనే కడసారిదాన్ని మరి!"**

కె జనార్ధన్ (వికారాబాద్)

ఈసారి రికార్డు సంఖ్యలో రిపార్టీల వర్షం కురిసింది "అప్పడాల కర్ర తెస్తున్నాగా?" అన్న అర్థం వచ్చేలాగ చాలా మంది వ్యాఖ్య రాసి పంపారు వారి పేర్లు ఇక్కడ ఇస్తున్నాము

ఆర్ తపస్వి (అద్దంకి), వి పద్మజ (జంషెడ్‌పూర్), వి కుసుమ (జంషెడ్‌పూర్), ఎ కొండలరావు (పార్వతీపురం), సాయిబాబా (రాజమండ్రి), పి శ్రీదేవి (కడప)

**లక్కీ పేర్లు :**

ఎం వెంకటేశ్వరరావు (నర్సరావుపేట), పి శరత్చంద్ర (విజయవాడ), డి హేమలత (విజయవాడ), బి నాగేశ్వరమ్మ (చినవోగిరాల), డి సాయినాథ్ (కంప్లి), జయసూర్య (కందుకూరు), భవాని శ్రీనివాస్ (మండపేట), వి ఎస్ ఆర్ సాంబ (గుంటూరు), పి ప్రశాంతి (కడప), కృష్ణాజీ (అంబాజీపేట), ఓ ఆర్ కె రావు (మద్రాసు), కళ్యాణి (బెండమూర్లంక), జి పద్మజ (కనిగిరి)

# సీరియల్
# శత్రుసంహారం
## లల్లాదేవి

**ఇంతవరకూ సాగిన కథ- 10:** పరమవీరచక్ర అవార్డు అందుకొన్న మహేష్‌చంద్ర కొడుకు రాహుల్ వైమానిక దళంలో పైలట్‌గా చేరతాడు తల్లి, భార్య కారు ప్రమాదంలో మరణిస్తారు కుమార్తె సుషుమ్న దగ్గరున్న ఎలక్ట్రానిక్ ఇండికేటర్ వంటి పరికరంవల్లనే సంపత్‌మాస్టారి కుటుంబం విచ్ఛిన్నమైందని తెలుసుకున్న రాహుల్ తన కుటుంబ సభ్యుల మరణానికి సంబంధించిన వివరాలను సేకరిస్తుంటాడు కారవెల్లీ విమానప్రమాదానికి సంబంధించి బ్లాక్‌బాక్స్‌లోని ఇండికేటర్‌ను దొంగిలించిన సంస్థపై కన్నువేసిన ఎ. ఎస్. పి. కారంత్ హత్యకు గురవుతాడు పోలీసులతో పాటు రాహుల్ కూడా- హత్యచేసిన దుండగులకోసం వేట ప్రారంభిస్తాడు

(గత సంచిక తరువాయి)

భయ విహ్వాలంగా బిగుసుకుపోయి ఉన్న నగరంలో సప్తమ దళంలోనుంచి పారా మిలిటరీ వచ్చి దిగుతోంది. నగరంలో ఉద్రిక్త ప్రాంతాలలో పరిస్థితిని అంచనా వేసేందుకు హెలికాప్టర్లు చక్కర్లు కొడుతున్నాయి. శక్తివంతమయిన సెర్చిలైట్లు మారుమూల ప్రాంతాలకు తరలించబడుతున్నాయి ప్రజలకు నిద్ర లేదు.

ఏ క్షణంలో ఏమి జరుగుతుందో అర్థం కాదు. తలుపులు బిగించుకుని నాగరికులు గుండెలు చిక్కబట్టి చూస్తున్నారు

విధ్వంసక దళాలకు లక్ష్యం ఒకే ఒక్కటిగా ఉంది

పెద్ద గీత గీయటం ద్వారా ఉన్న గీతని చిన్నగీతను చేయటం వారి లక్ష్యమని అర్థం అవుతోంది. ఎ.ఎస్.పి. కారంత్‌ని హత్య చేయటం ద్వారా ఒక గొప్ప సంచలనం సృష్టించారు. అంతకన్నా అధికమైన బీభత్సాన్ని సృష్టించి ఎ ఎస్ పి హత్యను మరుగున పడేయటమే ఇప్పుడు వారి లక్ష్యం. అందుకోసమే ప్రయత్నాలు ముమ్మరంగా జరుగుతున్నాయి

విస్పష్టంగా ఫలానా వారు మా శత్రువులు అనేది లేదు ఏ క్షణంలో ఎవరిమీద అయినా దాడి జరవవచ్చు అనేది అందరికీ అర్థమైపోయిన సత్యం. వారు ఎవరయినా సరే.

ఆ భయంకర కాళరాత్రి తెల్లవారే లోగా వీలయినంత ఎక్కువ మందిని చంపాలి. అమితమైన బీభత్సాన్ని సృష్టించాలి.

ఆర్తులు, దీనులు, అవిటివారు, ఆడవారు అయినా సరే చంపాలి

పోలీసులు, పారామిలిటరీల దృష్టి ఒక చోట ఉంటే మరొకచోట బీభత్స కాండ సృష్టించాలి, వారు నిర్దోషులయినా సరే

ఆ కార్యక్రమంలో ఒక భాగంగా రక్షణ కోసం అలమటించిపోతున్న నర్స్ స్టాఫ్‌ని ట్రాప్ చేయించాడు దేవీ ప్రసాద్

వ్యక్తిగతమయిన జటిల సమస్యల్ని తీర్చుకుంటున్నాడు ఇబ్రహీం ! నాలుగో భార్యని ఒదిలించుకోవాలనేది అతని లక్ష్యం ఆ కాళరాత్రి జరిగిన అనేక హత్యలు, గృహదహనాల్లో అతని పీడ విరగడ చేసుకోగలిగాడు అన్ని ఘోరాల్లో అదొక ఘోరం ప్రాధాన్యత లేని ఓ గృహదహనం క్రింద సమసిపోయింది

నర్సులు ఎక్కిన వ్యాన్ మునుముందుకు పోతోంది కర్ఫ్యూ, కనిపిస్తే కాల్చివేత విధించిన ప్రాంతాలలోంచి దూసుకుపోతోంది.

సెంటర్‌లో పారా మిలిటరీ వారు వ్యాన్‌ని ఆపేశారు.

"మీరంతా ఎందుకు పోతున్నారు" అని అడిగారు.

"కర్ఫ్యూ ప్రాంతంలో చిక్కుకుపోయారు. డ్యూటీ నుంచి తిరిగి పోతుండగా ఈ ప్రమాదం జరిగింది ప్రముఖ వాణిజ్యవేత్త, ప్రజా సేవకుడు అయిన దేవీ ప్రసాద్ గారికి ఈ విషయం తెలిసింది వెంటనే ఆయన సహాయం అందించాలని నిర్ణయించారు. నర్సులు అంటే దీనులకు సేవ చేసేవారు కదా ! అందువల్ల వారిని సురక్షితమయిన చోటుకు చేర్పించే ఏర్పాటు చేశారాయన. మేము తీసుకుపోతున్నాం ఇవిగో కర్ఫ్యూ పాసులు" అంటూ తన దగ్గరున్న పాస్‌లు చూపించింది పీయూష

గుండెలు అరచేత పట్టుకుని చూస్తున్నారు అందరూ !

పోలీస్ ఆఫీసర్ ఆ పాస్‌లు చూసి చాలా సంతృప్తి పడ్డాడు వారి సమాధానం విని అతనికి చాలా ఆనందమయింది

"వారికి మా ధన్యవాదాలు చెప్పండి కాని ఈ భయంకర రాత్రి ఏ క్షణంలో ఎక్కడైనా దాడి జరగవచ్చు. మీరంతా ఆడవారు. అందువల్ల ఎక్కడా ఆగకుండా త్వరగా గమ్యం చేరుకోండి" అంటూ హెచ్చరించి పాస్‌లు తిరిగి ఇచ్చేశాడు

వ్యాన్ వెళ్లిపోయేందుకు సంతోషంగా అనుమతి ఇచ్చాడు

అతడు అభ్యంతరం చెప్పి అందరినీ ఆపేస్తే బావుంటుంది అని భావించింది

పియూష. అలాంటిదెమి జరగలేదు క్షణ క్షణం ఆ నర్సుల ప్రాణాలు మృత్యువుకు దగ్గరవుతున్నాయి.

తాను బయటపడి చెప్పేందుకు వీలు కాదు. ఆ నిర్దోషులను బ్రతికించాలని గొంతు చించుకుని అరిచినా ప్రయోజనం లేదు.

కాని ఏదో ఒక అద్భుతం జరిగి ప్రయాణం ఆగిపోతే చాలుననుకుంది అలాంటిదేమీ జరగకుండా అనుమతి ఇచ్చాడు పోలీస్ ఆఫీసర్!! డ్రయివర్ అమిత ఉత్సాహంతో వ్యాన్ ముందుకు దూకించాడు

పీయూష ఎన్నో ఘోరాలు కళ్ల ఎదుట జరుగుతున్నా సాక్షిమాత్రంగా చూస్తూ ఊరుకుంది. దేవీ ప్రసాద్ మనుషులు ఎంత నిర్దయగా అనుకున్న పనులు చేసుకుపోగలరో ఆమెకు తెలుసు

కాని రోగులకు సేవచేసే అమాయక నర్సులు అంతమంది ఒకేసారి హతం కావటాన్ని ఆమె ఊహించలేకపోతోంది ఎలాగైనా ఈ సైతాన్ నీడ నుంచి వారిని రక్షించాలన్న ఆలోచన క్షణక్షణం బలపడింది వ్యాన్ డ్రయివ్ చేసేందుకు వచ్చిన యువకుడు అనేక వీధి పోరాటాల్లో ఆరితేరినవాడు వాడి అసలు పేరేమిటో ఎవరికీ తెలియదు. ఏ వూరివాడో ఎక్కడుంటాడో అర్థం కాదు.అడ్రస్ లేని ఆవారా ! నేరస్థుల ప్రపంచంలో అడ్రసు లేని మనుషులకి చాలా విలువ ఉంటుంది వారు ఎలాంటి పని చేసినా క్షేమంగానే మనగలరు అటువంటి వారికోసం పోలీసు చిర్తాలోకి ఎక్కిపోయిన నేరస్థులు ఎంతో ఆశతో గాలిస్తుంటారు వారు చేసే నేరాలు తెలుసుకోవటం డిపార్ట్ మెంట్ కి అసాధ్యం. ఆధార్గాలు దొరికినా మనుష్ముల్ని ఎలా పట్టుకోవాలి? ఆ విధంగా మక్కాన్ గాడికి చాలా ప్రాధాన్యత ఉంది

మక్కాన్ అనేది వాడి నిక్ నేమ్ అసలు పేరుందో లేదో తెలిసినవారు లేరు. ఎలాగైనా వాడిని ప్రక్కదారి పట్టించి కొంత జాగుచేస్తే, ఈలోగా వారిని రక్షించేందుకు ఏదైనా దారి దొరకవచ్చు అని ప్లాన్ చేసింది పీయూష

"మక్కాన్ ! మనం ఒకసారి ఇబ్రహీంని కలిసి వెళ్లిపోదాం" అంది

"అదేం కుదర్దు. ఆయనగారు నేరుగా రమ్మన్నారు".

"టెలిఫోన్ లో ఇబ్రహీం వివరాలు అడిగారు దేవీప్రసాద్. అప్పుడు చెప్పలేకపోయాను. ఇప్పుడు వెళ్లగానే చెప్పాలి గదా! అడుగుతారేమో ! వెంటనే వెళ్లిపోదాంలే" బ్రతిమాలుతున్నట్లుగా అంది

"ఇప్పుడు ఇబ్రహీం ఎక్కడున్నాడని మనం పోగలం ?"

"ఆ చోటు నాకు తెలుసు కుడిచేతి వైపుగా పోనీ !"

"పోలీసులు అభ్యంతరం చెప్తారేమో!"





"తెలివితక్కువగా మాట్లాడకు మక్కాన్! మనదగ్గర పాసులున్నాయ్ నగరం అంతా తిరగొచ్చు కాని ఒకసారి చెకప్ అయిన సెంటర్‌కి మాత్రం పోయేందుకు వీలు కాదు. అంతే కదా ! దారులు తప్పించి పోదాం.

అయినా పోలీసుల సత్తా ఏమిటో నాకు తెలుసు ఇంత రాత్రి వేళ ఒంటరి వీధుల్లో వారు మనతో తలపడలేరు ఎందుకంటే మన వెనుక ఎంత శక్తి ఉందో, వారు ఎందరు దాడిచెయ్యాలో అర్థం కాదు ముందుగా ఖచ్చితమైన అంచనా దొరకనిదే పోలీసులు ముందుకి రారు

నన్నొక మాట చెప్పమంటావూ ? అందరూ భయపడే ఇలాంటి సమయమే ధైర్యంగా ముందుకు పోగలిగిన వారికి మంచి సమయం" అంటూ అతన్ని ప్రోత్సహించింది పీయూష

వయసు భావాలను అనుసరించి సాహసాలు చేయాలనే ఉత్సాహం మక్కాన్ గాడికీ ఉంది. సరే అంటూ తలూగించాడు

సర్రున కోసి కుడిచేతివైపు లేన్‌లోకి వ్యాన్‌ను పోనిచ్చాడు

తను ఆలోచించుకొని ఒక నిర్ణయానికి రావటానికి కొద్దిపాటి సమయం అయినా దొరుకుతున్నందుకు చాలా సంతోషపడింది పీయూష ఇక మక్కాన్ గాడిని దారి మళ్లించటం చాలా సులభమయిన సంగతి

ఆమె మలుపులు చెబుతోంది అతడు ముందుకు పోతున్నాడు మెయిన్ సెంటర్స్‌ని అప్రోచ్ అవకుండా తిరుగుతున్నాడు పావుగంట గడిచింది అప్పటికి పీయూష ఊహించిన అవకాశం ఎదురయింది. ఆ వీధిలో చాలా ఇళ్లు తగలబడుతున్నాయి మంటలు ఆకాశమెత్తున లేచి నాలుకలు కోరుతున్నాయి

పొగ మేఘంలా సుడులు తిరుగుతోంది ఆ ఇళ్లలో ఉంటున్నవారు తప్పనిసరయి వీధిలోకి పరుగులు తీశారు. ఆడవారు పిల్లలు ఏడుస్తున్నారు అంతా అలగోడు బాలగోడుగా బీభత్సంగా ఉంది పరిస్థితి

పక్కిళ్ల వాళ్లు కొందరు ఇంకా తలుపులు బిడాయించుకునే ఉన్నారు తలుపులు తెరిచి బయటకు వచ్చేందుకు భయపడుతున్నారు. కనీసం ఫైర్ ఇంజన్ కోసం ఫోన్‌చేసే దిక్కుకూడా లేకుండా ఉంది

## గజల్స్ గాయని లీలాఘోష్

గజల్స్ పాడే లీలాఘోష్ యిటీవల లండన్‌లో ఏర్పాటైన ఒక కార్యక్రమంలో పాల్గొన్నదట భారత్‌లో జరిగే కార్యక్రమానికి హాజరయ్యేవారి అభిరుచులకు లండన్‌లోనివారి అభిరుచులకు చాలా తేడా వుందంటున్నది ఆమె

ఇక్కడైతే (మనదేశంలో) గజల్స్ మాత్రమె పాడమని అడుగుతారని కాని విదేశాలలో అయితే గజల్స్‌తో పాటు సినిమా పాటలు కూడా పాడించుకుంటారని ఘోష్ అన్నారు మరి సినిమాలకు కరువాచిపోయి అలా కోరుకోవడంలో తప్పులేదుగా!

ఇక్కడైతే రోజు కో సినిమా రిలీజు కావటంతో మిగిలిన పాటలు పాడమని కోరకపోవటంలో ఆశ్చర్యమేం లేదుకదూ! ప్రాంతీయ సంగీతం కూడా అక్కడి వారికి ఎంతో యిష్టంట

అది ఆ సమయంలో నగర మధ్య భాగంలా లేదు. నాగరికమయిన మానవ సమాజంలోని ఒక అంతర్భాగంలా అనిపించలేదు దిక్కుమాలిన కీకారణ్యంలో దయమాలిన క్రూరమృగాలు అమాయకమయిన లేడిపిల్లల వెంటపడి వేటాడుతున్నట్టుగా అనిపిస్తోంది

స్వంతదారుల్లా ఇళ్లలో దూరి బెదిరించి డబ్బు గుంజుతున్నారు గాంగ్ మాస్టర్స్ సందేహించిన వాళ్లని చితకబాదుతున్నారు చీమల్లా శ్రమించి కూడబెట్టుకున్న ఆస్తినంతటినీ దోచుకుంటున్నారు వారికి నాయకత్వం వహించి నడుపుతున్నాడు ఇబ్రహీం!

అతనికి చాలా కాలంగా ఉన్న సమస్య తీరిపోయింది తనవల్ల గర్భవతి అయిన నాలుగవ భార్య పీడ ఒదిలిపోయింది బెదిరించో, ఒప్పించో మరో యువతిని పెళ్లి చేసుకునే అవకాశం వచ్చింది మరో జీవితాన్ని బలితీసుకునే సదవకాశం ఇవ్వడతని స్వంతం

నిండు చూలాలు అయిన భార్యని డొక్కలో తన్ని మాంస ఖండాల రూపంలో పిండం దూసుకు పడగా ఆమెను ఇంటిలోకి లాగి నిప్పంటించాడు. ఆ మంటల్లో ఆమె రూపుమాసిపోయింది ఆ ఆనంద కోలాహలంతో ఇబ్రహీం బాగా రెచ్చిపోయాడు భార్య చనిపోయినందువల్ల కలిగిన ఆనందం తాలూకు ఉన్మాదంలో ఉన్నాడు దోపిడీలు, హత్యలు నిరాఘాటంగా సాగించాడు



డబ్బులు, నగలు సంచులకెత్తి జీపులో వేయించాడు. ఆ డబ్బు, నగలు చూచి అనుచరులు శివమెత్తినట్లు అయ్యారు వీరభద్ర గణంలా విజృంభించారు అరుదుగా దొరికే అవకాశం దురాశ అనే సైతాన్ విజృంభించింది ఆ సందు మలుపులో వ్యాన్ ఆగిపోయింది మక్కాన్‌గాడు పులిలా క్రిందికి దుమికాడు మరో వైపునుంచి క్రిందికి దిగింది పీయూష

వ్యాన్ రావటం, దానిలోంచి ఇద్దరు వ్యక్తులు క్రిందికి దిగటం ఆ వీధిని సైతానుల్లా పాలించే వారు తిలకించారు ఇబ్రహీం ఒక ఇంట్లో నుంచి నడిరోడ్డు మీదికి వచ్చాడు కొంత దగ్గర అయ్యాక గుర్తుపట్టి బిగ్గరగా నవ్వాడు మక్కాన్‌గాడు క్షణంలో వారితో కలిసిపోయాడు

"మీపనులు చూసుకోండి వచ్చింది మనవాళ్లే ఇంకా తెల్లవారేందుకు ఎక్కువ సమయం లేదు ఈలోగా ఈ వీధి అంతా దోచుకోండి ఇళ్లన్నీ నిప్పు అంటించండి స్మశానమైపోవాలి బూడిదే మిగలాలి" అంటూ అనుచరులకు ఆదేశాలిచ్చాడు ఇబ్రహీం

ఆ డబ్బు సంచులు, బంగారు నగలు మక్కాన్ గాడి కంటిలో పడ్డాయి ఇక వాటిలో వాటా పొదులుకోవటమంత తెలివితక్కువతనం మరొకటి ఉండదని వాడికి బోధపడింది

"ఆ వ్యాన్ సంగతి నువ్వే చూసుకోవాలి. నేను మనవాళ్లతో కల్సిపోతున్నాను" అంటూ ఇబ్రహీం తీసుకువచ్చిన సైతాన్ గణంతో కలిసి దోపిడీలు సాగించేందుకు వెళ్లిపోయాడు మక్కాన్‌గాడు

తన ప్రయత్నం ఫలించినందుకు పీయూష లోలోపల సంతోషించింది

"అయితే నువ్వు ఈ వీధిలో విజృంభించావన్నమాట!?" అందామె ఇబ్రహీం ఆనందం పట్టలేక పిశాచంలా నవ్వాడు

"బెహన్‌జా! అన్నప్పుడల్లా ఇలాంటి అవకాశం రాదుకదా! వాస్తవానికి దోపిడీలు చెయ్యాలని నేను ఈ వీధికి రాలేదు నా నాలుగో భార్యను వదిలించుకోడానికి వచ్చాను దాని ఖర్మానికి దాన్ని మంటల్లో వొదిలేశా? కాలి బూడిద అయిపోయింది బద్మాషీ!

తీరా చూస్తే పోలీసు పారా మిలటరీ

పెట్రోలు ఇచ్చే సెంటర్లకి దూరంగా ఉంది ఈ చోటు! టెలిఫోన్ స్తంభం ఒక్కటే ఉంది దాని వైర్లు తెంచేశా!వీధి రెండు వైపులా మన మనుష్యుల్ని కాపలా పెట్టాను

రక్షణవచ్చే అవకాశం లేదు వారిని వారు కాపాడుకునే అవకాశం అంతకన్నా లేదు అని గుర్తించాను అందుకే ఇక్కడ విజృంభించా!నా కష్టం ఊరికే పోలేదు డబ్బు, బంగారం పుష్కలంగానే దొరుకుతున్నాయి ఇంకా దోచుకోవలసిన యిళ్లు పది దాకా వున్నాయి.

అల్లా దయవల్ల ఈ రాత్రి తెల్లారేసరికి నేను లక్షాధికారిని అవుతాను యా అల్లా తేరి ఖసం!" అంటూ పైకి చూచి కళ్లు అరమూశాడు ఇబ్రహీం! ఆమెను జీపు దగ్గరకు తీసుకుపోయి డబ్బు, బంగారం సంచుల్ని చూపించాడు

"చాలా గొప్ప పని సాధించావు నాకు కూడా భాగంపెడతావా?" నవ్వుతూ అడిగింది పీయూష! ఇబ్రహీం ధనపిశాచంలా నవ్వాడు

"ఈ డబ్బులో నీకు వాటా కావాలంటే నా జనానాలో చేరిపో!" అన్నాడు

"యూ బాస్టర్డ్ ఇబ్రహీం! ఈ రకం మాటలు ఇదివరకు నాతో మాటాడిన వారు ఏమయారో తెలుసుకదా నీకు?"

"నాకెందుకు తెలియదు బెహెన్ జా! నీ వెనుక దేవీ ప్రసాద్ వున్నారు".

"నీకు సిగ్గులేదు ఇబ్రహీం! బెహెన్ జా అంటూనే జనానాలో చేరిపొమ్మంటున్నావు ఎలా పుట్టావు ఈ మానవలోకంలో!"

"నా జీవితం అలాంటిది" అంటూ మళ్లీ పెద్దగా నవ్వాడు ఇబ్రహీం

"దేవిప్రసాద్ నీ గురించి అడిగారు నువ్విలాగే ఏదో గొప్ప ఘనకార్యం చేస్తూ ఉంటావని ఆయనకు తెలుసులా వుంది" అంది పీయూష!

"నా గురించి అడిగారా? ఏం చెప్పావు?"

"వివరాలు ఇవ్వలేదు కార్యక్రమంలో ఉన్నావని చెప్పాను బహుశా కొద్దిసేపటి తరవాత నేను దేవీప్రసాద్ దగ్గరకుపోతాను అప్పుడు చెప్తాలే! మీరు ఊహించినదానికన్నా గొప్ప ఘనకార్యాలే చేస్తున్నాడని"నవ్వింది పీయూష! అతడు వెనుదిరిగాడు

"వ్యాన్ అక్కడ వుండటం మంచిది కాదు యిక్కడికే తీసుకురా!" అన్నాడు అతని దృష్టిలో వ్యాన్ పడటం చూసి ఆమె వొణికిపోయింది దేవీ ప్రసాద్ కల్లోలం సృష్టించేందుకు వారిని చంపాలనుకున్నాడు

యిబ్రహీం చేతిలో నర్సులు చిక్కిపోతే చంపడంకన్నా ఘోరాతిఘోరమయిన పనులు చాలా చేయగలడు ఆమె ఆలోచనలో పడింది

జీపు వెనుక ఒక ఆకారం నీడలా కదలడం గమనించిందామె అంత ప్రమాదకరమైన చోటున అలాంటి సమయంలో ఇతర వ్యక్తులు ఎవరయినా ఉండటం అనూహ్యమే! అక్కడకు చేర్చిన డబ్బు, బంగారం దొంగిలించేందుకు ఇతరులు ఎవరైనా వచ్చే ఆస్కారముంది

ఏది ఏమయినా ఇలాంటి సమయాలలో మరొక మనిషి తోడు సంపాదించగలిగితే అది తనకు గొప్ప ఆసరా అవుతుంది.

ఇబ్రహీం అనుమానంగాచూస్తున్నాడు

"మీరు వచ్చిన వ్యాన్ అక్కడ వుండటం మంచిది కాదు. పోనీ నేను వెళ్లి తీసుకురానా?" అన్నాడు ఆవైపుగా ముందుకు సాగుతూ !

"ఇబ్రహీం! ఆగాగు. నేనే వెళ్లి తీసుకు వస్తాను నువ్వు వెళ్లి నీ పని చూచుకో!" అంది పీయూష కంగారుగా!

అరక్షణం ఆలోచించి తల పంకించి అక్కడ నుంచి వెళ్లిపోయాడు ఇబ్రహీం! ఆమె నిట్టూర్పు విడిచింది గుండె దడ శాంతించింది

ఆవైపున కదలాడుతున్న నీడ మరింత కార్నర్ అయింది ఇంక గుండె నిబ్బరంతెచ్చుకుందామె ఇబ్రహీం దూరంగా వెళ్లిపోయాడు అందరూ దోచుకునే కార్యక్రమంలో నిమగ్నమైవున్నారు

"అక్కడున్నది ఎవరో మాకు తెలుసు మర్యాదగా బయటకు రావాలి లేకపోతే ఈ పిస్టల్ గుండ్లు గుండెల్లోంచి దూసుకుపోతాయి" రెండు చేతులూ చాచి పిస్టల్ గట్టిగా పట్టుకుని ఎయిమ్ చేసింది పీయూష!

ఆ ఆకారం నెమ్మదిగా కదిలి ముందుకు వచ్చింది బాగా దగ్గరకు వచ్చాక ఎక్కడో చూచినట్లు గుర్తించిందామె.

"నీ దగ్గర ఆయుధాలుంటే కింద పడవెయ్యి"

"నా దగ్గర ఆయిధాలు లేవు" ఆ కంఠ స్వరం కూడా ఎక్కడో విన్నట్లుగానే అనిపించింది రెప్పలార్పకుండా చూస్తోంది. చేతులు ట్రిగ్గర్‌మీద మరింతగా బిగుసుకుంటున్నాయి. ముఖం కందగడ్డలా అయింది

ఏ క్షణంలో అయినా బులెట్ రిలీజ్ కావచ్చు! ఒక్క క్షణం చాలా భయంకరమైన నిశ్శబ్దం వారిని నరకం అంచులకు తీసుకువెళ్లింది

"అయితే ముందుకు వంగి మోకాళ్ల మీద కూర్చో" కర్కశంగా ఆదేశించింది

ఆ ఆకారం ముందుకు వంగి మోకాళ్లమీద కూర్చుంది

"మర్యాదగా చేతులు వెనక్కి విరిచి కట్టుకో! ఊ! క్విక్! కమాన్! డూ యా జ్ ఐ సే!" రివాల్వర్ అతని నుదుటికి ఆనించింది

అతను అలాగే ఆమె అజ్ఞాపించిన ప్రకారం చేశాడు

"నీ పేరు రాహుల్ కదూ!!" అప్పటికి గుర్తించిందామె

"అవును నా పేరు రాహుల్" చాలా కూల్‌గా బదులు చెప్పాడు

"వెరిగుడ్! పైలెట్‌వి కదూ!"

"అవును పైలెట్‌ని సెలవుమీద ఉన్నాను"

"ఓ! ఇండియన్ ఎయిర్‌ఫోర్స్‌లో పని చేసే దేశ భక్తుడువి దేశంకోసం ప్రాణాలర్పించేందుకు సిద్ధపడిన వీరుడివి ఈ సమయంలో ఇక్కడేం చేస్తున్నావు? ఈ కాళరాత్రి, భయం కరుడుగట్టిన ఈభయంకర రాత్రి జనం బిగుసుకుపోయి ఇళ్లలో దాక్కున్నారు.

శత్రువులతో పోరాడే వీరుడివికదా! సాహసించి బయటకు వచ్చావా?" అతడు ఈ మాటలు విని అవహేళనగా నవ్వాడు

"నేను భారతదేశాన్ని కాపాడేందుకు బయటి శత్రువులతో పోరాడాలని దళంలో చేరాను కాని భారతదేశానికి బయటి శత్రువులకన్నా లోపలి శత్రువులే ఎక్కువగా ఉన్నారని ఇప్పుడే గుర్తించాను"

"కాని నేను ట్రిగ్గర్ నొక్కితే ఈ వాస్తవాన్ని ఈ ప్రపంచానికి చాటలేవు ఇక్కడే నీతోపాటే సమాధి అవుతుంది"

"చావంటే నాకు భయంలేదు బయటి శత్రువులు ఏ క్షణంలో అయినా నన్నుచంపవచ్చు కానీ చాలామంది అమాయక భారతీయ సోదరులు అంతశ్శత్రువుల చేతులలో చనిపోతున్నారు అదే నా బాధ"

"నే నెవరో నీకు తెలుసా?"

"తెలుసుకున్నాను నీ పేరు పీయూష! ప్రమధగణాల్లో నగరాన్ని విరుచుకుతింటున్న సైతానుగణంలో నువ్వొక సైతాన్‌వి."

"ఇప్పుడు నీకు ప్రాణాలతో బయట పడాలని వుందా?"

"ప్రాణాలకోసం కక్కుర్తిపడాలని మాత్రం సైనికుడిగా నేను కోరుకోను"

"నువ్వు ప్రేమించిన దేశానికి మంచి పని జరిగే ఒక పని చెప్తాను చేస్తావా?"

"నీకు నా సాయం కావాలంటే చేస్తాను కాని భయపెట్టి బెదిరించి మాత్రం నాచేత ఆ పని చేయించుకోలేవు" అతని మనో నిబ్బరం ముందు ఆమె తలవంచింది. రివాల్వర్ దింపేసింది

"అయితే నాదొక అభ్యర్థన"

"ఏమిటది?"

"తక్షణం నువ్విక్కడనుంచి వెళ్లిపోవాలి"

"భయపడి పారిపోవాలంటావా? ఈ సైతానులు చేసే ప్రతి పని నేను చూడాలి! నా మనసు దహించుకుపోవాలి! అమానుషంగా ఒక ఏ.ఎస్.పి.ని చంపింది కాక ఆ తప్పిదాన్ని కప్పిపుచ్చుకునేందుకు మీరు చేస్తున్న ఈ కల్లోల మంతా నా గుండెల్ని మండించాలి!

ఎప్పుడో ఒక సారి దాడి చేస్తారు బయటి శత్రువులు కాని ఈ భారత దేశంలో ప్రతి అంగుళాన్ని ప్రతి క్షణం తొలుచుకుతింటున్నారు ఈ లోపలి శత్రువులు. సైనికుడుగా జీవించాలనుకున్న నేను ముందుగా ఎవరిమీద పోరాడాలో



## వ్యాపారంగా మారిన విద్య

విద్య వ్యాపారంగా మారి డబ్బు విలయతాండవం చేస్తుండటం విద్యార్థులలో అశాంతికి ఒక కారణంగా చెప్పవచ్చు దీనివల్ల ప్రతిభకు విలువ లేకుండా పోతోంది విజ్ఞానాలయాలు కావలసిన విద్యాలయాలే అవినీతికి నిలయాలుగా మారిపోతున్నాయి ఎవరికి వారు తమ పిల్లల్ని ఎక్కువ డొనేషన్ కట్టి చదివిస్తున్నామని పొంగిపోతున్నారే తప్ప యిందువల్ల విద్యా వ్యవస్థకు కలిగే విఘాతమేమిటో ఆలోచించటం లేదు ఎంత చదివినా తమకు సమాజంలో గుర్తింపు లభించటం లేదన్న విషయం విద్యార్థులను తీవ్రమైన అశాంతికి గురి చేస్తున్నదనటంలో సందేహం లేదు

—ఎస్ రాజేశ్వరరావు (విశాఖపట్టణం)



## ప్రతిభను గుర్తించక పోవటం

ప్రతిభకు ప్రాధాన్యత లేకపోవడం సామాజిక రాజకీయ ఆర్థిక పరిస్థితులు విద్యార్థుల్లో అశాంతికి ముఖ్య కారణాలుగా చెప్పుకోవచ్చు మన ప్రజాస్వామ్యంలో ఎక్కువగా కనబడుతున్న నియంతృత్వ ధోరణులు ప్రతి విషయంలోను కులం మతం అనే ప్రసక్తి తీసుకురావటంవల్ల విద్యార్థులు అశాంతికి గురవుతున్నారు ప్రభుత్వ కళాశాలల్లో ప్రతిభను గుర్తించకపోవటం ప్రైవేటు కళాశాలల్లో డొనేషన్ల వ్యవహారం విద్యార్థులను [illegible] చేస్తున్నాయి

—డి జ్వాలా నరసింహారావు (నూజివీడు)

నిర్ణయించుకుంటాను ఇకముందు"

"కాని నేను చెప్పిన పని నీవు చేసి తీరాలి"

"నామీద నీకున్న అధికారమేమిటి?" అతడు లేచి నిలబడ్డాడు

"ఒక మంచి పని చేయాలన్న ఆలోచన ఒక్కటే అధికారం" అందామె అతడు చాలా హీనమైన కంఠస్వరంతో నవ్వాడు

"ఏమంటున్నావు? మంచి పని చెయ్యాలా? మీరు మంచి పనులు కూడా చేస్తారా?"

"ఈ వీధి చివరనున్న వ్యాన్ దగ్గరకు వెళ్లి చూడు నీకే తెలుస్తుంది" అందామె

వెనుక ముందులు ఆలోచించకుండా ఆవైపు పరుగుతీశాడు రాహుల్!

అప్పటికే అనుమానం పెరిగిపోయిన కొందరు నర్సులు వ్యాన్‌లోంచి కిందికి దిగి చూచారు. ఆ వీధిలో జరుగుతున్న దోపిడీ, దహనకాండలు వారి దృష్టిలో పడ్డాయి కుప్పకూలిపోయారు

డ్యూటీ నుంచి తిరిగి వస్తూ కర్ఫ్యూ గొడవలో చిక్కుకుపోయారు యింటికి చేర్చేందుకు సాయం చేయమని పీయూషని అర్థించారు ఈలోగా దేవీప్రసాద్ సాయం అందించబోతున్నారని చెప్పిందామె

నమ్మి వెంటవస్తే ఈ మంటల మధ్య యిరికించి వెళ్లిపోయిందామె

ఒక వ్యక్తి తమవైపు రావడం చూసి వారు బెదిరిపోయారు ముందు ఆ తరువాత అందరూ బిలబిలమంటూ వ్యాన్ లోంచి దిగారు అతని చుట్టుముట్టి ప్రాధేయపడడం ప్రారంభించారు

జరిగిన విషయమంతా అతనికి వివరించారు ఒక ఆడపిల్ల ఆపదలో ఉన్న మరి కొందరు ఆడవాళ్లను రక్షించేందుకు చేసిన ప్రయత్నమే ఇది అని గ్రహించాడు రాహుల్! పీయూష ఆశయం అర్థం చేసుకున్నాడు.

మిలిటెంట్స్‌తో కలిసి పని చేస్తున్నా ఆమెలో ఒక మూల ఇంకా మానవత్వం తాలూకు మెరుపులు రంగు మాయలేదని పించింది

ఈలోగా అక్కడకు చేరుకుంది పీయూష!

"ఇక మీకేలాంటి భయంలేదు వీరు మిమ్మల్ని సురక్షితమైన చోటుకు చేర్చుతారు వెళ్లిపొండి" అంది సంతృప్తిగా

"అలా చెప్పి తీసుకువచ్చావు మమ్మల్ని ఈ మంటల మధ్య ఇరికించావు" ఒక నర్స్ అక్కసుగా అంది అందరూ పీయూషని దుమ్మెత్తిపోయడం ప్రారంభించారు ఇది కదా లోకం!

దుర్మార్గులకు భయపడుతుంది మంచి తనానికిపోతే తూర్పారపడుతుంది పీయూష తలదించుకుంది మౌనంగా

రాహుల్ పరిస్థితిని అర్థం చేసుకున్నాడు

"మీరు బాధపడకండి మీ ఆశయం నెరవేరుతుంది వారినినేను సురక్షితమైన చోటుకు చేర్చుతాను" అన్నాడు పీయూష కన్నీరు తుడుచుకుంది

(ఇంకా వుంది)

# అసంప్రేక్ష్యకారిత్వము... పంచతంత్రము ...అయిదవ భాగము

(గత సంచిక తరువాయి)















కోరుట తోనే కోరిన ఘోరా
కారము సాతెకు కలిగె


భూతము లాగా అతడు రాగా.
భీతి తోడ సరికించి
దనుజుడా, మనుజుడా, దివిజుడా
తెలియక
జనములు తికమక పడిరి


ఊరుకున్నచో ఏమగు నోయని
ఊరందరునూ కలసి
బడితెల తోడన్ బాదిరి, తోడన్
మడిసెను పాపము సాతె.


కావున నేస్తం! అతి బాదస్తం
కరము హానికరమందురు పెద్దలు
అత్యాశాపరుడగు నొక భూసుర
పైత్యం బణగిన కథ వినతేడ్దా!


ఎవరా భూసురుడు!
ఏమా
కథ?

(ఇంకా ఉంది)



# ఎన్నికల 'బూతు'ల్లో ప్రజాస్వామ్యం

"పాత చెప్పుతోనువ్వొకటి అంటే కొండచీపురుతో నే రెండంటా" అన్నట్లుగా వుంది.

"నువ్వు వెధవ్వి- నువ్వు వెధవన్నర వెధవ్వి- నువ్వు వెధవాస్క్వేర్‌వి

"దేశద్రోహీ!"

"సి.ఐ.ఏ. ఏజెంటూ-"

ఇదీ యివ్వటి కాంగ్రెసు (ఐ), ప్రతిపక్షాలకు చెందిన గౌరవ ప్రజాప్రతినిధుల- అమాత్యవర్యుల సంవాదసరళి. ఒప్పుకున్నాం- యీ ఎం.పీ.లు ఎం.ఎల్.ఏ.లు (మాజీ ఎం.పీ.లు సహా) ఆరేడు లక్షల మందికి చొప్పున ప్రతినిధులు-పార్లమెంట్ లోపల వీరికి యిష్టమొచ్చినట్లు నోరుకడుక్కొని కర్ణకఠోరమైన భాషలో తిట్టుకునే 'ఇమ్యూనిటీ' వుంది దాన్ని స్పీకర్ రికార్డ్‌ల నుంచి తొలగించిపారేస్తే అది మన దాకా రాదు (అదే మంచిది మన పిల్లలు చెడిపోతారు లేకపోతే)

ఓ తల్లి దినపత్రిక చదవమని పిల్లల్ని పోరేదిట రోజూ. ఈ మధ్య "వద్దురా! మరీ దరిద్రంగా వుంది దేశం- ఎంతసేపూ "రాజీవ్! నువ్యిక తప్పుకో" "ఎన్ టి ఆర్ నువ్విక దిగిపో" అంటూ తిట్ల ప్రహసనాలేగా వాటిల్లో- వద్దులే" అన్నదిట దినపత్రికల్లో కూడా హెడ్‌లైన్స్‌లో విచిత్రమైన యీ ధోరణి ప్రవేశించింది యీ మధ్య- నేరుగా ఆ పత్రికల వారే అంటున్నారో- ఓ ప్రజానాయకుడు లేదా ఓ "గాలి", ఓ వెంగళ్రావు, ఓ "చంద్ర", ఓ "చెన్నా..", ఓ "చిన్నా" అంటున్నాడో తెలీని గోల!

పార్లమెంట్‌లో. లోక్‌సభ ముఖ్యం అసలు ప్రజల సభ అదే అక్కడ 'గంద్రగోళం' సభా కార్యక్రమాల స్తంభన, "వాకౌట్"లాంటి శీర్షికలకి అవకాశంలేదని యివాళ పత్రికలు, విచారించక్కరలేకుండా రాజ్యసభలో వున్న పెద్దలు ఆలోటు తీరుస్తున్నారు "సంయమనం" అన్నమాట- మన ప్రజాప్రతినిధుల నిఘంటువులో నుంచి ఎత్తేశారు! అందుకే కాబోలు మన ప్రజాస్వామ్యాన్ని మనం ఎన్నికల బూతుల్లోనే కాపాడుకుంటున్నాం!

మాజీ ప్రతిపక్ష నానా గోత్రస్య ఎం పీలు యిప్పుడు రోడ్డున పడ్డారు. ఏరు తీసింది! వాగు తీసింది! వరద వెళ్ళింది! వాన వెలిసింది! ఎక్కడ ఏ రైలు పట్టాలు జారిపోయాయి? ఎక్కడ ఏ వంతెన జలగండంలో పోయింది? ఏ పేట ఏ వూరు యింకా ప్రపంచం నుంచి దూరంగా "నాని" పోతున్నాయ్? అని జనం కాలూచెయ్యీ కూడదీసుకుంటున్న దశలో వందమంది మాజీలు దేశంమీద పడ్డారు వాళ్లమీద కాంగ్రెసు (ఐ) కార్యకర్తలు విరుచుకుపడుతున్నారు అబ్బెబ్బే! యిదేం మర్యాదగా లేదు బోఫోర్సు శతఘ్నుల కొనుగోలు వ్యవహారంమీద యీసారి ఎన్నికలు "ఫైట్" చేద్దాం అనుకుంటున్నారా? వారూ వీరూ అలాగే వుంది ధోరణి! ప్రజల సమస్యలెన్ని వున్నాయి- ప్రజల తపనలెన్నెన్ని వున్నాయి?- దేశంలో 43వ స్వతంత్ర భారత దినోత్సవాలకి యిదేన ప్రతిపక్షాల సందేశం? రాజీవ్‌గాంధీ యీ జవహర్‌రోజ్‌గార్ యోజనమీద ఎర్రకో టమీద నుంచి గొంతుచించుకొని అర చేముందు- ప్రతిపక్షాలంతా దేశద్రోహు లంటూ- పంజాబ్‌లో వీళ్లే అసలు గొడవ చేస్తున్నారంటూ అరవకపోతే వొట్టు (ఇ 3 ఆగస్టున రాస్తున్నాను) ఆయన దృష్టిలో ఆయనొక్కడే దేశభక్తుడు, ఇక మళ్లీ మర్నాటినుంచి దాని ఖండనలు ప్రతిపక్ష లవారు, మొదలు! ఈ దౌర్భాగ్యదే శంలో అక్షరాస్యుల సంఖ్య తక్కువ అ



ఎన్నికల క్రీడలు

# సి అండ్ ఏ. జి. సాబ్ చతుర్వేదిగారు!

సి అండ్ ఎ జి 'బోఫోర్స్' మీద ఇచ్చిన రిపోర్టువలన ప్రస్తుతం ఆ పదవిలో ఉన్న "శ్రీ టి ఎన్ చతుర్వేది పేరు కేవలం క్విజ్జర్స్ నోళ్ళలోనే కాకుండా కాస్తో కూస్తో రాజకీయ పరిజ్ఞానమున్న అందరి నోళ్ళల్లోను నలుగుతోంది ఒక ప్రక్కన కాంగ్రెస్ ఎం పి లు కలిసి కట్టుగా, విడివిడిగా అతని అధికారాన్ని ప్రశ్నిస్తూ దుమ్మెత్తి పోస్తున్న, ప్రతిపక్షాలు ఆకాశాని కెత్తేస్తున్న శ్రీ చతుర్వేది ఇప్పటివరకు హుందాగానే ప్రవర్తిస్తున్నారు (సాధారణంగా సివిల్ సర్వెంట్స్ అలాగే ప్రవర్తిస్తుంటారు) 1984లో ఈయన్ని కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్‌గా నియమించినప్పుడే ఆడిట్స్ అండ్ అకౌంట్స్‌లో కొంత సణుగుడు గట్టిగానే వినిపించింది ఎందుకంటే ఒక ఐ ఎ ఎస్ ఆఫీసర్‌ని ఈ పదవిలో నియమించడం అంత సాదారణంగా జరగదు!

శ్రీ చతుర్వేది అల్హాబాద్ యూనివర్శిటీలో చదువు పూర్తి చేసిన తర్వాత 1950లో ఐ ఎ ఎస్ లో చేరారు 1954వ సం లో అప్పటి రాజస్థాన్ ముఖ్యమంత్రి "మోహన్‌లాల్ సుఖాడియా కి సెక్రటరీగా చేరి నాలుగు సంవత్సరాలు ఆ పదవిలో ఉన్నారు 1959 సం లో ఈయనకి "డెవలప్‌మెంట్-అడ్మినిస్ట్రేషన్ గురించి పరిశోధించటానికి ప్రపంచ బ్యాంకు ఫెలోషిప్ లభించింది దీని తర్వాత వెంటనే "అజ్మీర్ జిల్లా కలెక్టర్‌గా మేజిస్ట్రేట్‌గా పని



చేశారు మళ్ళా రాజస్థాన్‌లోనే పరిశ్రమలశాఖ డైరెక్టర్‌గా, పరిశ్రమలు, గనులుశాఖ సెక్రటరీగా మొదలైన హోదాలలో పని చేశారు 1971 నుండి 73 దాకా రాజదాని ఢిల్లీ అడ్మినిస్ట్రేషన్ విభాగం ఛీఫ్ సెక్రటరీగా పని చేశారు తరువాత ఆరు సంవత్సరాలకు 1979లో "ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ డైరెక్టర్‌గా ఢిల్లీ వచ్చారు 1981లో "యూనియన్ ఎడ్యుకేషన్ సెక్రటరీ గా చేసిన తర్వాత హోంశాఖ సెక్రటరీ అయ్యారు 1984వ సం లో కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్‌గా రాష్ట్రపతిచే నియమించబడ్డారు సి అండ్ ఎ జికి జీతం పదివేల రూపాయలతో పాటు వివిధ అలవెన్సులు కూడా వస్తాయి శ్రీ టి ఎన్ చతుర్వేది వయస్సు 61 సంవత్సరాలు

---

ఏనాటికీ వెరగదేమో?

కాంగ్రెస్ జెండాకి జాతీయ పతాకానికి వ్యత్యాసం తెలియని వయో వృద్ధులు యింకా ఉన్నారు!? వాళ్లకి బోఫోర్స్ ఫార్సు విడమర్చి చెప్పడం చాతకాని వాళ్లు మన "ఫ్రంట్" నాయకులు కాకిగోలగా నాయకులేదంటే అది అరుస్తూ పత్రికల్లో పడ్డంతో వారి జన్మ ధన్యం అయ్యింది అనుకోడం ప్రతిపక్షాల ఛోటా నాయకులు మానేయాలి- ప్రజా సేవ అంటే 42 సంవత్సరాల తర్వాత కూడా "ఆత్మస్తుతి పరనింద అనుకోరాదు" 1977లో ఒక బంగారం లాంటి అవకాశం యిచ్చిన భారత ప్రజానీకం- ఆ తరువాత పొరపాటు చేశాం అనుకొనేటంత చిత్రాతి చిత్రంగా, నీచాతినీచంగా యీ ప్రతిపక్షాల అయికమత్యం- కోతులు పీకేసిన ముత్యాల దండలాగా- కుక్కలుచింపిన విస్తరిలాగా అయిపోయింది!! మళ్లీ అటువంటి అవకాశాన్ని వీళ్లుచేచేతులా వదులుకుంటున్నారు. ప్రజలివాళ బోఫోర్సు శతఘ్నులు-వెస్టైండ్ హెలికాప్టర్‌లు-బాగానే ఎరుగుదురు ప్రభుత్వ విధానాలు వాళ్లే ఎక్కువ అనుభవిస్తున్నారు- మీ వ్యక్తిగత కష్టాలు- కక్షలు, సుఖాలు దుఃఖాలు ప్రజలమీద రుద్దకండి- మీ దగ్గర దేశంలోని దుర్భర దుస్థితికి ప్రత్యామ్నాయాలు న్నాయా?"

"అన్నీ వున్నా ప్రజల నోట్లో శని" అన్నరీతి సాగుతున్న పరిపాలన ఆశ్రితపక్షపాతాన్ని- మనిషికీ మనిషికి రాజ్యాంగబద్ధంగా చూపబడుతున్న విచక్షణని కాశ్మీర్‌లో నిప్పులకుంపటేని, పంజాబ్‌లో ఆరని కార్చిచ్చుని కొండప్రాంతాల్లో రగిలి భుగభుగమంటున్న అశాంతి అగ్నిజ్వాలల్ని- మండిపోతున్న ధరల్ని- దినదినానికి దిగజారిపోతున్న దేశభక్తి అనే "డెలికేట్ సంపదని" ఎట్లా మీరెట్లా కాపాడుతారు? మీరేవిధంగా యీ దారుణ భారతదారిద్ర్యం నుంచి ప్రజలను ఉద్ధరిస్తారు? మీ దేశంలో విదేశీయ పాలసీ లేమిటి? మీ ప్రత్యామ్నాయాలు"ఆల్టర్‌నేటివ్స్ ఎక్కడ? అని" యివాళ నగటు మనిషి నిన్నునిన్ను నిన్నూ- రాజీవ్‌గాంధీ మొదలు మామూలు కాంగ్రెస్ కార్యకర్తదాకా-ఫ్రంట్ ప్రభువులు మొదలు చివరి మార్కిస్టు కార్యకర్తదాకా అందర్నీ నిలదీసి- అడుగుతున్నాడు- కాని అది యీ మీ గోలలో మీ గందరగోళంలో మీకు వినిపించటం లేదు- ఎంచేతనంటే అదివెలుపలి చెవులతో వినేది కాదు- కనులతో చూసేదికాదు- అంతరంగంలో ఆత్మతో అవగాహనతో అర్థం చేసుకొనేది! అయ్యలారా! 80 కోట్ల మందికి ప్రతినిధులారా? మీరు మీ 'ఆత్మ'లని నిద్రపుచ్చారు! వాటినిలేపండి! ఆపండి యీ తిట్ల ప్రహసనాలు .ప్రజలు నిన్నటి "దగాపడ్డ తమ్ముళ్లే" కాని నేటికీ యింకా దగాపడే దద్దమ్మలుకారు మన ఇండిపెండెంట్ డే థాట్స్‌లో యివాళ రాజీవ్‌గాంధీ నుంచి ప్రతిపక్ష రథ చోదకుల దాకా అందరిమీద ఒక్కలాంటి కోపమే వుంది. "నాయకత్వ రాహిత్యం" యీ దేశానికి తాజాగా పట్టిన అరిష్టం అనిపిస్తోంది! తస్మాత్ జాగ్రత్త! జాగ్రత్త!!

(3-8-'89)




## చిరుచిరు దివ్వెలు

కవయిత్రి బుద్ధరాజు సులోచన పుటలు 116, వెల పది హేను రూపాయిలు, ప్రతులకు ఐ/8 గిరిరాజ సొసైటీ, స్వామి నారాయణ మందిరం ఎదుట, అట్లాద్రా, బరోడా గుజరాత్- 390012

## తమిళ సాహిత్య కథలు

ము. అరుణాచలం గారు తమిళంలో రాసిన సుప్రసిద్ధ కథలకు తేట తెనుగులో డాక్టర్ చల్లా రాధాకృష్ణశర్మగారు అనువాదం చేశారు సాహిత్య అకాడెమీ వారి ఈ ప్రచురణలో సంగ కావ్యకథలు, కావ్యకథలు, శివభక్తుల కథలు, విష్ణుభక్తుల కథలు, కవుల కథలు వగైరా వున్నాయి. మొత్తం 71 కథలు వున్నాయి 260 పుటలు, వెల 30 రూపాయలు ప్రతులకు 29 వెల్డామ్స్ రోడ్, తేనాంపేట, మద్రాసు 18కి వ్రాయవచ్చును

## మాయా ప్రపంచం

అతీంద్రియ శక్తులు, మూఢనమ్మకాలపై విశ్లేషణాత్మక పరిశీలన. రచయిత టి.ఎస్.రావ్ (హిప్నటిస్ట్), పుటలు . 152, వెల: పదిహేను రూపాయలు, ప్రతులకు : శ్రీ విజయలక్ష్మి పబ్లికేషన్స్, ఏలూరు రోడ్, షేక్‌జానీ వీధి, విజయవాడ-520 002. ఈ రచన చేయటంలో డా. జి సమరం శ్రీ రావ్‌కు సహకరించారు.

పాములు పగబట్టటం, బాణామతి,పూనకాలు, నరబలి, అంజనం, చనిపోయిన వారి ఆత్మకథలు, పునర్జన్మ వృత్తాంతాలు, మొదలైనవి ఈ పుస్తకంలో చోటుచేసుకున్నాయి

## వినాయక వ్రతకల్పము

ప్రకాశకుడు: పురాణపండ రాధాకృష్ణమూర్తి, పుటలు: 23, ప్రతులకు: పురాణపండ రాధాకృష్ణమూర్తి, జయశ్రీ టాకీస్‌కు కుడివైపు సందులో, రాజమండ్రి-4.

## గమ్యం

కవితా సంకలనం, రచయిత. వాసాల నరసయ్య, పుటలు. 50, వెల : ఐదు రూపాయలు, ప్రతులకు: వాసాలశౌరి, వరప్రసాద్ పబ్లికేషన్స్, ఇ.నె 2-1-5 0/ఎఫ్, మెటుపల్లి-505 325 లేదా అధ్యక్షుడు, త్రివేణి సాహితీ సంస్థ, కరీంనగరం-505 001 (హెచ్.పి ఒ)

## తాళిఎగతాళిచేస్తే....!

నాటిక రచయిత: మంతెన సూర్యనారాయణరాజు, పుటలు: 32, వెల: ఏడు రూపాయలు, ప్రతులకు: ఎమ్.జి. సుబ్బరాజు, గౌరీనిలయం, విజయరాయుడువీధి, అమలాపురం-533 201.

## చిలక చదువులు

హాస్యనాటిక రచయిత: మంతెన సూర్యనారాయణరాజు, పుటలు: 42, వెల. అరు రూపాయలు, ప్రతులకు. ఎమ్ జి. సుబ్బరాజు, గౌరీనిలయం, విజయరాయుడువీధి, అమలాపురం-533 201

## అభ్యుదయ వాస్తుశాస్త్రం

గృహనిర్మాణాలకు సంబంధించి 'వాస్తు'లో రచయిత వాస్తుబ్రహ్మ శ్రీ గుండాబత్తుల నారాయణరావు బి ఏ వ్రాసిన గ్రంథం వెల రు 25/లు ప్రతులకు జి లక్ష్మీబాయి, పేదరుగారి యిల్లు గంగరాజునగర్ కాకినాడ-533 009

## విశాఖపట్టణ దేవాలయాలు

విశాఖపట్టణంలో వున్న చిన్నచిన్న దేవాలయాలు, ప్రసిద్ధ దేవాలయాలు- వాటి వెనుకనున్న కథలు మొదలైనవి శ్రమతో సేకరించి-కొన్ని ఫోటోలు జత చేసి- కవిమిత్ర కవిరత్న సాహిత్య భూషణ శ్రీ వసంతరావు రామకృష్ణారావు రచించిన యీ గ్రంథంలో 60 కి మించిన వ్యాసాలున్నాయి సరళమైన శైలి బాగుంది. వెల 60 రూపాయలు, చిరునామా : రచయితపేరిట-45-50-14 అబిద్‌నగర్, వైజాగ్-16కి వ్రాయాలి

## టిప్స్ వారి క్యాసెట్స్

బొంబాయి "టిప్స్ క్యాసెట్ రికార్డింగ్" కంపెనీవారు- హిందీ చిత్రాల క్యాసెట్‌లకు ప్రసిద్ధులు- యిప్పుడు వీరు యింగ్లీషు పాప్ సాంగ్స్ ప్రపంచంలో ప్రవేశించారు. "లవ్‌మీ" అన్న పాప్‌పాటలు క్యాసెట్‌ను విడుదల చేశారు. యిందులో నయ్యాదాలీ ఆర్కెస్ట్రాతో ఏస్లీ, బివెర్లీలు పాడిన ఆరు ఉత్తేజకరమైన పాటలున్నాయి అయామ్‌డి జీ జ, ?ంగ్ సింగ్ సింగ్ వగైరాలు హిందీ చిత్రాలలో బాగా పాప్యులర్ ఆయనవే యిప్పుడు యింగ్లీష్‌లో వచ్చాయి.

టిప్స్ క్యాసెట్స్ అండ్ రికార్డ్స్ కంపెనీ వారి తాజా సినిమా పాటల క్యాసెట్‌ను వారు మార్కెట్‌లోకి విడుదల చేశారు. ధర్మేంద్ర, జయప్రద నటించిన కె.సి.శర్మ గారి 'ఎలానేజంగ్' అన్న హిందీ సినిమా పాటలు ఇందులో వున్నాయి. వెల 20 రూపాయలు. చిరునామా 9, శాంతినికేతన్, బొంబాయి-4.

ఇటీవల అనంతపురంలో అనంతపురం జిల్లా కేంద్ర సహకార బ్యాంకు వికగ వాక్ష విధాన సరళిలో రెండు సంవత్సరాలు పూర్తి చేసుకున్న సందర్భంగా సహకార పతాకావిష్కరణ జరిపి ప్రార్థనాగీతం ఆలపిస్తున్న దృశ్యం. బ్యాంకు అధ్యక్షులు శ్రీ జి రామన్న చౌదరి, జనరల్ మేనేజర్ శ్రీ ఎన్ రాధాకృష్ణారావులను, పాలకవర్గ సభ్యులు, బ్యాంకు సిబ్బందిని ఈ చిత్రంలో చూడవచ్చు.



# గళ్ళనుడికట్టు-15

## బహుమతులు




వందలాది మంది పాఠకులు అత్యంత ఉత్సాహంతో ఈ పోటీలో పాల్గొన్నారు వారందరికీ మా అభినందనలు! సరియైన సమాధానం 18 మంది పంపించారు ఎప్పటిలాగే చీట్లు తీయగా ఈ క్రింది పదిమంది పేర్లు వచ్చాయి! బహుమతి మొత్తం రు. 200/- లను వారు ఒక్కొక్కరు రు 20/-ల చొప్పున గెల్చుకున్నారు! త్వరలో ఈ బహుమతులు నగదు రూపంలో వారికి పంపే ఏర్పాట్లు జరుగుతున్నాయి

ఒకరు ఎన్ని కూపన్లైనా పంపవచ్చు. అయితే తెల్ల కాగితం మీద వ్రాసిన కూపన్‌లు చెల్లవు. సరైన సమాధానం వ్రాసిన మిగిలిన ఎనిమిది మంది పేర్లను కూడా ఈ క్రింద యిస్తున్నాము!

—ఎడిటర్

### బహుమతి పొందిన వారు

పి వి రమణయ్య (హైదరాబాద్), కె.వి సత్యనారాయణ శాస్త్రి (విశాఖపట్నం), ఎన్. హనుమత్ కుమార్ (కపిలేశ్వరపురం), బి.రామిరెడ్డి (కూడేరు), కె.నరసింహులు (బ్రహ్మంగారి మఠం), య. శ్యామసుందరం (వుడివాడ), బి సాయి బాబా (ఒంగోలు), ఎన్.మంజుల వాణి (గుత్తి), ఎం.లక్ష్మీదేవి (అనంతపురం), పి చెంచులక్ష్మి (కావలి).

### సరైన సమాధానాలు వ్రాసిన మిగతా వారి పేర్లు

వై.రామారావు (వుడివాడ), కె.ఎం.నాగవేణి (ప్యాపిలి), జి.రంగమణి (గూడాల), వి.ఆర్. ప్రసాద్ (విశాఖపట్నం), ఎం.డి.వి.సుబ్బయ్య (కర్నూలు), ఎస్.సి హెచ్.శాస్త్రి (ఖమ్మం), ఆర్.రమేష్‌బాబు (వట్టిచెరుకూరు), ఎ.వెంకటేశ్వరరావు (నంది వెలుగు)

# సాహితీ పజిల్

గెల్చుకోండి రు.200/-

# గళ్ళ నుడి కట్టు -17

### ఆధారాలు

**నిలువు**

1 నంజుకొనుట కాదు మాంసము
2 ఏడుకొండలున్న క్షేత్రం
3 నడకలో ప్రవర్తన
4 శక్తికి జన్మించిన చిలుక తాత
6 ఈమధ్య రాజకీయాలల్లో పద్మ ఋషి
7 త్రొక్కనేల కాలు కడుగనేల
8 శ్రేష్ఠమయిన టకారము ఆడు హంస
12 రక్షించే రేకు
14 కమలములలో లక్ష్మి
15 మన ఆలోచనలు వీటిలో కనిపిస్తాయి

**అడ్డం**

1 ముక్కు మీద పద్యం చెప్పి నందిని పోగొట్టుకున్నాడు
4 పరమునకు సంబంధించిన వాడు ఇతరుడు కూడ
5 తృప్తికి మరో మాట
7 అతి పెరిగితే స్త్రీ
9 కుందేలు లాంటి మచ్చ వుంటేనేం అందగాడు
10 చమారమణుడ్ని ముమారుగా మార్చండి
11 సురగ్రోలుటలో కమ్మని రాగం
13 గురు పుత్రికపై తిరుగబడ్డ శిష్యుడు
15 భరతుని తాత ఋషి
16 దర్పంతో కపలలు

ఆదారాలున్నాయి నుడికట్టు గళ్ళు నింపండి! ఈ కూపన్ కత్తిరించి మీ చిరునామా రాసి పంపండి! ఆల్ కరెక్ట్ సొల్యూషన్ పంపినవారికి రు 200/- లు బహుమతి లభిస్తుంది- ఒకరికన్నా ఎక్కువమంది కరెక్టు ఆన్సర్‌లు పంపితే వారికి బహుమతి మొత్తం పంచడం జరుగుతుంది తుది నిర్ణయం సంపాదకునిదే!

—ఎడిటర్

## గడువు తేదీ : 25-8-'89




కూర్పు పింగళి వి కృష్ణారావు

# ఆంధ్రసచిత్రవారపత్రిక

పంపినవారి పేరు :.. .. .... .. .

పూర్తి చిరునామా. .. .. .. .. .. ..

. . . . . . పిన్‌కోడ్ . ..

## అన్యాయం

ఇది చాలా అన్యాయం విమర్శనాత్మక ఉత్తరాలకు ప్రోత్సాహంగా బహుమతినిస్తామని చెప్పారు. కాని అలాంటి విమర్శనాత్మక ఉత్తరాలు రాద్దామంటే మీరు మాకు ఆ అవకాశం ఇవ్వడంలేదు. కథలు, కవితలు, వ్యాసాలు, శీర్షికలు, సీరియల్స్, కార్టూన్స్ ఇలా చెప్పుకుంటూ పోతే పత్రిక మొదటిపుట నుండి చివరి పుట వరకు ఎంతో ఆసక్తికరంగా ఆహ్లాదకరంగా వుంటోంది. కథల ఎంపికలో చాలా జాగ్రత్త తీసుకుంటున్నారు మారుతున్న కాలంతోపాటు మారని విలువలతో దేదీప్యమానంగా పత్రికారత్నంగా మన పత్రిక మున్ముందుకూడ వెలుగొందాలని కోరుతూ-

-బాణాల రమేష్‌బాబు,ఖమ్మం

## అనుభవం

సాధారణంగా నేను లైబ్రరీకి వెళ్లి వీక్లీలు చూస్తుంటాను చాలా సేపటి నుండి గమనిస్తున్నాను. ఓ వ్యక్తి ఓ వీక్లీని ప్రతి పేజీని విడవకుండా చదువుతున్నాడు నాకు ఆసక్తి పెరిగి ఏ వీక్లీనో చూద్దామని చూస్తే క్రొత్తగా వస్తున్న ఆంధ్రపత్రిక. ఇక ఇప్పట్లో నా చేతికి పత్రిక రాదని గ్రహించి బుక్‌స్టాల్‌కి వెళ్లి పత్రిక ఇమ్మని అడిగాను ఇపుడు పత్రికకి డిమాండ్ పెరిగింది ఆరు వీక్లీలు తెప్పిస్తే ఆరు హాట్ కేకుల్లా అద్దెకు తీసుకువెళ్లారు అని జవాబు వచ్చింది ఇక వెంటనే బజారుకు వెళ్లి ఆంధ్రపత్రిక కొని చదివాను. అబ్బో ఎన్ని కధలు, పసందు అయిన సీరియల్స్, కడుపుబ్బ నవ్వించే కార్టూన్‌లు, పాఠకులు పాల్గొనే కొత్త శీర్షికలు అలాగే పాఠకుల కోసం "కలం-స్నేహం" శీర్షిక ప్రవేశపెడితే బాగుంటుంది. ఇక ఆరోజు నుండి ప్రతి శుక్రవారం బజారుకెళ్లి ఆంధ్రపత్రిక కొని చదువుతున్నాను అందుకేనేమో పెద్దలు ఓల్డ్ ఈజ్ గోల్డ్ అన్నారు.

-పసుపులేటి శ్రీనివాసులు
(అనంతపురం)

## యు.ఆర్

28-7-89 తేదీ సంచికలో యు ఆర్ రావుగారి ఇంటర్వ్యూలో వారు చెప్పిన విషయాలు చాలా బాగున్నాయి చాలా విషయాలు తెలిసినవి. ఇంటర్వ్యూలో ఇంకా కొన్ని మంచి ప్రశ్నలు వేస్తే బాగుండేది ఏమైనా ఇది బాగున్నది ఇటువంటి విజ్ఞాన సంబంధ విషయములపై క్రొత్త శీర్షికలు వేస్తారని ఆశిస్తున్నాను

య శ్యామసుందరం, పూడివాడ

## ఈ వారం సలహా

పొద్దున్నే బ్లాక్ కాఫీ త్రాగండి పాలవాడు రాలేదన్న బి.పి. పోతుంది.

# వీక్లీ పోస్ట్

## శ్రీహరికోట

అందాల తార సీత ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రపత్రికలో ఈ వారం ప్రత్యేకం శీర్షికలో అంతరిక్ష పరిశోధనా సంస్థ ప్రగతిమీద ఛైర్మన్ ఉడిపి రామచంద్రరావుగారితో ఇంటర్వ్యూలో 25 సం.లో భారత అంతరిక్ష పరిశోధనా సంస్థలో శ్రీహరికోట రాకెట్ కేంద్రానికి ఢోకా లేదని అతను ఇంటర్వ్యూలో తెలియ చేయడం ఎంతో ఆనందకరమైన విషయం 1989 వింబుల్డన్ విజేతలుగా పశ్చిమ జర్మనీకి చెందిన స్టెఫీగ్రాఫ్, బోరిస్ బెకర్, ఉభయులు ఛాంపియన్ షిప్‌ను సాధించడంపై ప్రత్యేక వ్యాసం చాలా ఇంట్రస్టింగ్‌గా వ్రాశారు మరి ముఖ్యంగా "సెక్స్ విజ్ఞానం" పై డాక్టర్ జి సమరంతో జరిపిన ఇంటర్వ్యూ ఎంతో విజ్ఞానదాయకంగా ఉంది సెక్స్‌పై చాలామందికున్న అపోహలను మరియు "సెక్స్ స్పెషలిస్టులు" అంటూ బోర్డు వేసికొని వైద్యం చేసే నకిలీ డాక్టర్లే తప్ప దేశంలో ఏ యూనివర్శిటీల్లో సెక్స్‌కి సంబంధించిన ప్రత్యేక డిగ్రీ కోర్సుగాని, డిప్లొమా కోర్సుగాని లేవని తెలియజేసినందుకు, ఇంకా అనేక విషయాలు తెలియజేసినందుకు డాక్టర్ గారికి మరియు ఇంటర్వ్యూ ఏర్పాటు చేసిన ఆంధ్రపత్రిక ఎడిటర్ గారికి మా హృదయపూర్వక అభినందనలు అలాగే సాహితీ పజిల్ విషయానికొస్తే ఆల్ కరెక్ట్ ప్రచురణలకు లక్కీడిప్ తీయగా మిగిలిన వారికి ఒక కాంప్లిమెంటరీ పత్రికను పంపితే ఎంతో ఉత్సాహంగా ఉంటుందని మా అభిప్రాయం

వి. రంగస్వామి, గుత్తి

మీ సూచనకి థాంక్స్-ఎడిటర్.

## సీరియల్

మీరు అందిస్తున్న మేటి సీరియల్ 'వజ్ర సంకల్పం' మా మనసులకి కలిగిస్తోంది ఎంతో మనో వికాసబలం. అదే రీతిన సాగుతున్న మరో వజ్రం 'శత్రుసంహారం' మా హృదయాలను అలరించి, వేస్తోంది పూలహారం. ఎప్పుడెప్పుడు పత్రిక వస్తుందా అనే ఉత్కంఠత. వికసించిన చదవాలని కలిగిస్తోంది ఆకాంక్షత. ఆ రచయితలకివే మా ధన్యవాదాలు. ప్రచురిస్తున్న మీరు అందుకోండి మా కృతజ్ఞతాసుమాలు

-ఎమ్. స్వయంప్రభ, రాజమండ్రి

## సంపాదకీయం మీద సంపాదకీయం?

సీత ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వార పత్రిక (28-07-1989) అడుగడుగునా క్రొత్తదనంతో మమ్ములను ఉత్తేజం చెందించింది. "శ్రీలంకలో విచిత్ర విపత్కర స్థితి' సంపాదకీయం ప్రస్తుత పరిస్థితికి అద్దం పట్టింది శాంతిసేన ఉపసంహరణకు శ్రీలంక అధ్యక్షులు ప్రేమదాస గడువు పెట్టడం, భారత ప్రధాని రాజీవ్ వెనుదిరిగేది ఏమాత్రం లేదని కరాఖండిగా చెప్పటం సమస్యను మరింత జటిలం చేస్తున్నాయి. దీనితో లంకలో సంకటం ఏర్పడింది. ఈ నేపధ్యంలో తుల్ఫ్ నాయకుడు, శ్రీలంక పార్లమెంట్ సభ్యుడు అయిన శ్రీ అమృతలింగంను ఎల్ టి. టి ఇ కి చెందినవారు దారుణంగా కాల్చి చంపటం విపత్కర స్థితికి దారితీసింది ఇది రాస్తున్న సమయానికి ఎల్. టి టి ఇ నాయకుడు ప్రభాకరన్ కాల్చిచంపబడినట్లు పత్రికలలో వార్తలొస్తున్నాయి ఏదైనా రెండు దేశాలూ సంయమనం పాటించి ఒకే వేదికపై కూర్చుని సమస్యను సున్నితంగా పరిష్కరించాలి శ్రీలంక సమస్య అంతర్జాతీయ ప్రాముఖ్యతను సంతరించుకొంది గోటితో పోయే దానిని గొడ్డలి దాకా తీసుకురావటం నాయకులకు తగదు ఈ పరిస్థితి ఇరుదేశాల దౌత్య సంబంధాలను దెబ్బతీస్తుంది

త్వరలోనే, వచ్చే సంచికలోనే అంటూ మమ్మల్ని ఊరించి, సస్పెన్స్‌లో ముంచి చివరకు ప్రచురించిన 'అంతరిక్ష పథాన భారత్ జెండా!' ద్వారా ఇస్రో ఛైర్మన్ యు. ఆర్ రావుగారితో ఇంటర్వ్యూ ప్రచురించారు భారతదేశం అంతరిక్ష పరిశోధనలో సాధించిన విజయాలను, మున్ముందు అమలు జరుపనున్న పథకాలను ఆయన చక్కగా వివరించారు రావుగారి నేతృత్వంలో భారతదేశం అంతరిక్షంలోనికి మరింత దూసుకుపోయి ఎన్నెన్నో ఘనకార్యాలు సాధించగలదని ఆకాంక్ష.

ఎస్ రాజేశ్వరరావు,
విశాఖపట్నం.

## గమనిక

సమయానికి అందని కారణంగా ఈవారం "వారఫలం" అదించలేక పోయాము

-ఎడిటర్




## "శృంగారయాత్ర"

"కళాత్మకరీతిలో 'ఆనందతాండవం' చిత్రాన్ని తీసి నష్టపోయాను. ఈ చిత్రాన్ని మాత్రం కమర్షియల్ ఎలిమెంట్స్‌ను దృష్టిలో పెట్టుకుని తీస్తున్నాను. కథానాయకుడు ఇరవై రెండేళ్ళ వయస్సులోనే సినిమాలలో సూపర్‌స్టార్‌గా వాసికెక్కుతాడు. ఇద్దరు నాయికలలో ఒకామె సినిమాలలో కొత్తగా ప్రవేశించిన తార. మరొకామె ఫిలిమ్ జర్నలిస్టు (గిరిజ). ప్రధానంగా ఇది ప్రయణగాథ. ఇందులో సెక్స్ ప్రాబ్లమ్ ఉంటుంది. పాత్రికేయుడు బి కె.ఈశ్వర్ మాటలు-పాటలు ఎంతో చక్కగా రాశారు" అన్నారు ఎ. రఘురామిరెడ్డి. ఈయన కథ-స్క్రిన్ ప్లే-దర్శకత్వంలో శ్రీమతి ఎ. శరణ్యా రెడ్డి నిర్మించే ప్రేమచిత్ర వారి "శృంగార యాత్ర" చిత్రంలో గిరిజ, రచన, సంజయ్‌మిత్ర, వేలు, చారుహాసన్ ఆదిగాగల వారు పాల్గొంటున్నారు. ఎల్. వైద్యనాథన్ సంగీతం, మధు అంబట్ ఛాయ, పి. కృష్ణమూర్తి శిల్పం, కరుణానిధి కూర్పుతో ఎ. జగన్మోహనరెడ్డి సహ నిర్మాత.

## "బాలగోపాలుడు" బాలకృష్ణ

"ఆగస్ట్ మూడవ వారంలో రిలీజ్‌కు సన్నాహాలు చేస్తున్నాం" అన్నారు ఎం.ఆర్.వి. ప్రసాద్. ఈయన నిర్మించే పి.బి. ఆర్ట్ ప్రొడక్షన్స్ "బాలగోపాలుడు" సినిమాస్కోప్ చిత్రంలో బాలకృష్ణ, సుహాసిని, రేఖ, జగ్గయ్య, మోహన్‌బాబు, రావుగోపాలరావు, గిరిబాబు, అల్లు రామలింగయ్య, చిట్టిబాబు, మల్లికార్జునరావు, భీమేశ్వరరావు, చిడతల అప్పారావు, సంయుక్త, బేబీ విజయ, ఒక కీలకమైనపాత్రలో నందమూరి కళ్యాణరామ్ నటించారు. సత్యానంద్ సంభాషణలకర్త, రాజ్-కోటి స్వరకల్పనలో సి. నారాయణరెడ్డి, వేటూరి గీతాలు రాశారు. శరత్ ఛాయ, శ్రీనివాస రాజు శిల్పం, శివసుబ్రహ్మణ్యం నృత్యాలు, త్యాగరాజన్ సాహసాలు, కె. అమరేశ్వరరావు సంయుక్త దర్శకత్వం, కె. శివకుమార్-బుజ్జి సహకార దర్శకత్వం, సురేష్ తాతా కూర్పుతో కోడి రామకృష్ణ దర్శకుడు.

"కొత్త పెళ్ళికూతురా రా!"లో రాధిక

# సినిమా

## జీవిత సమర్పించే "మగాడు"

"మద్రాసులో, ఎర్నాకులం అడవుల్లో షూటింగ్. 'మూనాయ్ ముర' అనే మళయాళ చిత్రం ఆధారం. దాని దర్శకుడు కె. మధునే మా చిత్రానికీ దర్శకునిగా నియమించాం" అన్నారు అర్జున్ బి. దేవరాజ్. ఈయన నిర్మాతగా నటి జీవిత సమర్పించే శ్రీ నవనేత్ర ప్రొడక్షన్స్ "మగాడు" చిత్రంలో రాజశేఖర్, నవనటుడు అర్జున్‌దేవ్, మురళి, రమణారెడ్డి, బాలాజీ, సంజీవి, శివాజీరాజు, పూర్ణం విశ్వనాథం, పి. జె. శర్మ, ఆలి, లిజి, సుకుమారి, బేబీ షామిలి, ఒక కీలకమైన పాత్రలో మురళీమోహన్ నటిస్తున్నారు. స్వామి కథకు సంజీవి స్క్రీన్‌ప్లే-మాటలు సమకూర్చారు. వేటూరి గీతాలు, రాజ్-కోటి సంగీతం, విలిన్‌దాస్ ఛాయ, ఎస్. కృష్ణమూర్తి-గుణశేఖర్ సంయుక్త దర్శకత్వం, త్యాగరాజన్ సాహసాలు, జె.వి. వి. సత్యనారాయణ సహకార దర్శకత్వం, వి. పి. కృష్ణన్ కూర్పుతో సురేష్ కె. వి. ప్రొడక్షన్ డిజైనర్, సాయిరత్న ప్రొడక్షన్ కంట్రోలర్, మురళి శ్రీనివాస్, బాబూ గణేశ్ ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్.



## కృష్ణ, రమేష్‌బాబు

"కృష్ణ సరసన రాధ నాయిక. రమేష్‌బాబు పక్కన బొంబాయి తార నటిస్తుంది" అన్నారు కె. మురళీమోహనరావు. ఈయన స్క్రీన్‌ప్లే - దర్శకత్వంలో జి. సత్యనారాయణ నిర్మించే శ్రీ బాలాజీ ఫిలిమ్స్ చిత్రంలో సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, సుధాకర్ ఆదిగాగలవారు పాల్గొంటున్నారు. పరుచూరి సోదరులు కథ-మాటలు రాశారు. వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. హరి ఛాయ, రాంచంద్రసింగ్ శిల్పం, వెంకటరావు- కాళీ ప్రొడక్షన్, ప్రసాద్ సహకార దర్శకత్వం, జి. శివయ్య నిర్వహణలో చిరంజీవిరాజు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. నాలుగు షెడ్యూల్స్‌లో నవంబర్‌కు షూటింగ్ ముగుస్తుంది.

## పవన్ ఎంటర్‌ప్రైసెస్ చిత్రాలు

ఎ.వి.కెరెడ్డి సమర్పణలో "శ్రీమతి ఒక బహుమతి" అనంతరం పవన్ ఎంటర్‌ప్రైసెస్ అధినేతలు ఎ.సుధాకరరెడ్డి, కరుణాకర్ రెండు చిత్రాలు నిర్మిస్తున్నారు. సాంప్రదాయాన్ని గౌరవించే అత్తకు అత్యాధునికతను వాంఛించే కోడళ్ళకు మధ్య ఘర్షణ ఇతివృత్తంగా ఓ తమిళ చిత్రం ఆధారంగా తయారవుతున్న "తల్లా-పెళ్ళామా?"లో వాణిశ్రీ, జయంతి, నరేష్, గొల్లపూడి మారుతీరావు, కల్పన, ఆనంద్‌బాబు, రమణమూర్తి, భాగ్యలక్ష్మి పాత్రధారులు. గణేష్‌పాత్రో మాటలు, సి.నారాయణరెడ్డి పాటలు, కె.వి.మహదేవన్ సంగీతం, ఫిలిప్స్ ఛాయ, దాసంశాయినగా ప్రసాద్-బాలగన్ సంయుక్త దర్శకత్వం, తాండవకృష్ణ-మాంధాత ప్రొడక్షన్, గణేష్‌కుమార్ కూర్పుతో 'విశు' శిష్యుడు టి.పి. గజేంద్రన్ దర్శకుడు.

సుమన్, భానుప్రియలతో సెప్టెంబర్ 11న సెట్స్‌కు వెళ్ళే సస్పెన్స్ చిత్రానికి గొల్లపూడి కథ, మాటలు వ్రాశారు, ముత్యాల సుబ్బయ్య దర్శకుడు.

## "రాముడు కాదు రాక్షసుడు"

సుమన్ సరసన రాధ, భానుప్రియ నాయికలు, శ్రీవిద్య హీరో తల్లి. ఆనంద్ అనే ఒక కొత్త విలన్‌ను పరిచయం చేస్తున్నారు. దాసరి కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు సమకూర్చి, దర్శకత్వం వహించే ప్రభావతి ఆర్ట్ ప్రొడక్షన్స్ చిత్రానికి వి.ఎస్. ఆర్.స్వామి ఛాయ, రాజ్-కోటి సంగీతం, పేకేటి రంగా శిల్పం, కృష్ణంరాజు కూర్పు తెరవెనుక హంగులు. "సుమన్ జన్మదినమైన ఆగస్ట్ 28న షూటింగ్ ప్రారంభం, డిసెంబర్ 30కి షూటింగ్ ముగుస్తుంది. సంక్రాంతి కానుకగా జనవరి 14న విడుదల" అన్నారు నిర్మాత అట్లూరి రాధాకృష్ణమూర్తి.




"శ్రీ రాఘవేంద్ర ఆర్ట్ పిక్చర్స్ చిత్రం ఓ దృశ్యం

## చిరంజీవి, శ్రీదేవి

"కొత్త దర్శకరచయిత యండమూరి వీరేంద్రనాధ్ కథకుడు. సుప్రసిద్ధ దర్శక రచయిత జంధ్యాల సంభాషణలకర్త. ప్రముఖ దర్శకుడు కె. రాఘవేంద్రరావు డైరెక్టరు. చిరంజీవి సరసన శ్రీదేవి నాయిక. ఇక ఈ చిత్రం ఎంతటి సంచలనం సృష్టిస్తుందో ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు" అన్నారు సి. అశ్వనీదత్. ఈయన నిర్మించే వైజయంతీ మూవీస్ కొత్త చిత్రానికి ఇప్పుడు స్క్రిప్టు పని జరుగుతోంది.



"కొడుకు దిద్దిన కాపురం"లో మహేష్‌బాబు

## "నిప్పురవ్వలు"

"ఆగస్టు 27 న ప్రారంభోత్సవం," అన్నారు రాజ్‌బాబు. ఈయన నిర్మించే జయప్రద మూవీ ఇంటర్నేషనల్ వారి "నిప్పురవ్వలు" చిత్రంలో కృష్ణ, కృష్ణంరాజు, జయప్రద, శ్రీరాంకుమార్, సీత ఆదిగాగలవారు పాల్గొంటారు. సత్యమూర్తి మాటలు, రాజ్ కోటి సంగీతంతో శ్రీరాంకుమార్ ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్. స్క్రీన్ ప్లే, దర్శకత్వం: శ్రీకాంత్ నహతా.




"అడవి సుందరి"లో విద్యశ్రీ

## "రౌడీయిజం జిందాబాద్"

"ప్రస్తుత సమాజంలో రౌడీయిజం విశ్వంఖలంగా చెలరేగి, అమాయక ప్రజల కుటుంబాలను ఎంత హృదయవిదారకం చేస్తున్నాయో - ఒక రచయిత ఆవేదనలోంచి ఉరికిన యదార్థ సంఘటనలకు ప్రతిరూపం," అన్నారు కోదండరామిరెడ్డి ఈయన దర్శకత్వంలో కె ఎస్ రామారావు సమర్పించే భామా ఆర్ట్ క్రియేషన్స్ ద్వితీయ చిత్రం "రౌడీయిజం జిందాబాద్"లో రాజశేఖర్, వాణీ విశ్వనాథ్, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, ప్రసాద్‌బాబు, రాళ్ళపల్లి, బ్రహ్మానందం, చిట్టిబాబు, వినోద్, అరుణ్‌కుమార్, అంజనేయులు, మాస్టర్ రాంగోపాల్, నిర్మల, అన్నపూర్ణ, లక్ష్మి, బేబీ కీర్తితోపాటు మలయాళ నటులు జానీ, మోహన్‌రాజ్, కీలకమైన పాత్రలు ధరిస్తున్నారు జి సత్యమూర్తి మాటలు, వేటూరి పాటలు, చక్రవర్తి సంగీతం, సుధాకరరెడ్డి ఛాయ, అరుణ్ గోడ్‌గాంక్వర్ శిల్పం, బాషా సాహసాలు అజయ్‌కుమార్ సంయుక్త దర్శకత్వం, పి ఎస్ రాయ్ సహకార దర్శకత్వం, సాయి ప్రొడక్షన్‌తో ఈ చిత్రాన్ని నిర్మిస్తున్న సి హెచ్ వి

అప్పారావు "మలయాళంలో సంచలనం సృష్టించిన 'కిరీటం' చిత్రం ఆధారం రెండు షెడ్యూల్స్‌లో ఆగస్ట్ నెలాఖరుకు షూటింగ్ పూర్తవుతుంది" అన్నారు ●

Editorial Adviser *S RADHAKRISHNA*, Editor *VEERAJI*
Printed and Published by *S NAGESWARARAO* for Nageswara Rao Estates Ltd
at the Andhra Patrika Press Gandhi Nagar Vijayawada 520003
Phones Editorial 75667 Business 61247 61248

# ప్రతి ఒక్క మోడల్ ఉత్కృష్టమైన సాంకేతికతకు ప్రతిబింబం అందాల దృశ్యాలకు ఆలవాలం



ఐటిఇ.
మా అభిరుచికి, ఆలోచనకు దర్పణం.

# ITE

బ్లాక్ & వైట్
మరియు
కలర్
టీవీలు